జాతీయ జీవిత గ్రంథమాల

# అశుతోష్ ముఖర్జీ

ర చ న

ఎ. పి. దాసుగుప్త

అ ను వా ద ం

భమిడిపాటి రామగోపాలం



నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా

కొత్తఢిల్లీ

# విషయసూచిక


పుటలు

1. తొలిరోజులు 1
2. న్యాయవాదిగా, న్యాయమూర్తిగా 9
3. కలకత్తా యూనివర్శిటీ (1889–1906) 16
4. శాసనసభలో, కలకత్తా కార్పొరేషన్‌లో అశుతోష్ (1899–1904) 29
5. కలకత్తా యూనివర్శిటీలో (1906–1914) 39
6. కలకత్తా యూనివర్శిటీ (1914–1923) 57
7. చివరి రోజులు 83
8. సంఘాల్లో, సంస్థల్లో, పరిషత్తుల్లో అశుతోష్ 90
9. వ్యక్తిగా అశుతోష్ ముఖర్జీ 97
10. సరస్వతీ ఉపాసకుడు 106

# 1. తొలి రోజులు

అనేకమంది పేరుమోసిన సంస్కృత పండితులు జన్మించిన వంశానికి చెందినవాడు. అశుతోష్ ముఖర్జీ. ఆయన పూర్వుల్లో చాలామంది బెంగాలీలో పుష్కలంగా రచనలు చేశారు. రామాయణాన్ని బెంగాలీలోకి అనువాదంచేసి, ప్రఖ్యాతుడైన కృత్తివాసఓఝూ, ముత్తాత నరసింగ ఓఝూ అశుతోష్ పూర్వుల్లో ఒకడైన రాం ముఖర్జీ సోదరుడు. రాజకీయ పరిణామాల వల్ల నరసింగ ఓఝూ, తూర్పు బెంగాల్ సోనార్‌గాంలోని పిత్రీయమైన గృహాన్ని విడిచిపెట్టి ఘులియాలో స్థిరపడ్డాడు. ఇది ప్రస్తుతపు బెంగాలులోని, నడియా జిల్లాలో, శాంతిపూర్ సమీపంలో ఉంది. అశుతోష్ తాతగారు బిశ్వనాథ్, పశ్చిమ బెంగాల్ హుగ్లీ జిల్లా జీరట్ గ్రామంలో మేనమామ గారింట పెరిగాడు. తన కుటుంబ శాఖకి ఆదేస్థానంగా అక్కడ స్థిరపడ్డాడు. రామచంద్ర తర్కాలంకార్ అని కలకత్తా సంస్కృత కళాశాలలో ప్రఖ్యాతి చెందిన ఆచార్యులుండేవారు. ఆయన అశుతోష్‌కి వేలు విడిచిన ముత్తాత. ఆయన కొడుకు నవగోపాల్‌కూడా సంస్కృత కళాశాల అధ్యాపకుడే. అశుతోష్ తాతగారు బిశ్వనాధ్, కల్నానుంచి రంగపూర్‌కి తన నదీ ప్రయాణం గురించి బెంగాలీలో పుస్తకం వ్రాశాడు. నవీన వంగభాష రూపు దిద్దుకుంటున్న ఆ రోజుల్లో, బెంగాలీలో లలితమైన వచన శైలికి ఈ పుస్తకం మార్గదర్శకం అయింది. అశుతోష్ బాబాయిగారైన దుర్గాప్రసాద్ బోలెడు పాత బెంగాలీ వ్రాత కావ్యాలను అవలీలగా అప్పచెప్ప గలిగేవాడు, ఇంకో బాబాయి హరిప్రసాద్, బెంగాలీలో వచనమూ, పద్యమూ కూడా చెప్పారు. ఆయన వ్రాసిన "బిచిత్ర బంగచిత్ర" అన్న పుస్తకం 1887లో ప్రచురితమైంది.

అశుతోష్ తండ్రిగారు గంగాప్రసాద్. ఈయన 1861లో కలకత్తా ప్రెశిడెన్సీ కాలేజీలో బి. ఏ. పాసయ్యాడు. తరువాత కొంతకాలం "లా" చదివి కూడా, వైద్య కళాశాలలో చేరాలని నిర్ణయించుకున్నాడు. 1866లో

అది పూర్తయింది. 1864 జూన్ 29వ తేదీని; అంటే అతనింకా వైద్య కళాశాల విద్యార్థిగా ఉంటున్నప్పుడే, కలకత్తా బౌ బజార్లో, మలంగా లేన్‌లో ఓ యింట్లో అశుతోష్ ముఖర్జీ జన్మించాడు.

మెడికల్ కాలేజి విద్యార్థిగా గంగాప్రసాద్ గొప్ప ప్రతిభను ప్రదర్శించి, "మిడ్‌వైఫరీ"లో బంగారు పతకాన్ని సాధించాడు.

గంగాప్రసాద్ వైద్య కళాశాల వదిలిన కొన్నాళ్ళకి, వైస్రాయిగారి బలగంలో ఇతనికి డాక్టరుగా పార్ట్‌టైం ఉద్యోగం యివ్వవలసిందిగా ప్రిన్సిపాల్‌గారు,వైస్రాయిగారి మిలిటరీ సెక్రెటరీకి శిఫార్సు చేసారు.ఆ మిలిటరీ సెక్రటరీ గంగాప్రసాద్‌ని పరీక్షించి, మరునాడే వచ్చి చేరమన్నాడు. కాని సరైన దుస్తులు వేసుకుని రమ్మన్నారు. గంగా ప్రసాద్ ధోవతి కట్టుకుని చొక్కా కోటూ వేసుకుని చెప్పులు తొడుక్కుని వెళ్ళారు. ప్యాంటు వేసుకుని రమ్మన్నారు. గంగాప్రసాద్ అలాగే ప్రిన్సిపాల్‌గారి వద్దకు వెళ్ళి, ఆ మిలిటరీ సెక్రటరీ తనని ఎంతో దయగా చూసినప్పటికీ వారికి కావలసింది మంచి పంట్లామేగాని మంచి డాక్టరు కాదు సుమండీ" అని చెప్పాడు. అంతే ఆ ఉద్యోగం స్వీకరించకూడదని నిర్ణయం అయిపోయింది. ఆర్థికంగా వొత్తిడి అధికంగానే వుంది. అయినా సరే, స్వతంత్రంగా వృత్తి చేపడతానన్నాడు.

అసలు అశుతోష్‌కి ఆ గొప్ప ఆత్మగౌరవబలం ఎలా సంక్రమించిందో తెలియడానికి, గంగాప్రసాద్ తొలిదినాలనుంచి ఈ సంఘటన గుర్తుకి తెచ్చుకోడం సమంజసం కదా.

అప్పట్లో భవానీపూర్ అంటే, ప్రఖ్యాతులైన బెంగాలీలకి ఆటపట్టు అన్నమాటే. గంగాప్రసాద్ తన ప్రాక్టీసు అక్కడ పెట్టాలని నిర్ణయించాడు. అంతే, ప్రాక్టీసు త్వరగా పెద్దదై, 1872 కల్లా రుస్సారోడ్‌లో నివాస గృహాన్ని నిర్మించాడు. విద్యపట్ల మక్కువవున్న అతని దృష్టి, అతనిచేత వైద్యశాస్త్రంలో పుస్తకాలు వ్రాయించింది. ఆయన వ్రాసిన "ప్రాక్టీస్ ఆఫ్ మెడిసిన్" బాగా పేరుపొందింది. అనాటమీ మీద ఒక పుస్తకం: ప్రత్యేకించి పిల్లల తల్లుల కోసం బెంగాలీలో "మాతృశిక్ష" అని ఒక పుస్తకం ఆయన వ్రాశాడు. గంగాప్రసాద్ అభిరుచి బహుముఖం. వైద్య

శాస్త్రం కాక మరెన్నో విషయాలకి సంబంధించిన పుస్తకాలు చదివాడు. ఎన్నో ఆంగ్ల కవితలు అతనికి కంఠస్థం వొచ్చేవి. అవన్నీ (కొడుకు) అశుతోష్‌కి వినిపించేవాడు. ఆ విధంగా అశుతోష్, చిన్న బడిపిల్లాడప్పటికే మిల్టన్ వ్రాసిన "పేరడైజ్ లాస్ట్" మొదటి అధ్యాయం: "ప్లెషర్స్ అఫ్ హోప్" ఇంకా అనేక ఆంగ్ల కవితల్ని కంఠస్థంగా నేర్చేసుకున్నాడు. పొద్దుటే కలిసి షికారెడుతున్నప్పుడు గంగాప్రసాద్: మహనీయుల జీవితాలను గురించి, వారి మహత్కార్యాలను గురించి కొడుకుకు చెప్పేవాడు. కొడుక్కి జ్ఞానం అంటే ఉన్న ఆసక్తి ఎరిగి, ఇంటి నిండా అందు కనుగుణమైన పుస్తకాలు నింపసాగాడు. తన కొడుకులో గొప్పవాడు కాగల లక్షణాలను కనుగొని, గంగాప్రసాద్; వాణ్ణి సరైన తోవలో నడిపించడానికి తనకి చేతనైనదంతా చేశాడు.

అశుతోష్ తొలి చదువులు కలకత్తా భవానీపూర్ చక్రబెరియా స్కూల్లో జరిగాయి. పదో యేట తీవ్రమైన అస్వస్థత కారణంగా అతని చదువుకి అంతరాయం ఏర్పడింది. గాలి మార్పుకోసం అతన్ని మధుపురకు పంపారు. 1876లో కలకత్తాకి తిరిగొచ్చేసరికి అతనికి పన్నెండేళ్ళు. అప్పుడు భవానీపూర్ లోనే, సౌత్ సబర్బన్ స్కూల్లో చేరాడు. అటు స్కూల్లో హెడ్మాస్టరూ తక్కువ వాడు కాదు: రచయిత, సంఘ సంస్కర్త, విద్యావేత్త, ప్రవక్త అయిన పండిత శివనాథశాస్త్రి ఇటు ఇంటి దగ్గిర గురువూ సామాన్యుడు కాదు; మధుసూదన్‌దాసు (అనంతరం ఒరిస్సాలో జనప్రియ నాయకుడుగా రూపొందినాడు)

అశుతోష్ 1879లో కలకత్తా విశ్వవిద్యాలయ ప్రవేశ పరీక్ష వ్రాసి, ద్వితీయుడుగా ఉత్తీర్ణుడై కలకత్తా ప్రెసిడెన్సీ కాలేజిలో చేరాడు, 'స్వామి వివేకానంద'గా రూపొందిన నరేంద్రనాథ్‌దత్తా అతని సహాధ్యాయి. అశుతోష్ తన సహాధ్యాయుల్లో ప్రముఖంగా వుండేవాడు. ఇంకా ఎఫ్.ఏ. విద్యార్థే; కాని ఏ భాషవో, ఉన్నత గణిత గ్రంథాలో చదువుతూ కనబడేవాడు.

హఠాత్తుగా ప్రెసిడెన్సీ కాలేజి గణిత శాస్త్ర ఆచార్యుడు డాక్టర్ హ్యూ మెక్కాన్ దివంగతుడైనప్పుడు; ఆయన స్మృతి చిహ్నం నెలకొల్పే నిమిత్తం ఒక సంఘాన్ని ఏర్పరచి ఆ కార్యభారం అంతా నిర్వహించడంలో

# అశుతోష్ ముఖర్జీ

అశుతోష్ యొక్క నిర్వహణా సామర్థ్యం స్పష్టంగా వెల్లడైంది. ఉన్నపళంగా చందాలు పోగుచేసి ప్రెశిడెన్సీ కాలేజి గ్రంథాలయంలో ఒక పాలరాతి స్మారక ఫలకాన్ని స్థాపింప జేయగలిగాడు అశుతోష్. ఆ ఫలకం ఆవిష్కరణ సందర్భంగా అశుతోష్ చేసిన ప్రసంగం పరిశుద్ధమైన ఆంగ్లభాషలో ఉండడమే గాక, అతని వక్తృత్వపు ప్రతిభను చాటిచెప్పి శ్రోతల మన్ననల నందుకుంది. కళాశాల వాద వేదికలో తరుచుగా పాల్గొనడంవల్ల చక్కని వాదనా పటిమ, ఆలోచనలను క్రమబద్ధంగానూ సరళంగానూ చెప్పగలగడం అతనికి అలవాటయింది. దీర్ఘకాలంగా పీడిస్తున్న తలనొప్పితో బాధపడుతూ విపరీతమైన అస్వస్థతతో ఉంటూకూడా, 1881లో మొదటి స్థాయి కాలేజి పరీక్ష వ్రాశాడు. అదికాక; కుడిచేతికి ఎలక్ట్రిక్‌షాక్ యిచ్చినప్పుడే వ్రాయ గలిగే వాడు, అయినా, అప్పుడు ఉత్తీర్ణులైన వారిలో తృతీయ స్థానంలో వచ్చాడు.

అశుతోష్ ఇంకా ప్రెశిడెన్సీ కాలేజి విద్యార్థిగా వుండగానే, మే 1883లో ఒక అపురూపమైన సంఘటన జరిగింది. అదే అతడొక రాజకీయ ప్రదర్శనలో పాల్గొనవలసి రావడం. ప్రముఖ జాతీయోద్యమ నాయకుడు సురేంద్రనాథ్ బెనర్జీమీద నడిచిన ప్రఖ్యాత కోర్టు ధిక్కారనేరం కేసు సందర్భంగా ఈ సంఘటన ప్రాప్తించింది. జస్టిస్ నారిస్ అనే కలకత్తా హైకోర్టు న్యాయమూర్తి ఒక కేసు సందర్భంగా, ఒకానొక హిందూ కుటుం బాన్ని, వారి పూజా విగ్రహాలను కోర్టులో దాఖలు చేయవలసిందిగా ఉత్తర్వు వేయగా, ఆ విధంగా హిందువుల ధార్మిక భావాలను గాయపరచినట్లు, తన ఆంగ్ల దినపత్రిక "బెంగాలీ"లో సురేంద్రనాథ్ బెనర్జీ ఘాటుగా విమర్శించాడు. దాంతో కోర్టు ధిక్కార నేరంకింద అతన్ని 1883 మే 3వ తేదీని హైకోర్టు ఫుల్ బెంచి సమక్షంలో విచారించి ఖైదు శిక్షవేశారు. ఆ నాటి ఆ సంఘట నను సురేంద్రనాథ్ బెనర్జీ ఇలా వర్ణించాడు. "విద్యార్థిలోకం ఒక బలీయ మైన శక్తిగా అవతరించింది. వాళ్ళలో కూడా తర్వాత కొందరు రాజసేవకు లయినవారూ ఉన్నారు. ఆ తీర్పు విన్నాక జరిగిన పెద్ద ప్రదర్శనలో యువ తరం; అన్ని దేశాలలోనూ, ఆగ్రహ పూరితులైన యువకులు చేసినట్టే చేశారు; కిటికీలు బద్దలుకొడుతూ పోలీసులమీద రాళ్ళు రువ్వుతూ తమ కోపాన్ని వ్యక్తం చేశారు, ఆ ఉగ్రమూర్తులలో ఒకడు అశుతోష్ ముఖర్జీ!

........"* మతమూ, ఒకే జాతీయతా భావమూ ఏకమై అశుతోష్ హృద యాన్ని మధించి వేసిన సంఘటన ఇది....

ఆ రోజుల్లో ఆనర్స్ కోర్సులులేవు. అంచేత అశుతోష్, తన బి. ఏ. పరీక్షకి "ఏ" కోర్సు తీసుకున్నాడు. అందులో అభిమాన విషయాలు: ఇంగ్లీషు, గణితశాస్త్రం, సంస్కృతం, తత్త్వశాస్త్రం.

అశుతోష్ 1884లో విశ్వవిద్యాలయానికి ప్రథమ స్థానంలో బి. ఏ. పాసయ్యాడు. ఈషణ్, విజయనగరం స్కాలర్ షిప్పులు, హరీశ్‌చంద్ర బహుమతి పొందాడు. ఆ ఏడాదే అతను లండన్ మేథమేటికల్ సొసైటీ సభ్యుడయ్యాడు. అలాగే 1885లో గణితశాస్త్రం పర్యంగా ఎం. ఏ. పాసయిన వారిలో అగ్రగణ్యుడుగా వచ్చాడు. 1884, 1885 సంవత్సరాల స్నాతకోత్సవ ప్రసంగాల్లో వైస్ ఛాన్సలర్లు అతన్ని గూర్చి ప్రత్యేకంగా ప్రశంసించారు. 1886లో (విశ్వవిద్యాలయంలో మిక్కిలి అభిలషణీయమైన) ప్రేంచందు స్కాలర్ షిప్పు; ఆ ఏడాదే మళ్ళీ భౌతికశాస్త్రం విషయంగా ఎం.ఏ. పట్టా; పొందాడు. ఆ విధంగా కలకత్తా విశ్వవిద్యాలయంలో రెండు విషయాలతో ఎం ఏ. డిగ్రీలు సాధించిన మొదటి విద్యార్థి అయ్యాడు అశుతోష్. గణితశాస్త్రం భౌతికశాస్త్రం అంటే అతనికి అభిలాష ఎక్కువే అయినా చరిత్రలో, ఇంగ్లీషు, వాఙ్మయంలో, తత్త్వశాస్త్రంలో అతనికున్న జ్ఞానం కూడా లోతైనదే. అంచేత ఈ మూడు విషయాలలో పి.ఆర్.ఎస్. పరీక్షలకు కూర్చోవడానికి అనుమతించ వలసిందిగా విశ్వవిద్యాలయానికి దర ఖాస్తు చేశాడు. కాని అది లభించలేదు.

1887లో. ఎం. ఏ. (మేథమేటిక్స్) పరీక్షకు పరీక్షాధికారిగా, నాలు గేళ్ళపాటు ఆ విధంగా కొనసాగేటట్లు నియమితుడయ్యాడు అశుతోష్. కలకత్తా విశ్వవిద్యాలయంలో, ఒక ప్రముఖ విషయంపై అత్యున్నతమైన పరీక్షకు పరీక్షాధికారిగా నియమితుడైన తొలి భారతీయుడూ అతనే. అంతకు ముందు సంస్కృతం అరబిక్ పర్షియన్‌లలో తప్ప మిగతా అన్ని విషయాలలో ఎం.ఏ పరీక్షకు పరీక్షాధికారులుగా యూరపియన్లు మాత్రం నియమించబడేవారు.

---

*సురేంద్రనాథ్ బెనర్జీ : ఎ నేషన్ ఇన్ మేకింగ్ - 1963 కూర్పు-పుట 71

1885 లో అశుతోష్ "లా" చదవడానికి ఉద్యమించాడు. 1888లో బి. ఎల్. పరీక్ష ప్రాసయ్యాడు. కలకత్తా సిటీ కాలేజి "లా" విద్యార్థిగా అతను అప్పటికి ప్రముఖ న్యాయవాదిగా వుండి, దరిమిలాను "బ్రిటిష్ హౌస్ ఆఫ్ లార్డ్స్"లో రాయపూర్ బేరన్ సిన్హాగా స్థానం సంపాదించుకున్న సత్యేంద్ర ప్రసన్న సిన్హాకి శిష్యుడయ్యాడు.

న్యాయశాస్త్ర విద్యార్థిగా అశుతోష్ అందులోనూ గాఢమైన అభిరుచిని వ్యక్త పరచాడు. మూడు సంవత్సరాలపాటు వరసగా "టాగోర్ లా లెక్చర్స్"కి హాజరై ఆ ఉపన్యాసాల విషయంలో నైపుణ్యం చూపినందుకు బంగారు పతకాన్ని సాధించుకొన్నాడు.

విద్యార్జన విషయంలో అశుతోష్ సాధించినన్ని విజయాలను చాలా మంది విద్యార్థులు సాధించి ఉండవచ్చు. కాని అశుతోష్ కేవలం ఆ మందిలో ఒకడుకాడు. అతనొక మేధావి. ఆ మేధావితనం అతనికి ఇరవై ఏళ్ళు రాకముందే వ్యక్తమవుతూ వచ్చింది. అంతెందుకు? "పరిశోధన" అనే ప్రక్రియ భారతదేశానికే తెలియని కాలంలో, ప్రెశిడెన్సీ కాలేజికి చెందిన ఈ యువవిద్యార్థి భారతదేశంలోనూ విదేశాల్లోనూ వెలువడ్డ అనేక పత్రికల్లో అబ్బురమనిపించే వ్యాసాలు వ్రాసి ప్రచురించేవాడు. 1881లో ప్రెశిడెన్సీ కాలేజీలో అశుతోష్ ఎఫ్ ఏ చదువుతూ ఉండగా, యూక్లిడ్ మొదటి సంపుటంలో 25వ సిద్ధాంతానికి ఒక కొత్త నిరూపణను చూపుతూ అతను వ్రాసిన వ్యాసాన్ని కేంబ్రిజ్ నుంచి వెలువడుతున్న "మెసెంజర్ ఆఫ్ మేథమేటిక్స్"లో ప్రచురించాడు. నిజానికి అతను ఆ వ్యాసాన్ని తాను ప్రవేశ పరీక్షకు సిద్ధమవుతూ ఉండిన రోజుల్లో వ్రాశాడు. మళ్ళీ ఆ వ్యాసాన్ని ప్రెశిడెన్సీ కాలెజి అధ్యాపకుడు ప్రొఫెసర్ బూత్ కోరికపై 1883లో ప్రచురించడం జరిగింది. బి. ఏ పట్టా తీసుకోకముందే అశుతోష్; తన రెండో (గణితశాస్త్ర) వ్యాసాన్ని "మెసెంజర్ ఆఫ్ మేథమేటిక్స్" లో ప్రచురించాడు (సమ్ ఎక్స్‌టెన్షన్స్ ఆఫ్ ఎ థియర్మ్ ఆఫ్ శాల్మన్.) ఎం.ఏ పట్టా తీసుకోడానికి ముందు (1886లో "క్వార్టర్లీ జర్నల్ ఆఫ్ ప్యూర్ అండ్ అప్లయిడ్ మేథమేటిక్ అనే పత్రికలో మూడో వ్యాసం (ఎ నోట్ ఆన్ ఎలిప్టిక్ ఫంక్షన్స్) ప్రచురించాడు. ఇది చాలా గొప్పగా,

ప్రతిభావంతంగా ఉందని విఖ్యాత గణిత శాస్త్రజ్ఞులన్నారు. ఈ వ్యాసాన్ని 'ఎన్నెపర్' తన "ఎలిప్టిషె ఫంక్షన్" లో ఉదహరించారు. ఎం. ఏ. పట్టా తీసుకున్న కొద్దికాలంలో "జర్నల్ ఆఫ్ ది ఏషియాటిక్ సొసైటీ ఆఫ్ బెంగాల్" లో "ఆన్ ది డిఫరెన్షియల్ ఈక్వేషన్ ఆఫ్ ఎ ట్రెజక్టరీ" అనే వ్యాసాన్ని ప్రచురించాడు అశుతోష్. ఉమ్మడి నాభి దీర్ఘ వృత్తాల యొక్క అసమతల కక్ష్యలకు (oblique trajectory of confocal ellipes) వివిధ సమీకరణాలతో ఇటాలియన్ శాస్త్రజ్ఞుడు మైనార్డి ఇచ్చిన పరిష్కారం క్లిష్టంగా వుందనీ, ఒకే ఒక సరళ సమీకరణాల జతతో మైనార్డి పరిష్కారాన్ని తోపి రాజనవచ్చుననీ అశుతోష్ నిరూపించాడు.

"జర్నల్ ఆఫ్ ఏషియాటిక్ సొసైటీ ఆఫ్ బెంగాల్" లోనే, 1887లో, "ఆన్ మాంగ్స్ డిఫరెన్షియల్ ఈక్వేషన్ టు ఆల్ కోనిక్స్" అనే వ్యాసాన్ని ప్రచురించాడు అశుతోష్. ఈ వ్యాసాలన్నీ, యూరపులో గణిత శాస్త్రజ్ఞుల చర్చలలో గొప్ప మెప్పును పొందాయి. ఇప్పటికైనా గణితశాస్త్ర పరిశోధక విద్యార్థులు 1887 నుంచి 1890 దాకా వెలువడిన ఈ పత్రిక సంచికల్లో ఇవి కాక అశుతోష్ వ్రాసిన మరో పది పన్నెండు నుంచి చాలా ప్రయోజనం పొందగలరు. పాతికేళ్ళ వయసుకు ముందే, అశుతోష్, గణితశాస్త్ర పరిశోధనా ప్రపంచలో తన స్థానం ఇదీ అని ధ్రువ పరచుకున్నాడు. ప్రఖ్యాత గణిత శాస్త్రజ్ఞుడు గణేశ్ ప్రసాద్ ఇలా అన్నాడు. "కేవలం ఒక కాలేజి విద్యార్థిగా, ఎవరి సహాయ ప్రయత్నాలు లేకుండానే సర్ అశుతోష్; గణిత శాస్త్రవిజ్ఞానానికి ఇంత సమర్పణా, దోహదమూ చేశారు. భాస్కరుడి తరువాత గణితశాస్త్ర పరిశోధనా రంగంలోకి ఇలా చొచ్చుకు పోయిన తొలి భారతీయుడు ఇతనే ఇతను గణితశాస్త్ర పరిశోధనకి చేసింది ఎక్కువా, అది పైగా, అంతా అసలైనదీ మౌలికమూనూ।"........1893లో రేఖా బద్ధ వక్రాల మీద, ఆ విషయం నేర్చుకునే ప్రారంభ స్థాయి విద్యార్థుల కోసం ఒక పుస్తకం రాస్తే, అది విద్యార్థులలో బాగా ఆదరణపొంది చాలా ఎడిషన్లు పడింది. 1855లో, అంటే అశుతోష్ ఎం. ఏ. పాసయిన ఏడాదే, రాయల్ ఎస్ట్రోనామికల్ సొసైటీ ఆఫ్ లండన్‌లోను, మరుసటి సంవత్సరం రాయల్ సొసైటీ ఆఫ్ ఎడిన్ బర్గ్‌లోను, ఏషియాటిక్ సొసైటీ ఆఫ్ కలకత్తాలోను సభ్యుడయ్యాడు. 1890లో సిసిలీలోని "మేథమేటికల్ సొసైటీ ఆఫ్

పాలెరోమ్కో"లో సభ్యుడయ్యాడు. అశుతోష్ గురించి 1906లో భారత ప్రభుత్వ దేశ వ్యవహారాల శాఖ కార్యదర్శి హెచ్. హెచ్. రిస్లీ: "అతని సబ్జక్టులో— అంటే శుద్ధ గణిత శాస్త్రంలో అతని పేరు ప్రఖ్యాతులు యూరప్ అంతా వ్యాపించాయి. అతని మౌలిక పరిసోధనల ఫలితంగా ఉన్నత స్థాయిగల కేంబ్రిజ్ పాఠ్య పుస్తకాల్లో అతని పేరు చోటు చేసుకుంది" అన్నారు.

చాలా పేళ్ళపాటు కలకత్తా విశ్వ విద్యాలయ వ్యవహారాల్లోనూ, అశుతోష్‌సభ్యుడుగానో, అధ్యక్షుడుగానో ఉన్న ఇతర విద్యా - జ్ఞాన సంస్థల్లోనూ అశుతోష్ మాట వేదవాక్కుగా వెళ్ళింది. అయితే ఒక తమాషా ఏమిటంటే అతను విద్యార్థిగా ఉన్నప్పుడు కూడా ఓసారి కలకత్తా విశ్వవిద్యాలయంలో అతని మాట వేదవాక్కు అయింది। ప్రేమ్‌చంద్ రాయ్‌చంద్ విద్యార్థి వేతనం విషయం అది. సైన్సులో ఆ స్కాలర్‌షిప్ పొందిన విద్యార్థి ఇంగ్లాండు వెళ్ళి మూడేళ్ళపాటు అంతర్జాతీయ ఖ్యాతిగల అధ్యాపకుల శిష్యరికంలో గడపాలని ప్రతిపాదన వచ్చింది. తన నిశ్చయవాదంతో ఆ ప్రతిపాదనను ఉపసంహరింప చేయగలిగాడు అశుతోష్. ప్రతిపాదనకు వ్యతిరేకంగా వార్తాపత్రికలకు వ్రాశాడు. విశ్వవిద్యాలయ సభ్యులకు సర్క్యులర్ పంపాడు.........సదాచార వంశాలకు చెందినవాడు. తమ బిడ్డలను విదేశాలకు పంపడానికి ఇష్టపడరు. అప్పుడు ఆ కుటుంబానికి చెందిన విద్యార్థులు అర్హత కలిగివుండి కూడా ఆ విద్యార్థి వేతనాన్ని పొందలేక పోతారు. పైగా, విద్యార్థి వేతనం సొమ్ము ఒకవ్యక్తి మూడేళ్ళపాటు ఇంగ్లాండులో గడపటానికి చాలదు. అందుచేత అర్హత వున్నా పేద విద్యార్థులు ఈ విద్యార్థి వేతనంవల్ల సమకూరే ప్రయోజనాన్ని పొందలేరు. అంతేకాక, ఎలాగో ఓ లాగ ఇంగ్లాండు వెళ్ళి అక్కడ మూడేళ్ళు గడిపి స్వదేశానికి వచ్చిన వాళ్ళుకూడా, అనంతరం వాళ్ళు పని చెయ్యడానికి తగిన స్థాయిగల ప్రయోగశాలలు లేకపోవడంవల్ల ఆశాభంగం పొందుతారు. విద్యారంగంలో ఉన్నత పదవులన్నీ కూడా యూరపియన్లకి కేటాయించబడడం మూలాన కూడా ఈ ఆశాభంగం తప్పదు... ... విశ్వవిద్యాలయ సభ్యులు ఈ వాదనలో సత్యాన్ని గుర్తించారు. ఆ ప్రతిపాదనకి నియమిద్దామనుకున్న కొత్త నిబంధనలు గాలికి పోయాయి. విద్యార్థిగా అశుతోష్ సాధించిన ఒక విజయంగా దీనిని పేర్కొనవచ్చు.

# 2. న్యాయవాదిగా, న్యాయమూర్తిగా

మానవుల వ్యవహారాలు దైవాజ్ఞ ననుసరించే నిర్ణీతా లవుతాయి.

అసలు అశుతోష్‌కి అధ్యాపకత్వంమీద, పరిశోధకత్వం మీదనే మక్కువ. విద్యారంగంలో ఉద్యోగరీత్యా ప్రవేశించే అవకాశం 1887లో సందర్భ పడింది. సర్ అల్‌ఫ్రెడ్ క్రాఫ్ట్ అని, డైరెక్టరాఫ్ పబ్లిక్ ఇన్‌స్ట్రక్షను; కలకత్తా ప్రెశిడెన్సీ కాలేజిలో అశుతోష్‌కి ఒక ఉద్యోగం యివ్వ జూపాడు. అయితే, ఇందువల్ల తన పరిశోధన సాగకపోవచ్చునన్న కారణంచేత, తనకి కలకత్తానుంచి బదిలీ లేకుండా చెయ్యాలని అశుతోష్ షరతు పెట్టాడు. అంతే కాక, అప్పటికి విద్యాశాఖలోవున్న యూరపియన్‌లతో సమానంగా తన జీతం హోదా వుండాలన్నాడు. ఈ రెండో కోరిక అసాధ్యమన్నాడు క్రాఫ్ట్. తానుగా ఆ ఉద్యోగానికి ధరకాస్తు పెట్టలేదు గనక, గౌరవంగా చూసుకుంటేనే ఆ ఉద్యోగంలో చేరంగలనని అశుతోష్ నిష్కర్షగా చెప్పేశాడు అతనిలో ఉన్న తీవ్రమైన ఆత్మగౌరవం దెబ్బతింది. ఇంతకంటె న్యాయవాద వృత్తిలోకి వెళ్ళిపోవడం నయమని క్రాఫ్ట్‌కి చెప్పాడు. "ఇండియన్ అసోసియేషన్ ఫర్ కల్టివేషన్ అఫ్‌సైన్సు" అన్నసంఘాన్ని స్థాపించిన మహేంద్రలాల్ సర్కారు పిలుపు అందుకుని, ఆ సంఘంలో ప్రసంగాలు చేయసాగాడు. ప్రెశిడెన్సీ కాలేజీలో చదివే వారితో సహా, ఎం.ఏ. పరీక్షకు వెడుతున్న బోలెడు మంది విద్యార్థులు ఈ ప్రసంగాలను విని ప్రయోజనం పొందారు. ఇలా 1891 వరకు; అంటే తన న్యాయవాద వృత్తి అందుకు అంగీకరించలేని సమయంవరకు ఆ ప్రసంగాలు చేస్తూనే ఉన్నారు. అశుతోష్‌ముఖర్జీ ఆచార్యత్వానికి పారితోషికం యిచ్చేందుకు నిధులకోసం మహేంద్రలాల్ సర్కార్ చేసిన ప్రయత్నాలు సఫలంకాలేదు. అలాగయి వుంటే న్యాయవాద వృత్తికి అశుతోష్ శక్తి ప్రతిభలు లభ్యమై ఉండేవి కావు. అయితే, గణితాధార భౌతిక శాస్త్రంలో మాత్రం ఒక సరికొత్త అధ్యాయం నెలకొనేది. ప్రఖ్యాత న్యాయవాది రాస్‌బిహారి ఘోష్ దగ్గర పనిచేసి, అశుతోష్. 1888లో ఆగష్టులో కలకత్తా హైకోర్టులో న్యాయవాదిగా నమోదయ్యాడు. అధ్యాపకుడుగా, పరిశోధకుడుగా

జీవనాన్ని గడిపే చివరి అవకాశం సర్ గురుదాస్ బెనర్జీ కలకత్తా విశ్వవిద్యాలయం ఉపాధ్యక్షులుగా వున్నప్పుడు (1890-92) వచ్చింది. సర్ గురుదాస్ ఇతనికోసం ఒక గణితశాస్త్ర ఆచార్య పదవిని సృజించడానికి గట్టి ప్రయత్నం చేశాడు. కాని, కుదరలేదు. ఆ తరువాత అశుతోష్ న్యాయవాద వృత్తినే గట్టిగా చేపట్టాడు.

1886లో, కృష్ణా నగర్‌కి చెందిన రామ్‌నారాయణ భట్టాచార్జీ గారమ్మాయి యోగమాయాదేవిని అశుతోష్ వివాహం చేసుకున్నాడు. తమ్ముడు హేమంతకుమార్ 1887లోను, తండ్రిగారు1889లోను పోయారు. ఆవిధంగా గణితశాస్త్ర పరిశోధనని పక్కన బెట్టి వృత్తి సంగతి మరింతగా చూసుకోవలసి వచ్చింది.

వృత్తిలో అశుతోష్ ఉన్నట్టుండి గగన విహారం చేసినట్లే దిగాడు, 1892కి అతను, న్యాయవాద వృత్తిలో గట్టిగా స్థిరపడి ఇండియన్ అసోషియేషన్‌లో ఉపన్యాసాలనుకుడా కొనసాగించ లేకపోయాడు. అతనికున్న అపరిమితమైన జ్ఞానం, ఆశ్చర్యకరమైన ధారణాశక్తి, కృషి చేయడానికిగల అద్భుతశక్తి. విశ్లేషణా సామర్థ్యం, వీటన్నిటినీ తన న్యాయవాద వృత్తిలోకి తేవడానికి, కేసుల్లో ముఖ్యమైన పాయింట్లను పట్టుకోడానికి తోడ్పడ్డాయి. వృత్తిలో గట్టిగా స్థిరపడడానికి అతనికి చాలా స్వల్పకాలం మాత్రం పట్టింది. గణితశాస్త్రానికి, న్యాయశాస్త్రానికి ఒకేరకం విలువలు అవసరం, బుద్ధికుశలత' తర్కసామర్థ్య మున్నూ ఇవి రెండూ తనకి పుష్కలంగా ఉండడంచేత' లెక్కలు బాగా నేర్చినవాడు గట్టి న్యాయవాది కాగలడనడానికి అశుతోష్ మరో ఉదాహరణగా రూపొందాడు. రాస్‌బిహారి ఘోష్ దగ్గర అతను పొందిన శిక్షణ అతనికి వృత్తిలో ఒక గొప్ప ప్రయోజనాన్ని సమకూర్చింది.

అయినా, ధన సంపాదన యంత్రంగా మారడానికి అతనికి ప్రేరేపణ లేదు. న్యాయశాస్త్రజ్ఞానం అనే మహాసముద్రంలో ఎంత లోతుకైనా దిగిపోడానికి అతని పాండితీ ప్రకృతి సహాయ పడింది. 1894లో అతను డాక్టరాఫ్ లాస్" అయ్యాడు. 1898లో కలకత్తా విశ్వవిద్యాలయంలో "టాగూర్ -లా-ప్రొఫెసర్" గా నియమితుడై న్యాయశాస్త్ర వేత్తగా అతని స్తోమత గుర్తింపు కొచ్చింది. "బ్రిటిష్ ఇండియాలో నిరవధికత్వాలకు

సంబంధించిన న్యాయం"* అనే విషయం మీద అతను ఉపన్యసించేవాడు. ఈ విషయాన్ని పన్నెండు ఉపన్యాసాలుగా తనకు స్వాభావికమైన కూలంకషత్వంతో చర్చ చేశాడు. న్యాయశాస్త్రంలో పరిశోధకుడుగా అతని శక్తికి సాక్ష్యంగా యివి నిలుస్తాయి.

నలభయ్యేళ్ళ వయస్సయినా రాకముందే 1904లో అశుతోష్ కలకత్తా హైకోర్టులో న్యాయమూర్తిగా నియమితుడయ్యాడు. ఆ ఏడాది జూన్ 4వతేదని ఆ ఉద్యోగంలో చేరాడు. కొద్ది నెలల్లోనే అతని పరిపూర్ణమైన తేజస్సు ప్రదర్శితమైపోయింది.

1908లో కొద్దినెలలపాటు విశ్వవిద్యాలయం పనిమీద వుండడం మినహాయిస్తే, అతను అలా పంధొమ్మిదేళ్ళపాటు-అంటే తన మరణానికి కొద్ది నెలలు పూర్వంవరకూ - న్యాయమూర్తిగా కొనసాగి రిటైరయినాడు. 1920లో కొద్దికాలం ప్రధాన న్యాయమూర్తిగా కూడా పని చేశాడు (ఆ కాలమంతటిలో) న్యాయశాస్త్ర సమాచార పత్రికల పుటల్లో కెక్కిన అతని న్యాయ నిర్ణయాలు 2,500 పై చిలుకు వున్నాయి. (అంటే ప్రఖ్యాత న్యాయమూర్తిగా సర్ బార్న్స్ పీకాక్‌గారి నిర్ణయాలకి రెట్టింపన్నమాట. న్యాయశాస్త్రంలో తటస్థపడే ఇంచుమించు అన్ని విషయాలకీ సంబంధించినవి. అవి కఠోర పరిశ్రమకు అవసరమైన అంతులేని శక్తిచేత, ప్రతివిషయం లోతుగా సమగ్రంగా ఆలోచించి, విశ్లేషించుకుని, భారతదేశంలోనూ, విదేశాల్లోనూ అలాంటి కేసులమీద ఉన్న తీర్పుల సారాంశాల్ని వాడుకుని, కీలకమైన పట్టు దొరకబుచ్చుకుని, ఇహ దీనిమీద ఆఖరిమాట ఇదేనన్న విధంగా తీర్పులు చెప్పాడు.

"హిందూ లాకి సంబంధించిన సమస్యల మీద అతని నిర్ణయాలు మూల శాస్త్ర కూలంకష పరిశోధనతో కూడినవి; ఆయన తరువాత అరుదుగా కానవచ్చేవిసీ. ఇలాంటి కేసులు చూడడంలో భారతీయ న్యాయస్థానం అనుసరించవలసిన సూత్రాలనుబట్టే తీర్పులుండాలి; అనే విషయాన్ని అతను దృష్టిలో పెట్టుకునేవాడు." అంతెందుకు? (22.సి.ఎల్. జె 345లో చెప్పిన) ఖుబ్‌లాల్—అజోధ్యల మధ్య కేసు విషయంలో రఘునందన్ "జల షోర్గ తత్వం", హేమాద్రి "చతుర్వర్గ చింతామణి" వంటి మూల శాస్త్రాలదాకా

* Law of Perpetuities in British India

వెళ్ళ: "భారతీయ న్యాయస్థానం చేపట్టవలసిన న్యాయావశ్యకతకు కావలసిన విశాల దృక్పథాన్ని అవలంబించాడు." అలాగే, (ఐ. ఎల్. ఆర్. 40 కలకత్తా 721లో చెప్పిన) దేవీభగత్—గులాబ్‌భగత్‌ల మధ్యకేసులో సర్ గురుదాస్ బెనర్జీ అంతటి ప్రఖ్యాత న్యాయశాస్త్రవేత్త అభిప్రాయాలతో వ్యతిరేకించి ఇచ్చిన తీర్పు చాలా గొప్పది. ఇదే అంశం ప్రీవీకౌన్సిల్‌లో లార్డ్ డునెడిన్ సమక్షంలో వచ్చింది. ఆయన, సర్ గురుదాస్ బెనర్జీ తీర్పును పరిశీలించి, ఈ కేసులో తనకి లభ్యమైన ఈ సమర్థవంతమైన తీర్పు ద్వారా అందిన సహాయాన్ని ఉదహరించారు. సి. ఎల్. జె—సంపుటం 39 ఎల్. ఆర్. 62n. 63n.)

న్యాయశాస్త్రంలో తాకట్టులకి సంబంధించిన భాగం అశుతోష్ ముఖర్జీ తీర్పుల వల్ల బాగా సంపన్నమైంది. (6 సి. ఎల్. జె. 46లో చెప్పిన) హుకీంలాల్ - రామ్‌లాల్‌ల మధ్య కేసుంది. "ఈ తీర్పులో ప్రత్యామ్నాయపు తాకట్టుకి సరళంగా యిచ్చిన సిద్ధాంతంలో ధర్మం, న్యాయం, చిత్తశుద్ధి" ఉన్నాయి. (2 సి. ఎల్. జె. 288లో చెప్పిన) సుర్జీరాం మార్వాడీ - బ్రహ్మదేవ్ మధ్యకేసు, (సి. ఎల్. జె, 611లో చెప్పిన) గురుదాస్‌సింగ్ చంద్రికాసింగ్ మధ్య కేసు తీసుకుంటే ఇవి ప్రత్యమ్నాయత్న సిద్ధాంతాని. అద్భుతమైన విశ్లేషణలుగా ప్రసిద్ధి చెందాయి. అటు పురాతన న్యాయంలో ఇటు అధునాతన న్యాయంలో జ్ఞానంవల్ల మూల సూత్రాల వ్యక్తీకరణంలోను సిద్ధాంత పరిశీలనలోను అతనికి కష్టమేలేదు. అందుచేత అతనికి *Savigry of Subrogation అని పేరొచ్చింది.

అశుతోష్ ముఖర్జీ ఒక కేసులో తీర్పు చెప్పాడంటే అలాంటి కేసులన్నిట్లోనూ తటస్థపడే ఒక్కొక్క పాయింటుకి అది ఆధారభూతంగా చేసేసేవాడు ఈ దృష్టితో అతను, న్యాయశాస్త్రంలో ఇంచుమించు ప్రతి అధునాతన పద్ధతిలోను జ్ఞానం సంపాదించుకున్నాడు. దీనికోసం తన దృష్టినంతా అమెరికన్ న్యాయమూర్తులిచ్చే తీర్పులమీద కేంద్రీకరించేవాడు. ఎందుకంటే, న్యాయశాస్త్రం మీద, తీర్పులివ్వడం మీద; అక్కడి సాంఘిక పారిశ్రామిక అభివృద్ధులు ఏ ఐరోపీయ దేశంలో కంటే కూడా ఎక్కువ ప్రభావం చూపేటంతగా పురోగమించాయని అతని ఉద్దేశం. "పక్షపాత

*కలకత్తా లా జర్నల్; 39వ సంపుటం 63వ పేజి

బుద్ధి, బాధ్యతం; వృద్ధి చెందుతున్న సాంఘిక సంబంధాల పట్లా అవసరాల పట్లా, వైమనస్యం, యివే ఈ మూలాన్ని ఉపయోగించకుండా చేస్తాయి."

హైకోర్టు అధికారాన్నీ పరిధినీ పరిమితం చెయ్యడానికి జరిగే ఏ ప్రయత్నాన్నీ కూడా అతడెన్నడూ అనుమతించలేదు. "న్యాయం జరగడానికి అవసరమని తోస్తే, హైకోర్టు రివిజనల్ అధికారాలపైన విధించిన పరిమితులని కాదనడానికి అతనెన్నడూ జంకలేదు. ఎందుకంటే, అతను, శాసనరీత్యా తనకున్న అధికారాలను ధారాళంగా ఉపయోగించే న్యాయమూర్తి కనుక; అందుచేతనే, (ఐ.ఎల్.ఆర్. 41 కలకత్తా 436లో చెప్పిన) ఇస్మాయిల్ — షంషేర్ సింగ్‌ల మధ్య నడిచిన కేసులో తాత్కాలిక నిలుపుదలను అమలు చెయ్యమని ఇచ్చిన ఉత్తరువులో కలగజేసుకోవడానికి హైకోర్టుకి అధికారం లేదన్న వాదంవస్తే, అతనిలా చెప్పాడు. "చార్టర్ ఏక్టు 15వ సెక్షను క్రింద ఇందులో కలగజేసుకునే అధికారం ఈ కోర్టుకి ఉన్నట్టు స్పష్టం. అందుచేత ఈ అభ్యంతరం వచ్చిందని మేం బాధపడ్డం లేదు. న్యాయస్థానపు అధికారంపట్ల అలక్ష్యం అనిపిస్తే ఈ ప్రతివాదుల ప్రవర్తన దృష్ట్యా మేం కలగజేసుకోవడం సమర్థనీయమే అనడానికి తగినంత ఆధారం ఈ కేసుకి ఏర్పడిందనే మేం భావిస్తున్నాము."*

తాను న్యాయ నిర్ణయం చేస్తున్నది సివిల్ లాలోకానీ, క్రిమినల్ లాలో అవనీ, దేంట్లోనైనా అతను న్యాయమూర్తిగా తన ఘనతను చాటుకున్నాడు. అతను న్యాయమూర్తిగా తన 40వ ఏట చేరి 59వ ఏటి వరకు న్యాయపీఠం మీద కూర్చున్నాడు. అంత సుదీర్ఘకాలంలోనూ కూడా; జీవితపు ముఖ్య ఘట్టంలో ఉన్నప్పుడు తాను ఏర్పరచుకొన్న ఉన్నత స్థాయి నుంచి తన తీర్పుల విషయంలో ఎన్నడూదిగజారలేదు.

తాను ఇంకా పిన్నవయసుగల న్యాయమూర్తిగా ఉన్నప్పుడు తన సహ న్యాయమూర్తి జస్టిస్ రాంపినితో; ఒంట్లో ఓపిక తగ్గిపోతే మాత్రం తాను న్యాయపీఠం మీద కొనసాగే కోరిక లేదని చెప్పాడు అశుతోష్. ఆ పిన్న వయస్సప్పుడు చెప్పిన దాన్ని అశుతోష్ తన 59వ యేట పాటించాడు. రిటైరయ్యే తేదీకి ఆరు నెలలు ముందుగానే అతను పదవీ విరమణ చేయాలని

---

*కలకత్తా జర్నల్; సంపుటం 39వ పుట 63 n

నిర్ణయించుకున్నాడు. ఎందుకంటే, తన ఆరోగ్య పరిస్థితి తనకి తృప్తి కలిగించే విధంగా తన పదవీ బాధ్యతలను నిర్వహించనీయడం లేనట్టుందని అతనికి అనిపించింది. తనకెంతో ప్రీతి పాత్రురాలైన కుమార్తె 1923లో మరణించడం అతనికి పెద్దదెబ్బ. పైగా, (38. సి ఎల్. జె. 411లో చెప్పిన) రెక్స్ - బరీంద్రకూమార్‌ల మధ్య కేసు విచారణ. ఆ బ్రహ్మాండమైన తీర్పురాయడం ఇవి అతని ఆరోగ్యాన్ని చెడగొట్టాయి. అందుచేత అతను పదవీ విరమణ చెయ్యాలని అనుకున్నాడు. 1924 జనవరి 1 నుంచి అలా చేశాడు కూడానూ.

అతనికి వీడ్కోలు చెబుతూ అప్పటి అడ్వకేట్ జనరల్ ఇలా అన్నాడు; (న్యాయమూర్తిగా మీ జీవితంలో వెలుగు సంగతి అలా వుంచండి.) సంకోచంలో వున్న జ్ఞానాన్ని మీరు వెంటనే గుర్తించి ప్రోత్సహించేవారు. అందరి ఎడలా ఒకే విధమైన మర్యాద చూపించారు. ఆ విధంగా మా అందరి గౌరవాన్ని అభిమానాన్ని చూరగొన్నారు. మీ న్యాయస్థానానికొచ్చిన ఏ జూనియరూ కూడా గాబరాపడలేదు. ఎందుకంటే న్యాయశాస్త్రం అనేది ఇక్కడ సరిగ్గా అమలు పరుస్తున్నారు కనుక. కేసుల మహారణ్యంలో అంధకారంలో మీరెప్పుడూ న్యాయమనే దివిటీ పట్టుకుని అడుగు తడబడకుండానే నడిచారు. "ఆపైన, ప్రధాన న్యాయమూర్తి సర్ లాన్స్‌లట్ శాండర్సన్ ఇలా అన్నారు. ఆయనకి చైతన్యం యిచ్చింది ఒక్కటే కోరిక. అదే, న్యాయస్థానానికున్న ఘన సంప్రదాయాన్ని తీర్చిదిద్దడం, శాఖోపశాఖలుగా వున్న న్యాయాన్ని అందించడానికి తోడ్పడంన్ను ఈ ప్రయోజనాల కోసం తన అసాధారణ జ్ఞానాన్ని, ఆశ్చర్యకరమైన ధారణను, అలుపు తెలియని శక్తిని దాదాపు రెండు దశాబ్దాల పాటు ధారపోశారు. న్యాయస్థానంలోనే కాదు; వంగదేశం అంతటా కూడా ఆయన ఘనమైన వ్యక్తి. అంతేకాదు; యావద్భారతంలోనూ కూడా ఆయన పేరు ప్రఖ్యాతి చెందినదేనని ఆయన ప్రభావం విస్తరిల్లిందేనని నేను సాధికారికంగా చెప్పగలనని అనుకుంటున్నాను।"

దీనికి సమాధానంగా అశుతోష్ ఇలా అన్నాడు: "న్యాయస్థానం అధికారాలని పరిమితం చేసే ప్రయత్నాలకి నేనెన్నడూ అనుకూలించలేదు.

తెలిసో తెలియకో ఒకడు తనకేదో యిబ్బంది వుందని అది న్యాయస్థానాని కొస్తే తీరుతుందనీ అనుకొంటాడు. ఎలాటి వాళ్ళకైనా తిరస్కృతి కాకుండా సాధ్యమైనంత అవకాశం యివ్వడానికీ, తమ కేసుల్ని పూర్తిగా విప్పిచెప్పు కోవడానికీనూ, ఈ చిట్టచివరి న్యాయస్థానం. అంచేత ఈ న్యాయ దేవాల యపు తలుపులు (అందరికీ) ఒకే రీతిని తెరిచి వుంచడానికే నేను ప్రయ త్నించాను.

"సావధానంగా వినడం, జాగ్రత్తగా ఆలోచించడం, సరిగ్గా అర్థం చేసుకోవడం, న్యాయంగా, తీర్పు యివ్వడం; ఆదర్శవంతమైన న్యాయ పాలన చెయ్యడం - ఇవీ నా ఆశయాలు."

# 3. కలకత్తా యూనివర్శిటీ (1889-1906)

ప్రిన్స్ ఆఫ్ వేల్సు "ఎడ్వర్డు"కి (తరువాత అతను ఎడ్వర్డు రాజు అయినాడు) గౌరవ పట్టా ప్రదానం చెయ్యడానికని, కలకత్తా యూనివర్శిటీ 1976లో ఒక ప్రత్యేక స్నాతకోత్సవం జరిపింది. అప్పటికి పన్నెండేళ్ళ పిల్లవాడుగా వున్న అశుతోష్‌ని, (బ్రిటిష్ సింహాసనానికి వారసుడైన యువ రాజుని చూపించడానికని) వాళ్ళ నాన్నగారు ఆ స్నాతకోత్సవానికి తీసు కెళ్ళారు. దేశంలోని అత్యుత్తమ పౌరులు హాజరైన ఆ దివ్య ఉత్సవ శోభ అశుతోష్ మనసులో ఒక గొప్ప ముద్ర వేసింది. ఆ దృశ్యం తిలకించి నప్పుడే ఎప్పటికైనా ఈ మహనీయ పీఠంలో తనకొక స్థానం సంపాదించు కోవాలన్న కోరిక అశుతోష్‌లో ఉదయించి ఉండవచ్చు. "నా విద్యాలయం మంచికీ వైభవానికీ ఏదో ఒకటి చెయ్యాలని నా చిన్ననాటి కల; ఎప్పటి నుంచో నా కోరిక" అన్నాడతను.

అశుతోష్ పినతండ్రి రాధికాప్రసాద్ సెనేటు సభ్యుడు. అందువల్ల యూనివర్శిటీలోని వివిధ అధికారి పరిషత్తుల సమావేశ విశేషాల పత్రాల లభ్య మయ్యేవి. విద్యార్థి దశలో అశుతోష్; ఖాళీగా వున్నప్పుడు అవి చదువుతూ కనిపించేవాడు. 1884లో ఓ సారి అలాంటి పత్రాలు, కేలండర్లు పెద్దయెత్తున వేలం వేశారు. ఎవ్వరికీ పట్టినట్టే లేదు। అయితే అశుతోష్ వాటినన్నిటినీ కొనేసి, ఇంటికి తీసుకుపోయి క్షుణ్ణంగా చదివేశాడు. అశుతోష్ విద్యార్థి ప్రవృత్తిని ప్రశంసా దృష్టితో గమనించిన వైస్ ఛాన్సెలర్ సర్ కొర్టినే ఇల్ బర్ట్; 1885 స్నాతకోత్సవ ఉపన్యాసంలో అతన్ని గురించి గొప్పగా మాట్లా డాడు. అశుతోష్ చదువు పూర్తవగానే ఇల్బర్ అతనితో. నీకేదైనా (ఉప కారం) చెయ్యాలనుందన్నాడు. ప్రభుత్వంలో ఏదైనా మంచి ఉద్యోగం యిప్పించమని అడగవచ్చు. కాని అశుతోష్, తన కేదైనా గౌరవ పదవి యిమ్మని అడిగాడు. అదే నాకు సెనేటు సభ్యుడుగా ఉండాలనుందన్నాడు. ఇల్బర్, ఛాన్సెలర్ అయిన లార్డ్ లాన్స్‌డౌన్‌తో మాట్లాడాడు; 1889 జనవరి 16 నుంచి అశుతోష్, కలకత్తా యూనివర్శిటీ సభ్యుడుగా ప్రభుత్వం తర పున నామినేట్ అయ్యాడు.

అశుతోష్‌ని ఆవిధంగా నియమించడానికి శిఫార్సు చేసిన అధికార లేఖలో ఇలా వ్రాశారు:- "కలకత్తా యూనివర్శిటీ ఇప్పటి వరకు పొందిన గణిత శాస్త్రజ్ఞుల్లో మిక్కిలి గొప్పవాడితను. ఇతను మౌలికమైన కృషిచాలా చేసి, దాంతో, ఇంగ్లాండులోని ఒకటి రెండు మేధావి సమాజాల్లో సభ్యత్వం కూడా సాధించాడు. ఇతను ఏషియాటిక్ సొసైటీ సభ్యుడు. ఇతనక్కడ సమర్పించిన పత్రాలు ఎందరినో ఆకట్టుకున్నాయి."* సెనేట్ సభ్యుడైన కొద్ది మాసాల్లోనే సిండికేటుకి ఎన్నికయ్యాడు. అప్పటికి తను కోరుకున్న రంగానికి చేరినట్టు; ఉన్నపళంగా యూనివర్శిటీ పనిలో లోతుగాదిగిపోయాడు. తనకి సభ్యత్వం ఉన్న సెనేటు, సిండికేటు మొదలైన పరిషత్తులన్నిటి ప్రతి సమావేశానికి హాజరయ్యాడు. యూనివర్శిటీ వెనకటి సమావేశాల విశేషాలన్నీ క్షుణ్ణంగా చదవడంవల్ల కలిగిన జ్ఞానం అక్కడ చర్చలకి గొప్పగా ఉపకరించి, మిగిలిన సభ్యుల కన్నా మెరుగైన స్థానంలో కూర్చో పెట్టిందతన్ని.

1891 స్నాతకోత్సవ ఉపన్యాసంలో అప్పటి వైస్ ఛాన్సెలర్ గురుదాస్ బెనర్జీ; యూనివర్శిటీ దేశ భాషల్ని నిర్బంధవిషయాలుగా ప్రవేశ పెట్టడం గురించీ వాటిలో పరీక్షలను నిర్వహించడాన్ని గురించీ ప్రశ్న లేవదీశాడు. ఆ రోజుల్లో భారతీయ భాషల స్థితిని గురించి, వివిధ విద్యా బోధనా విషయాల మధ్య వాటిస్థానం గురించీ కొంత చెప్పాలిక్కడ. కలకత్తా యూనివర్శిటీకి మొదట్లో ఏర్పడ్డ నిబంధనల ప్రకారం భారతీయ భాషలు ఐచ్ఛికాలు. ఎంట్రన్సులోను, బి.ఎ. లోను సంప్రదాయ భాషల స్థానంలో వాటిని స్వీకరించవచ్చు. ఎఫ్. ఏ. పరీక్ష పెట్టినప్పుడు కూడా అదే పరిస్థితి. 1864లో నిబంధనలు మార్చినప్పుడు మాత్రం, ఎలాగో, దేశభాషలు పరీక్షా విషయాలు కాకుండా పోయినా, ఎంట్రన్సుకి నిర్ణయమైన ద్వితీయ భాషల శ్రేణిలో వాటిస్థానం అలానిలచివుంది. 1878లో అధునాతన దేశభాషలు ఎఫ్.ఎ., బి.ఏ; కోర్సులలోకి దొడ్డిదారిన పునః ప్రవేశించాయి. ద్వితీయ భాషకి బదులుగా భారతీయ దేశభాషను చేపట్టడానికి స్త్రీలకు మాత్రం అనుమతి. గురుదాస్ బెనర్జీ అన్నాడు: భారతీయ దేశ భాషల్లో వేటికి సాహిత్యం, వాఙ్మయం వున్నాయో, వాటిని మనం ఆభాషలకి దగ్గిరగా వుండే

*అశుతోష్ ముఖర్జీ జీవిత చరిత్ర - (ఎన్. కె. సిన్హా వ్రాసినది) - పుట 58

సంప్రదాయ భాషలతో మన పరీక్షలకు విషయాలుగా నిర్ణయించి; వాటిఅధ్యయనాన్ని పోత్సహించడం అవసరమూ అభిలషణీయమూ అని నేను. భావిస్తున్నాను. (మాటవరసకి) వంగభాషలో అధ్యయనం చెయ్యవలసిన వాఙ్మయం ఎంతో, వుందిప్పుడు. అలాగే హిందీ ఉర్దూ కూడా ఈమార్గంలోనే పురోగమిస్తున్నాయి. జ్ఞానాన్ని మన దేశభాషల ద్వారా ప్రాచుర్యంలోకి తెస్తే తప్ప మనదొక జాతి అవదని నా గట్టినమ్మకం." ఈ ధ్యేయం నెరవేరాలని 1891మార్చి 14న అశుతోష్ సిండికేటులో పెట్టిన తీర్మానం:-

1. ఆర్ట్సు పరీక్షల్లో సంస్కృతం తీసుకునే అభ్యర్థులు: బెంగాలీ, హిందీ, ఒరియాల్లో ఏదో ఒక భాషలోను. పర్షియన్, అరబిక్ భాషలు తీసుకునే అభ్యర్థులు ఉర్దూలోనూ పరీక్ష యివ్వాల్సి వుంటుంది.

2. పైన చెప్పిన ప్రతిపాదన ఈ క్రింది విధంగా అమలు పరచాలి:-

అ) ఎఫ్. ఏ. పరీక్షలో—

(i) పైన చెప్పిన సంప్రదాయ భాషల్లో నిర్ణీతమైన పాఠ్య పుస్తకాలతోబాటు, వాటిని అనుసరించి చెప్పిన దేశ భాషల్లో కూడా కొన్ని పాఠ్యపుస్తకాలను నిర్ణయించాలి,

(ii) మొదటి ప్రశ్న పత్రం సంప్రదాయ భాషకోసం వుండాలి; రెండో ప్రశ్నపత్రంలో దేశభాషల్లో నిర్ణయించిన పాఠ్య పుస్తకాల్లోంచి ప్రశ్నలుండాలి. అంతే కాక, ఆ (దేశ) భాషలో ఒక స్వకపోల కల్పనకావాలి,

(అ) బి. ఏ. పరీక్షలో—

(i) పైనచెప్పిన సంప్రదాయ భాషల్లో నిర్ణీతమైన పాఠ్య పుస్తకాలతో బాటు, వాటిని అనుసరించి చెప్పిన దేశ భాషల్లో కూడా కొన్నిపాఠ్య పుస్తకాలను నిర్ణయించాలి,

(ii) "పాస్" పేపరుకి ఎఫ్. ఏ. పరీక్షకి చెప్పిన విధంగానే పుండాలిక.

(iii) "ఆనర్సు" పేపర్లకి, గద్య-పద్య భాగాలపై ఇచ్చే మూడవ ప్రశ్న పత్రానికి బదులుగా, దేశ భాషల్లో

నిర్ణయించిన పాఠ్యపుస్తకాల్లోంచి ప్రశ్నలుండాలి, ఆ (దేశ) భాషలో ఒక స్వకపోల కల్పన కావాలి.

(ఇ) ఎమ్. ఏ. పరీక్షలో—

ఎమ్. ఏ. నిబంధనల్లో 5వ పేరా ననుసరించి ఆంగ్లంలో ఒక వ్యాసం వ్రాయాల్సివుంది. దానికి బదులుగా, అభ్యర్థులు, పైన చెప్పిన (దేశ) భాషల్లో తాము పాండిత్యం సంపాదించిన ఆ (దేశ) భాష లేక సంప్రదాయ భాష సారస్వత చరిత్రకు సంబంధించిన ఒక వ్యాసం వ్రాయాలి.

ఈ ప్రతిపాదనలను ఫాక్టరీ ఆఫ్ ఆర్ట్స్‌కి పంపారు. అక్కడ జులై 11వ తేదీనిచర్చ జరిగింది. ఉమేశ్ చంద్రదత్, బంకిమ్‌చంద్ర ఛటర్జీ, చంద్రనాథ్ బాసు, మహేంద్రనాథ్ రే, కె. ఎస్. మేక్‌డొనాల్డ్ ఆనంద మోహన్ బాసు, హరప్రసాద్ శాస్త్రి-ప్రతిపాదనకి అనుకూలంగా మాట్లాడారు, రాజాప్రియమోహన్ ముఖర్జీ, మౌల్వీసిరాజుల్ ఇస్లామ్, కల్నల్‌జరెట్. నవాబ్ అబ్దుల్ లతీఫ్. నీలమణి ముఖర్జీ. పండిత మహేశ్ చంద్ర న్యాయరత్న, ప్రతిపాదనకి వ్యతిరేకంగా ప్రసంగించారు, తీర్మానాన్ని వోటింగ్‌కిపెట్టారు. పదిహేడు వోట్లు ప్రతికూలంగాను, పదకొండు అనుకూలంగానూ పడి తీర్మానం వీగిపోయింది.

నిరుత్సాహ పడకుండా, అశుతోష్ ముఖ్యా 1891 జులై 20 వతేదీని "భారతీయ దేశ భాషల అధ్యయనానికి గతంలో ఈ యూనివర్శిటీ ఇచ్చిన దానికన్నా ఎక్కువ ప్రోత్సాహం ఇవ్వడానికి అనుగుణమైన ప్రణాళికను రూపొందించడం సాధ్యమేమో పరిశీలించడానికి ఒక కమిటీని వెయ్యమని సెనేటుకి శిఫార్సు చెయ్యవలసిందిగా" సిండికేటులో తీర్మానం పెట్టేరు. సిండికేటు, "ఈ అభ్యర్థనను మన్నించడానికి సాధ్యం కాదని" నిర్ణయించింది,

(ఉత్తరోత్ర: = అశుతోష్ ప్రయత్నాల ఫలితంగా—భారతీయ దేశ భాషలు చివరికి విశ్వవిద్యాలయ పాఠ్య ప్రణాళికల్లో తమ సక్రమ స్థానాన్ని ఎలా పొందాయో ఆ వివరణ క్రమంగా వస్తుంది.)

అప్పటికి, యూనివర్శిటీ పునర్వ్యవస్థీకరణే ఒక ముఖ్యమైన సమస్యగా వుంది. 1857 చట్టంద్వారా కలకత్తా యూనివర్శిటీ సంస్థాపన అయింది,

దీని ప్రకారం యూనివర్శిటీని గురించిన భావన చాలా పరిమితం. అవతారిక పాఠం ఇది:—"వాఙ్మయం, శాస్త్రం, కళ మొదలైన వివిధ రంగాల్లో పాండిత్యం సంపాదించిన వ్యక్తులకి; అనుగుణమైన పరీక్షలద్వారా గుర్తింపు, పట్టాప్రదానం చెయ్యడానికి కలకత్తాలో ఒక యూనివర్శిటీని నెలకొల్పాలని నిర్ణయించబడింది." ఆ లెక్కని యూనివర్శిటీ అంటే ఒక పరీక్షాధికార పీఠం. అంతే గాని బోధనాధర్మం లేదు దానికి. పాఠశాలలు, కళాశాలలు యూనివర్శిటీలో భాగాలు కావు. యూనివర్శిటీ ఆ పరీక్షలకి సిలబస్సులను నిర్ణయించి పాఠ్య పుస్తకాలను పేర్కొంటుంది. స్కూళ్ళకి, కాలేజీలకి—వాటి సిలబస్సు లేమిటి, పాఠ్యపుస్తకా లేమిటి చెప్పడమే తప్ప; ఆ యా విద్యా సంస్థలతో, యూనివర్శిటీకి అంతకు మించిన సంబంధం లేదు. సెనేటు సభ్యులపేర్లు చట్టంలోనే పేర్కొన్నారు, వారంతా యావజ్జీవ సభ్యులు. దేశంలోని విద్యా ప్రవీణులు ఇలాంటి యూనివర్శిటీ పట్ల సంతృప్తి పడుతూ ఎంత కాలమని కూర్చోగలరు? అందుచేత, 1857 చట్టాన్ని సవరించే ప్రసక్తి త్వరలోనే; అంటే 1890 లో యూనివర్శిటీకి పరిశీలనకి వచ్చేసింది. ఈ విషయాన్ని పరిశీలించడానికి 1890 ఏప్రిల్లో సిండికేటు ఒక కమిటీని వేసింది. మొట్టమొదట చట్టంలో అవతారికను సవరించాలని, తద్వారా, జ్ఞానార్జనా పురోగమనానికి సంబంధించిన ఇతర ధర్మాల విషయం చేపట్టడానికి యూనివర్శిటీకి సాధ్యమవుతుందనీ కమిటీ అభిప్రాయ పడ్డది. అంతేకాక, (యూనివర్శిటీ) సభ్యుల మొత్తం సంఖ్యను ఛాన్సెలరే నిర్ణయించాలి. అందులో సగం మందిని ఛాన్సెలరే పేర్కొనాలి; మిగిలిన సగంలో మూడింట రెండు వంతులు సెనేటు ద్వారాను మూడింట ఒకవంతు పట్టభద్రుల ద్వారాను ఎన్నిక కావాలని అన్నది కమిటీ శిఫార్సులను సెనేటు ఆమోదించింది. కాని, ఈ సవరణలు ఆ అత్యవసరం కాదన్న కారణంచెప్పి ఈ ప్రతిపాదనను భారత ప్రభుత్వం తిరస్కరించింది. 1893లో సెనేటు ఈ విషయాన్ని పునః పరిశీలించి, "చట్టాన్ని సవరించే నిమిత్తం నివేదించుకొన్న ప్రతిపాదనను త్వరగా పరిశీలించమ్మని భారత ప్రభుత్వాన్ని గౌరవ పురస్సరంగా ప్రార్థించడానికి" ఒక తీర్మానాన్ని ఆమోదించింది. అయితే, లార్డ్ కర్జన్ రంగంలో కొచ్చేవరకు దీనిమీద ఏ చర్యా తీసుకొన్నట్టు కనిపించదు. లార్డ్ కర్జన్ ఆక్స్‌ఫర్డు యూనివర్శిటీ పట్ల

భద్రుడు. ఆక్స్‌ఫర్డులోనూ కేంబ్రిడ్జిలోనూ ఉన్న యూనివర్శిటీల్లో బోధన సాధనలతో సరిపోల్చుకుని చూసుకుంటే కలకత్తా యూనివర్శిటీ కేవలం ఒక పరీక్షాధికార పీఠమే తప్ప మరేం లేదని ఆ లోటును సులువుగా కనిపెట్టగలడు. 1899 లో తన మొట్టమొదటి స్నాతకోత్సవ ప్రసంగంలోనే, లార్డ్ కర్జన్; కలకత్తా యూనివర్శిటీలో కొన్ని లోపాలున్నప్పటికి ఉపయోగకరమైన పని చాలా చేస్తోందని; ప్రస్తుత విధానం లోపభూయిష్ఠంగా వున్నా, సంస్కారానికి తగిన సావకాశం వుందని; అలాంటి సంస్కారం జాగ్రత్తగా చెయ్యాలని (అంటే, ఆ చేసేదేదో మొత్తం పునర్నిర్మాణంలా కనిపించకూడదని)" అన్నాడు. "ఈ దేశంలో విద్యా విధానం అంతా కూడా, నా ఏలుబడిలో, నాకు సాధ్యమైనంత వరకు నా దృష్టికి వచ్చి తీరుతుంది" "అని వాగ్దానం చేశాడు. ఫిబ్రవరి 1901 స్నాతకోత్సవ ప్రసంగంలో కూడా, లార్డ్ కర్జన్ చాలా ప్రోత్సాహకరంగానే మాట్లాడాడు. "ఈ యూనివర్శిటీని భారతదేశంలో కెల్లా అత్యుత్తమ స్థానానికి తేవాలని, ఐరోపీయ యూనివర్శిటీల అడుగు జాడల్లో నడవగలిగే విధంగా దీనికొక మహా ధర్మాన్ని ఏర్పరచాలని నా ఆశయం" అన్నాడు.

లార్డ్ కర్జన్, 1901 సెప్టెంబరులో, సిమ్లాలో, విద్యావేత్తల సమావేశాన్ని ఏర్పాటు చేసేడు. (విద్యా) విదానంలో అప్పటికున్న లోటుపాట్లు; "తెలివిగా ఆలోచించి ప్రయోగించ వలసిన నివారణోపాయాలు" వాంఛిస్తున్నవని ఈ సదస్సు శిఫార్సు చేసింది. "ఇప్పుడున్న యూనివర్శిటీ సెనేట్లు, విద్యార్థుల ప్రయోజనాలకి తక్షణం కావలసిన విధానాలను ఆలోచించడానికి గాని అమలుపరచడానికి గాని తగిన రీతిలో లేవన్ని" ఈ సదస్సు అభిప్రాయపడ్డది. అంతే, 1902 జనవరిలో భారతీయ యూనివర్శిటీల కమిషన్ నియమితమైనది. కలకత్తా యూనివర్శిటీ వైస్‌ఛాన్సెలర్ తామస్ రేలీ అధ్యక్షుడు, సయ్యద్ హుసేన్ బిల్గ్రామి, జె. పి హెలెట్ (భారత ప్రభుత్వ హోంశాఖ కార్యదర్శి); అలెగ్జాండర్ పెడ్లర్ (బెంగాల్ రాష్ట్రపు డైరక్టరాఫ్ పబ్లిక్ ఇన్‌స్ట్రక్షన్.) ఎ. జి. బోర్న్ (మద్రాసు ప్రెసిడెన్సీ కాలేజీ ప్రిన్సిపాల్). డి. మకీఛమ్ (బొంబాయి విల్సన్ కాలేజీ ప్రిన్సిపాల్) గురుదాస్ బెనర్జీ వీరంతా సభ్యులు. ఒక్కొక్క యూనివర్సిటీ ఉన్న చోట, ఆ యూనివర్శిటీ గురించి విచారణ కోసం ఒక్కొక్క స్థానిక సభ్యుని ఏర్పాటు చేశారు. కలకత్తా యూనివర్శిటీ తరపున సభ్యుడు అశుతోష్ ముఖర్జీయే. ఈ కమిషన్ కొన్ని

ముఖ్యమైన శిఫార్సులను చేసింది. సెనేటు పునర్నిర్మాణం గురించి, సేనేటు అధికారాలను గురించి, కళాశాలల అనుబంధత్వాన్ని గురించి చేసినవి ఉన్నా యందులో. అతి ముఖ్యమైన దేమిటంటే; యూనివర్శిటీ అనేది కేవలం పరీక్షల నిర్వహణ సంస్థగా ఉండకూడదని. 1902లో యూనివర్శిటీల కమిషన్ ఇలా చేసిన శిఫార్సులను ఒక బిల్లులో చేర్చి. 1903 నవంబరులో భారతీయ శాసన మండలికి సమర్పించారు.

అశుతోష్ ముఖర్జీ కలకత్తా యునివర్శిటీ నుంచి బెంగాల్ శాసన మండలికి 1899లో ఎన్నిక అయాడు. యూనివర్శిటీల బిల్లు ఇంపీరియల్ లెజిస్లేటివ్ కౌన్సిల్లో ప్రవేశ పెట్టడం జరిగింది గనక ఆ మండలికి ఎన్నికయితే బాగుండునని అశుతోష్ కనిపించింది. 1901లో మళ్ళీ ఎన్నిక అయినాడు. ప్రఖ్యాత భారతీయ నాయకుడు సురేంద్రనాథ్ బెనర్జీని, మిక్కిలి బలవంతుడైన దర్భాంగా మహారాజును ఓడించి 1904లో తన స్థానాన్ని కైవసం చేసుకున్నాడు. ఎన్నిక అయిన వెంటనే లార్డ్ కర్జన్ ఇతన్ని ఆ బిల్లుకు (సంబంధించిన) సెలెక్ట్ కమిటీలో నియమించాడు. అలా ఇతన్నే ఎందుకు వెయ్యాలన్న విషయం మీద లార్డ్ కర్జన్ ఇలా అన్నాడు: "గౌరవనీయుడైన ఈ సభ్యుడు నిన్నగాక మొన్ననే కౌన్సిల్‌కి ఎన్నికయాడు. ఈ సంగతి తెలియగానే మేము అతన్ని ఈ బిల్లు సెలెక్టు కమిటీలో వేశాం. ఇందువల్ల కొంత తగువు వస్తుందనీ మాకు తెలుసు. అయితే, యథోచితం, సముచితం అయిన విమర్శలకు పూర్తి అవకాశమిస్తూ, ఇతను చేసిన సేవలదే పైచెయ్యి మేము అని తలచాము. అవును. ఏళ్ళూ పూళ్ళూ వృథా చేసేవాళ్ళూ ఇచ్చకాల వాళ్ళూ మన కక్కరలేదు."*

1904 మార్చి 21 న, ఇంపీరియల్ లెజిస్లేటివు కౌన్సిల్లో చేసిన ఒక ప్రసంగంలో (తన దృష్టిలో) యూనివర్శిటీ ఎలావుంటే ఆదర్శవంతంగా ఉంటుందో వివరించాడు. "నా ఉద్దేశం ప్రకారం యూనివర్శిటీ అనేది విద్యాభ్యాసానికీ, జ్ఞాన సముపార్జనకీ, ఆచార్యులూ, శిష్యులూ, కలసి కృషి చేసే పవిత్ర స్థలం. అక్కడ ఆశయ సిద్ధికి కావలసిన (భవనాలూ, నిధులూ వగైరా) వసతులూ - వసరులూ ఉండాలి. విద్యా, జ్ఞాన విషయికాలైన తన సదాశయాలను సాధించడంలో యూనివర్శిటీ మీద ఎటువంటి ఆంక్షలు పరి

*ఆదే గ్రంథంలో 60వ పేజి

మితులు ఉండకూడదు. అక్కడ బోధించే విషయాల మీద, విధానాల మీద, పరిధుల మీద పై వాళ్ళ పెత్తనం వుండకూడదు. ప్రభుత్వ అధికారులు రాజకీయ లేదా మతపరమైన నాయకులు, సమాజంలోని పెద్దలు ఆఖరికి విశ్వవిద్యాలయ పాలనా యంత్రాంగంలోని పండితులు - ఎవరికీ కూడా యూనివర్శిటీ ఆలోచనకి అధికార పద్ధతిని సంకెళ్ళు వేయడానికి వీలుండ కూడదు. విచక్షణ సూచించే మేరకు, పూర్తి స్వేచ్ఛా స్వాతంత్రాలను, అధికారాలను ప్రసాదించాలి. మేధారంగంలో అది తన పాత్రను సక్రమంగా నిర్వహించేందుకు వీలుగా ఈ అధికారాలను జాగ్రత్తగా ఎంపిక చేసిన విద్యావేత్తల చేతులలో ఉంచాలి. ఈవిద్యావేత్తల సంఖ్య వారు కలిసికట్టుగా దక్షతతో పని చెయ్యడానికి వీలయినంత చిన్నదిగా వుండాలి; ఆదేదో బుద్ధిజీవుల ముఠాగా పతనం కావడాలికి అవకాశం యివ్వనంత పెద్దదిగానూ వుండాలి. అంతే కాదు. ఈ మండలిలోని సభ్యులను అప్పుడప్పుడు మారుస్తూ వుండడం వలన ఎవరో కొందరు వ్యక్తుల ముద్ర పడకుండా నివారించ వచ్చును. (ఇలాంటి మార్పు వలన పాత కొత్తల మేలు కలయికను కూడా సాధించ వచ్చును.) తద్వారా, (స్పష్టంగా తేలినంత మేరకు) గతానికి, (రూపకల్పన చేయడానికి వీలయినంత మేరకు) భవిష్యత్తుకు ఆ మండలిలో చోటు లభించే అవకాశం ఉంటుంది.

బిల్లు పెట్టారే గాని, దీని ధ్యేయం నెరవేరే సూచనలేం కనబడలేదు. పై పెచ్చు తీవ్రమైన ఖండన భారతీయుల నుంచే వచ్చింది. గోఖలే ఇండియన్ లెజిస్లేటివ్ కౌన్సిల్లో ఒక సభ్యుడు కదా; అతనీ బిల్లును తీవ్రంగా విమర్శించాడు. భారత ప్రభుత్వం "ఈ యూరపియన్ విద్యా వేత్తలకు శాశ్వతంగా గుత్తాధికారం ఇచ్చేయడానికే ఈ ఏర్పాటు చేస్తోంది" అంటూ తెగేసి చెప్పాడు. "ఈ యూనివర్శిటీలో జరిగే చర్చలతో ఎవరికంటె కూడా ప్రొఫెసర్లకే సన్నిహితమైన సంబంధం; అయినా వాళ్ళకి ఈ బిల్లు ప్రకారం సెనేటు ఎన్నికలో ఏ అవకాశం లే" దని గోఖలే ఎత్తి చూపించాడు. అదీ కాక, ఎన్నిక చేసుకోవలసిన స్థానాలు అతి తక్కువగానూ, ప్రభుత్వం నామినేట్ చేసేవి అతి ఎక్కువగానూ, బిల్లుమీద వచ్చిన ఈ విమర్శలో అశుతోష్ గోఖలే పక్షం అయ్యాడు. కళాశాల స్థాయి బోధనలో ఎక్కువ భాగం భారతీయ అధ్యాపకుల చేతుల్లో వుండగా విశ్వవిద్యాలయ పీఠాల్లో యూరపియన్ల

సంఖ్యను హెచ్చింయకొంటూ పోవడం సమంజసంకాదని వాదించి, సెనేట్‌లో కళాశాలలనుంచి, యూనివర్శిటీల నుంచి, కొంతమంది ప్రతినిధులను చేర్చాలని బిల్లులో ఒక సవరణను ప్రతిపాదించాడు అశుతోష్. కాని అధికార వ్యతిరేకతకుబలై పోయిందది*[1] "ఉన్నత విద్యను పూర్తిగా ప్రజల చేతుల్లోనే వదిలెయ్యాలని నేను అనను. అదీకాక, ఉన్నత విద్య అనేది ప్రభుత్వం చేపట్ట వలసిన అతి ముఖ్యమైన ధర్మం అని; జాతికి ప్రయోజనం చేకూర్చే ప్రభుత్వం చేతుల్లోనే ఉన్నత విద్య జాగ్రత్తగా పెరగాలి, పోషించబడాలి, అని నేను మనస్ఫూర్తిగా అంగీకరిస్తున్నాను" అన్నాడు అశుతోష్. "కాని, యూనివర్శిటీ అనే దాన్ని ప్రభుత్వ శాఖల్లో ఒకటిగా మార్చేసే విధంగా చట్టంలో చేసే ఎలాంటి ఏర్పాటూ అనవసరం అనీ అవాంఛనీయమనీ నేను గట్టిగా వ్యతిరేకిస్తున్నాను. మరీ జాగ్రత్తకిపోయి, ఎదగవలసిన చెట్టుకి అస్తమానూ, కొమ్మలు నరికేసి సాఫు చెయ్యడం లాంటిదిది"*[2] బిల్లు ప్రకారం సెనేటు విధించిన నిబంధనలు ప్రభుత్వ ఆమోదంకోసం పంపుకోవాలి. మార్పులూ, చేర్పులూ, చెయ్యాలని ప్రభుత్వానికి తోస్తే సెనేటును సంప్రదించి నిబంధనల్లో చేర్చాలి. గోఖలే, అశుతోష్ లిద్దరూ దీనికి వ్యతిరేకించారు. "నిబంధనల్లో మార్పులూ చేర్పులూ చెయ్యడానికి ప్రభుత్వానికి అధికారం వుండాలన్నది నేను ఒప్పుకోను. యూనివర్శిటీ అంటే నిపుణుల సముదాయం అని నిశ్చయమే కదా. మరి అలాంటప్పుడు, సున్నితం కష్టం అయిన ఈ కార్య నిర్వహణ విషయంలో నిపుణతగల సలహా అంటూ ఏదైనా వుంటే దాన్ని సెనేటులోంచి కాక వేరే ఎక్కణ్ణుంచి తెస్తుంది ప్రభుత్వం?"*[1].... ఈ బిల్లులోని విషయాలు అనుబంధ సంస్థల నిర్వహణ తీరు తెన్నులను మెరుగు పరుస్తాయన్నది గోఖలే ఒప్పుకోలేదు. అశుతోష్ మాత్రం కొత్త పద్ధతి అమల్లో కొస్తే అనుబంధ కళాశాలల పని మరింత బాగుంటుందని తలచాడు. "అనుబంధ కళాశాలల అవసరాలను నిర్వచిస్తున్న ఈ బిల్లులోని విషయాలు నాకు ఆమోదమే. వీటిని వివేకంతో, సానుభూతితో న్యాయంగా

---

1. సూరేశ్చ కలకత్తా యూనివర్శిటీ పుట 172

2. అదే గ్రంథం పుట 171-172

* 1. అదే గ్రంథం; పుట 175

అమలు పరిస్తే మన కళాశాలల స్థాయిని పెంచడానికి తోడ్పడుతాయన్నదాంట్లో నాకు సందేహం లేదు."*[2]

బిల్లులోని అనేక సూత్రాలకు అభ్యంతరాలు తెలిసినా, తాను సెలెక్టు కమిటీ సభ్యుడు కనుక, చట్టం అమలు జరిగే నాటినుంచి తొలి సంవత్సరం లోపుగా సాధారణ సభ్యుల ఎన్నికకీ నియామకానికీ, ప్రస్తుతం వున్న యూని వర్సిటీ పాలనా యంత్రాంగం కొనసాగడానికి సంబంధించిన కొత్త చట్టపు 12వ సెక్షనులో (అమలు జరగడానికి అవసరమయ్యే) సూత్రాలను పొందు పరచడం ద్వారా చట్టపు ముఖ్య భాగాన్ని తానే సమర్పించాడు అశుతోష్. ఈసూత్రాల అవలంబన విషయం రేలీ ఇంపీరియల్ లెజిస్లేటివ్ కౌన్సిల్‌లో పెట్టినప్పుడు, "కలకత్తా హైకోర్టు న్యాయమూర్తి ఒకరి మేధా సంపత్తివల్ల ఈ సూత్రాలేర్పాటయ్యాయి. వారు సెలెక్టు కమిటీ సభ్యులు; గోఖలే గారికి అత్యంత సన్నిహిత మిత్రులూనూ, బిల్లు ఈ ప్రస్తుత స్వరూపంలోకి రావ డానికి వారే బాధ్యులు"*[3] అని ఉదహరించాడు.

1904వ సంవత్సరపు భారతీయ యూనివర్శిటీల చట్టం మూడవ సెక్షనులో, ఈ నిబంధన వివరణ ఇలా వుంది:— యూనివర్శిటీ అనేది (మిగిలిన విషయాలతోబాటు) విద్యార్థులకు శిక్షణ యివ్వడానికి సంస్థాపించ బడింది. కనక, యూనివర్శిటీకి ప్రొఫెసర్లను, ఇతర అధ్యాపకులను నియ మించే అధికారం వుంటుంది. అలాగే విద్యాసంస్థల్ని ఏర్పాటు చేసి వాటిని పోషించడానికి, యూనివర్శిటీలో గ్రంథాలయాలను పరిశోధనాలయాలను వస్తు ప్రదర్శనశాలలను నిర్మించి వాటికి (అవసరమయ్యే) సాధన సంపత్తిని సమకూర్చడానికి; విద్యార్థుల నివాస ప్రవర్తనలకు సంబంధించిన నిబంధన లను విధించడానికి; ఈ సంస్థాపన చట్టాన్ననుసరించి విద్యార్జన పరిశోధనల బాగుకోసం అన్ని కార్యకలాపాలను నిర్వహించడానికి యూనివర్సిటీకి అధి కారాలున్నాయి."

ఈ సెక్షనులో ఇదంతా వుండడం ఆసరాగా, తన యూనివర్శిటీని బోధన పరిశోధనల మహా విద్యానిలయంగా నిర్మించి తీర్చి దిద్దుకోవడమే

---

* 2. అదే గ్రంథం; పుట 173

* 3. అశుతోష్ ముఖర్జీ జీవిత చరిత్ర (ఎన్. కె. సిన్హా) పుట 60)

ఇక అశుతోష్ పని. అయితే బిల్లు (ప్రవేశపెట్టిన) నాటినుంచీ కూడా, నిధుల విషయం పెద్ద సమస్య కాగలదని అశుతోష్ గుర్తించాడు. అందుచేత యూనివర్శిటీకి ఉదారంగా ధారాళంగా సహాయం చెయ్యమని ప్రభుత్వాన్ని కోరాడు.

కొత్త ప్రణాళికను అమలుపరచడానికి, అలెగ్జాండర్ పెడ్లర్‌ని కలకత్తా యూనివర్శిటీ వైస్‌ఛాన్సెలర్‌గా నియమించారు. చట్టం వచ్చిన ఏడాదిలోగా "సవరించిన నిబంధనలను" విధించ వలసివున్నా, సెనేట్ అలా చెయ్యలేక పోయింది. ప్రభుత్వంమరో ఆరు నెలలిచ్చింది. అయినా అప్పటికీ పనిపూర్తవ లేదు. అందుచేత ప్రభుత్వమే, చట్టాననుసరించి నిబంధనలను విధించవలసి వచ్చింది. నిబంధనలను విధించే పని పూర్తిచేయడానికి వివిధ అభిరుచులకు ప్రాతినిథ్యం వహించే సెనేటు సభ్యులతో ఒక చిన్న కమిటీని వేసింది భారత ప్రభుత్వం అశుతోష్ ముఖర్జీ అధ్యక్షుడు; మరో ఆరుగురు సభ్యులున్నారిందులో. రెండు నెలల్లో యాభై సార్లు సమావేశం అయి, ఈ కమిటీ తన కార్యభారాన్ని పూర్తిచేసింది. ఈ నిబంధనలను యాభై నాలుగు అధ్యాయాలుగా విభ జించారు. వీటిలో, కలకత్తా యూనివర్శిటీ వ్యవహారాలన్నిటినీ కూలంకని వివరంతో చర్చించేరు. వీటి రచయితా, నేతా అన్నీ అశుతోష్ ముఖర్జీయేనని వేరే చెప్పనక్కర్లేదు. హైకోర్టు న్యాయమూర్తిగా పనిచేస్తూ కూడా, ఈ పని అంతా చేసేదంటే; దీనికి అశుతోష్ పడిన శ్రమ ఎంతో; తేలిగ్గా వూహించొచ్చు.

1906లో పెడ్లర్ రిటైరవగానే అశుతోష్‌ని వైస్‌ఛాన్సలర్‌గా ఉండ మన్నారు. ఈ నియామకాన్ని వైస్రాయికి శిఫార్సు చేస్తూ భారత ప్రభుత్వం హోంశాఖ కార్యదర్శి హెచ్. హెచ్. రిస్లే ఇలా వ్రాశాడు:-"యూనివర్శిటీతో గల సుదీర్ఘమైన అనుబంధం, దానికి ఆయన చేసిన సేవ, అతని అధికార హోదా; వీటితో; వైస్‌ఛాన్సెలర్ పదవికి కావలసిన అర్హతను శాస్త్రీయంగా పొందడమే గౌరవనీయుడైన న్యాయమూర్తి ముఖర్జీలో ప్రత్యేకత-అవి చెప్పడానికి నేను సంకోచించను.... డాక్టర్ ముఖర్జీ ఈయూనివర్శిటీ సభ్యుడుగా 1889లో నియమితుడయ్యాడు. అప్పటి నుంచి ఈ పదహారేళ్ళ పై చిలుకు సిండికేటు సభ్యుడుగా వుండి, ఇన్నాళ్ళూ కూడా ఒకే ఒక్క సిండికేటు సమావేశానికి తప్ప మిగిలిన అన్ని (సిండికేటు, సెనేటు, ఫేకల్టీస్ ఆఫ్

ఆర్ట్స్) సమావేశాలకీ ఈయన హాజరయ్యాడు. గత పదకొండేళ్ళుగా ఈయన గణిత శాస్త్రపు బోర్డాఫ్ స్టడీస్‌కీ అధ్యక్షుడు. 1887 నుంచి న్యాయ శాస్త్రం లోను గణిత శాస్త్రంలోను అత్యున్నత పరీక్షలను నిర్వహించాడు. బెంగాల్ శాసన మండలిలో 1899 నుంచి 1903 వరకు యూనివర్శిటీకి ప్రాతినిథ్యం వహించాడు. 1903 నుంచి 1904 వరకు వైస్రాయి కౌన్సిల్‌లో అదనపు సభ్యుడుగా బెంగాల్ రాష్ట్రానికి ప్రాతినిథ్యం వహించాడు. 1902లో భారతీయ యూనివర్శిటీల కమిషన్‌లో బెంగాల్‌కి స్థానిక సభ్యుడుగా పని చేశాడు 1904లో యూనివర్శిటీల పునర్నిర్మాణం జరిగినప్పుడు ప్రభుత్వం యితన్ని సాధారణ సభ్యుడుగానే నియమించినా, ఆర్ట్స్, సైన్సు, లా, మూడు ఫేకల్టీలకీ నియమించ బడ్డాడు. గత సంవత్సరంలో, చట్టం 25వ సెక్షను క్రింద. నిబంధనలను రూపొందించే ముఖ్యమైన కార్యభారం సెనేటుమీద పడింది. ఇందుకోసం సెనేటు కొన్ని కమిటీలుగా విభజించ బడింది. వీటిల్లో ఒక్క దానిలో తప్పమిగతా వాటన్నిట్లోలోనూ కూడా ఈయన పని చేశాడు. ఇదికాక, యూనివర్శిటీ పుట్టినప్పటి నుంచి జరిగిన కార్యకలాపాల గురించి ఈయనకి గణనీయమైన పరిజ్ఞానం వుంది. యూనివర్శిటీ అంతరంగిక వ్యవహారాలు, వాటి తీరుతెన్నులు ఈయనలాగా తెలిసినవాడు మరొకడు లేడు. (ఇప్పటి వైస్‌ఛాన్సెలర్ కూడానూ. ఎందుకంటె; రకరకాల కమిటీలలో చర్చలు కొనసాగించడానికి ఆయన కూడా సాధారణంగా ఈయన సలహాల మీద ఆధారపడ్డవాడే.) ........నిబంధకల సూత్రీకరణ జరుగుతున్న ఈ క్లిష్ట సమయంలో, యూనివర్శిటీ గత చరిత్ర గురించి: ముఖ్యంగా గత సంవత్సరంలో నిబంధనలపైన చర్చల గురించీ క్షుణ్ణంగా తెలిసినవాడే వైస్‌ఛాన్సెలర్‌గా ఉండడం తప్పనిసరి. ఇవన్నీ ఇతనిలా తెలిసినవాడు ఇంకొకడులేడు. యూనివర్శిటీ మనుగడకి అవసరమైన ఖచ్చితమైన నిబంధనా వళిని రూపొందించే మహా కార్యభారాన్ని నిర్వహించ గలవాడు ఇతను కాక ఇంకొకడుంటాడని నేను అనుకోలేను. యూనివర్శిటీ వ్యవహారాల్లో ప్రభుత్వం ఉద్దేశాలను అమలు పరచడం విషయంలో డాక్టర్ ముఖర్జీని విశ్వశించాలని నేను నమ్ముతున్నాను, యూనివర్శిటీల కమిషన్‌కి సమర్పించిన ఒక అంతరంగిక ప్రకటనలో, (విద్యావిధాన) స్థాయిని పద్ధతి ప్రకారం (వలె)

దిగాజార్చేస్తూ వుండడాన్ని తీవ్రంగా గర్హించాడీయన. పదేళ్ళ క్రిందట ఈయనతోబాటు పిండికేట్లో (నేనూ) ఉన్నప్పుడు; ఈయనెప్పుడు పటిష్ఠ మైన విద్యా విధానం పక్షమే.*

అత్యున్నతమైన ఈ పదవి అశుతోష్; 1906 నుంచి 1914 వరకు ఎనిమిదేళ్ళ పాటు (వరుసగా నాలుగు టరమ్ల పాటు) నిర్వహించాడు. దాంతో, బెంగాల్లో ఉన్నత విద్య చరిత్రలో ఒక నూతన శకం ప్రారంభ మైనట్టు.

---

*అశుతోష్ ముఖర్జీ జీవిత చరిత్ర - (ఎన్. కె. సిన్హా) - 64-66 పుటలు

# 4. శాసనసభలో కలకత్తా కార్పొరేషన్‌లో అశుతోష్ (1899-1904)

1899లో అశుతోష్ ముఖర్జీ కలకత్తా యూనివర్సిటీ నుంచి బెంగాల్ శాసనమండలికి ఎన్నికయ్యాడు. కలకత్తా నగరపాలక సంస్థ రాజ్యాంగానికి సవరణలను ఉద్దేశించిన బిల్లు ఒకటి (మెకంజీ బిల్లు అనేవారు) అప్పట్లో శాసనసభ పరిశీలనలో ఉండేది. కార్పొరేషన్‌లో: ఎన్నికలద్వారా నియమితు లయ్యే సభ్యుల సంఖ్య తగ్గించడం, ప్రభుత్వపు పెత్తనం పెంచడం ఈ బిల్లు ఉద్దేశం. 1888 నుంచీ అమల్లో వున్న రాజ్యాంగం ప్రకారం నగర పాలక సంస్థ సభ్యులు (వీరిని కమిషనర్లు అనేవారు.) డెబ్బయ్యయిదు మంది అయితే, అందులో యాభైమంది ఎన్నిక ద్వారానూ, పదిహేనుమంది ప్రభుత్వ నామినేషన్ వల్ల, ఇంకో పదిమంది బెంగాల్ చాంబర్ ఆఫ్ కామర్స్, పోర్టుట్రస్టు, ఇతర వ్యాపార సంఘాల నామినేషన్ వల్ల ఆయా స్థానాలు పొందేవారు. మెకంజీ బిల్లు ప్రకారం మొత్తం సభ్యుల సంఖ్య యాభైకి తగ్గింది. అందులో ఇరువై అయిదుగురు రేటుపేయర్ల ద్వారా ఎన్నిక వ్వాలనీ, వ్యాపారరంగం నామినేషన్ ద్వారా పదిమంది అనీ, మిగతా పది హేను మందీ ప్రభుత్వ నామినేషన్ వల్ల రావాలనీ మెకంజీ బిల్లు ఉద్దేశం. పరిపాలనాధికారం యావత్తు హస్తగతంగా వుండే చేర్మన్ పదవికి ప్రభుత్వ నామినేషను. చేర్మన్‌కి కార్పొరేషన్‌కీ మధ్య పన్నెండుమంది సభ్యులతో (కమిషనర్లతో), చేర్మన్‌తో-ఒక కమిటీ. ఆ పన్నెండుమందిలో నలుగుర్ని వార్డుల సభ్యులు ఎన్నుకోవడం. ఆ నలుగురూ నియమించే సభ్యులు మరి నలుగురు. మిగిలిన నలుగురూ ప్రభుత్వ నామినేషన్ ద్వారా రావాలి. అదీ ఆ బిల్లు.

ఈ బిల్లు ప్రవేశపెట్టడం కలకత్తాలోని పుర ప్రముఖులనుంచి రేటు పేయర్లనుంచి బలమైన వ్యతిరేకతకు, ప్రదర్శనలకు దారితీసింది. అశుతోష్ ప్రజాహిత మార్గంచేపట్టి, సురేంద్రనాధ్ బెనర్జీతో కలిసి శాసన సభలో

వ్యతిరేకించి; బిల్లులో సూత్రం మాత్రం తీసుకొని జగడానికి దిగాడు. బిల్లులో 650 సెక్షన్లకి పైగా ఉన్నాయి. అలాగ, 1899 సెప్టెంబరు 9న ప్రారంభమైన ఆ వాదన సెప్టెంబరు 27 వరకు సాగింది. అశుతోష్ చాలా సవరణచే ప్రతిపాదించేవాడు. కాని వాటిలో ఎక్కువభాగం వీగిపోయాయి. కార్పొరేషన్ కి కలకత్తా యూనివర్సిటీ నుంచి (ఒక సభ్యుడు ఎన్నికో, నామినేషన్) ఒక సభ్యుడుండాలని అశుతోష్ సూచించాడు. కార్పొరేషన్ కి ప్రాథమిక, ధర్మాలను వివరిస్తున్న ఈ బిల్లులోని సూత్రాల్లో ప్రాథమిక, సాంకేతిక విద్యలపోషణ-ఉచిత గ్రంథాలయాల ఏర్పాటుల మీద శ్రద్ధ వహించాలని ఉంది. అందువల్ల కార్పొరేషన్ లో కనీసం ఒక్కడైనా విద్యా సంబంధి సభ్యుడు ఉండాలన్న ప్రతిపాదనలో అన్యాయం ఏమిలేదు. పురపాలక ప్రభుత్వంలో పాలుపంచుకోవడానికి ఆస్తి ప్రాతిపాదికగా కల అర్హత ఒక్కటే కాదు కావలసింది అన్నాడు అశుతోష్. ఒక ప్రతినిధిని పంపడానికి సెనేటుకి అధికారం వుంటే ఒక డాక్టరునో, ఇంజినీరునో పంపాలని కూడా అతనన్నాడు. అటువంటివ్యక్తి సలహా అమూల్యం కదా. కాని ఈ సవరణ కూడా వీగిపోయింది. నెలకి నూరు రూపాయలకి మించిన జీతం తీసుకుంటున్న కార్పొరేషన్ ఉద్యోగి ఎవరైనా బర్తరపు అయితే అతను అందుమీద జనరల్ కమిటీకి అప్పీల్ చేసుకోవచ్చునని అశుతోష్ తెచ్చిన ఒక సవరణ ఆమోదం పొందింది.

కార్పొరేషన్ లో దుష్ప్రవర్తన, దుష్పరిపాలన ఉన్నాయని ప్రభుత్వానికి అందిన రహస్య నివేదికల ఫలితంగా ఈ బిల్లు వచ్చింది. చర్చ ముగింపు సందర్భంగా మాట్లాడుతూ అశుతోష్ ఇలా అన్నాడు: ఇది భారత సామ్రాజ్యానికి రాజధాని. ఈ నగర – పాలక ప్రభుత్వం దగ్గిర ప్రాతినిధ్యం లేని అపల్లో ఉంది. దీని విధానాలను నాశనం చేయడానికో చిన్నాభిన్నం చేయడానికో ఉద్దేశంతో జరుగుతోంది. పెద్దయెత్తున ఈ ప్రయత్నం. లేకపోతే ఈ బిల్లు కౌన్సిల్లో ప్రవేశ పెట్టడమేమిటి? ఇదేమైనా తెలివా, వివేకమా? ప్రజల సంపూర్ణ విశ్వాసాన్ని చూరగొనే నిర్ణయం చేయగల ఒక స్వతంత్రమైన విచారణ సంఘం రావలసిందే. దాని ద్వారా నిజా నిజాలు తేలవలసిందే. అంతవరకు దీన్ని గురించి అడక్కుండా వూరుకునేది లేదు; కొన్ని దురాచారాలు వున్నాయిట; వాటి నిర్మూలనకే ఈ బిల్లు ప్రవేశ పెట్టారట. సరే అవేమిటో యిప్పుడే చూద్దాం. కలకత్తా కార్పొరేషన్ లో విద్యాధికులైన

హిందువుల పెత్తనం తొలగించడం దీంట్లో ఒకటి. బిల్లు పెట్టి ఈ ఆశయాన్నైతే సాధించేరు; కాని—విద్యాధికులైన హిందువుల పెత్తనానికి బదులు ఏమిటొచ్చింది? యూరప్ నుంచి వచ్చి వ్యాపారం చేసుకుంటున్న వాళ్ళ పెత్తనమా? కాదు? పోనీ ప్రగతి గాములైన మహమ్మదీయుల పెత్తనమా? అదీ కాదు; అంతా తీసుకెళ్ళి, బాధ్యతంటే సొక్కని అధికారుల చేతుల్లో పెట్టారు.

"ఈ బిల్లులో సూత్రాలు చూడండి. ఇందులో ధర్మ శాస్త్రపు ప్రాథమిక నిధులను పట్టించుకోనివి ఛాలా యిరికించేరు. ఇక పన్నులెలా విధించేరండీ అంటే—ఏ ఆర్థిక శాస్త్రపు ప్రాథమిక సూత్రాలనూ లెక్కచేయకుండానూ, ఆఖరికి బ్రిటన్‌లో అమలు పరుస్తున్న న్యాయానికైనా పొందకుండానూ, చిత్తం వచ్చిన ధోరణిలో చేసేరు. పోనీ, భూ సంపాదన నియమాలు? బొత్తిగా సైద్ధాంతికమైన రక్షణ లేని మార్పులు దీంట్లో జొప్పించేరు. అన్నిటికీ మించి. ఈ బిల్లులో పెట్టిన అంశాలు మరీ అలవిగానంత సంఖ్యలోవున్నాయి. అందులో చాలామట్టుకు చిత్రమైనదీ. క్లిష్టమైనవీని. పాలకులకి గాభరా పుట్టిస్తాయి. పేదలకి బాధకలిగిస్తాయి. కంగాళీగాతంటాల మాదిరిగాఉన్నాయి ఇవి.*[1]

ఆ రోజుల్లో శాసనమండలులు కేవలం ఆలోచించి వూరుకునే (స్వభావం గల) పీఠాలు. అధికార సభ్యుల సంఖ్య హెచ్చు. శాసన స్వరూపం మీద అనధికారుల ప్రభావం వుండేది కాదు. ఈ మెకంజీ బిల్లు చర్చలో, బిల్లు ఆధీనంలో వున్న సభ్యుడు, ప్రతిపాదించిన శాసనం సూత్రప్రాయంగా ప్రభుత్వ ఆమోదాన్ని పొందింది. కనక శాసన మండలి కర్తవ్యం కేవలం ప్రభుత్వపు ఆజ్ఞను నిర్వర్తించడమే" నని ఖచ్చితంగా చెప్పేడు. అశుతోష్ కి వొళ్లు మండింది. "కౌన్సిల్ అధికార సభ్యుల విధి ఇదేనని ధ్రువపరచి చెప్పినా నేను ఆశ్చర్యపడను. కాని, అనధికార సభ్యులకి, ఇది అమలు పరచడమే విధి అంటే అది చాలా అసందర్భం అని నేను తోసిపుచ్చుచున్నాను. ఆలోచించడానికే దాని ప్రకారం న్యాయమేమిటో నిర్ణయించడానికీ మాకు అధికారం వుంది. మేము యిక్కడ ఆత్మలను అమ్ముకొని కూర్చోలేదు. మీరో, లేక ఈ పార్టీయో మరో పార్టీయో ఆమోదిస్తే ఆమోదించవచ్చు'

1.* బెంగాల్ లెజిస్లేటివు కౌన్సిల్ వివరాలు : సెప్టెంబరు 27, 1899.

లేకపోతే తిరస్కరించవచ్చు. కానీ, ఈ పీఠంలో సభ్యత్వమనే గౌరవం ఉన్నంత వరకు నాశక్తిని అనుసరించి నాకు న్యాయమని తోచిందేదో కౌన్సిల్ కి సలహా చెప్పడం నా విధి"*2

మొత్తం మీద మెకంజీ బిల్లు చట్టం అయిపోయింది. అయితే అశుతోష్ ని కలకత్తా కార్పొరేషన్‌లో ఒకసభ్యుడి [కమీషనర్]గా ప్రభుత్వం నామినేట్ చేసింది. అందులో మళ్ళా అతను జనరల్ కమిటీ సభ్యుడుగా ఎన్నికయ్యాడు. 1903లో బెంగాల్ లెజిస్లేటివ్ కౌన్సిల్లో కలకత్తా కార్పొరేషన్ ప్రతినిధిగా వెళ్ళేడు. ఎక్కడున్నా చురుకేగా. కార్పొరేషన్‌లోనూ అంతే. రేటుపేయర్ల ప్రయోజనం కోసరమే పనిచేశాడు. రోడ్ల మరమత్తులు. డ్రెయినేజి అభివృద్ధి అతని దృష్టిని బాగా ఆకర్షించాయి.

1900 జనవరిలో బెంగాల్ మునిసిపల్ చట్టాన్ని డార్జిలింగ్‌కి అన్వయించే విధంగా సవరించడానికి ఒక బిల్లు బెంగాల్ కౌన్సిల్లో ప్రవేశ పెట్టారు. దీని సెలెక్ట్ కమిటిలో ఒక సభ్యుడుగా అశుతోష్ నియమితుడయ్యాడు 1900-1901 సంవత్సరానికి బెంగాల్ ఆర్థిక ప్రణాళికలో విద్యారంగానికి చేసిన ఏర్పాటును అశుతోష్ తీవ్రంగా విమర్శించాడు. ప్రభుత్వ. కళాశాలల నిర్వహణకి చేస్తున్న ఖర్చు ఏడాదేడాదికి తగ్గిపోతూ రావడాని గమనించి అతను చాలా వ్యధ చెందేడు. ఇదిలా వుండగా ఆ కాలేజీల్లో ఫీజు క్రిందవస్తున్న వసూళ్ళు అవే సంవత్సరాల్లో అధికమవుతూనూ వచ్చాయి. "నాకేకాదు. విద్యావంతుడైన ప్రతి భారతీయుడికి కూడా ఈ పరిస్థితి మిక్కిలి విచారకరం!" అన్నాడతను. కనీసం ఒక్క ప్రభుత్వ కళాశాలలోనైనా. మిక్కిలి సమర్థులైన అధ్యాపకులతో, సాధ్యమైనంత అత్యున్నత ప్రమాణంలో విద్యాబోధ జరగాలని; ఆవిధంగా ప్రభుత్వేతర విద్యా సంస్థలకు బాగా సమర్థులైన అధ్యాపకులు లభ్యం కావాలని అతను తలచాడు. ప్రాథమిక విద్యను పటిష్ఠం చేసేందుకు అధిక ఆర్థిక వనరులు కల్పించే నెపంతో ప్రభుత్వం కాలేజీలను బలహీనం చేయకూడదు. సామాన్య ప్రజలను విద్యావంతులుగా చేయడంలో ప్రభుత్వ విధిని ఎవరికీ తీసిపోనంతగా నేను మెచ్చుకోగలను. అయితే ఉన్నత విద్యకు అర్హతగల ప్రజల మాటేమిటి? ఆ

*2—అందులోదే, ఇదేనూ—

లాభాన్ని వారు పొందే విధంగా సాధ్యమైనన్ని సావకాశాలు కల్పించడం కూడా ప్రభుత్వానికి విధాయకమే, అన్నసంగతి నేను విస్మరించలేను." ఆయన ఇంకా ఇలా అన్నాడు; ప్రభుత్వం ఉన్నత విద్య ప్రయోజనాన్ని బలహీన పరచే సమయం వచ్చిందని నేను అంగీకరించలేను. సమర్థులైన వ్యక్తుల్ని తక్కువ జీతాలతో వుంచడం, అంతగా సమర్థులు కానివారిని ఉద్యోగాల్లో నియమించడం, ఈ రకమైన ఉద్యోగ హైన్యం నాకు కష్టంగా వుంది. విద్యారంగంలో మనం అత్యుత్తమ సామర్థ్యాన్నే చేరదియ్యాలి. ఇతర శాఖలను విద్యాశాఖ కంటె ఆకర్షణీయంగా చేసి, ఏ న్యాయశాఖలోనో పాలనాశాఖలోనో అంతకంటె ఉన్నతమైన అవకాశాలు కల్పించుకుంటూ పోతే విద్యాశాఖకి సమర్థులైన వారు ఎందుకొస్తారు?*

స్వల్ప ప్రాముఖ్యం కలిగిన చట్టాల విషయంలో కూడా అతను అశ్రద్ధ చూపలేదు. 1869వ సంవత్సరపు 1వ (జంతుహింస) చట్టానికి 1900లో మార్చి 31న కౌన్సిల్లో ఒక సవరణను ప్రతిపాదించారు. అశుతోష్ నాలుగు సవరణలను ప్రతిపాదించాడు. అందులో ఒకటి పోయింది, ఒకటి నెరవేరింది. మిగతా రెండింటినీ అతనే ఉపసంహరించుకున్నాడు. "జంతువు" అనే పదానికి మరింత మంచి నిర్వచనం యివ్వాలన్న సవరణ పోయింది. నేరం జరిగాక నేరం అమలుకి వుండే గడువును తగ్గించడానికి ప్రతిపాదించిన సవరణ నెగ్గింది.

1902-03 సంవత్సరపు బెంగాల్ ఆర్థిక ప్రణాళిక రూపొందగానే రాష్ట్ర స్థాయిలోను, అంతకు దిగువ స్థాయిలోను ఉన్న విద్యాశాఖ ఉద్యోగుల అంతస్తును పెంచవలసిన అవసరాన్ని ఎత్తి చూపాడు అశుతోష్. న్యాయశాఖ, పాలనా శాఖల ఉద్యోగులందుకునే ప్రారంభ వేతనం విద్యాశాఖలో కంటె ఎక్కువ. పైగా వాటిలో ప్రమోషన్లకి అవకాశాలు త్వరగా వస్తున్నాయి, రాష్ట్రస్థాయి విద్యాశాఖ ఉద్యోగుల జీతాలూ అవకాశలూ కూడా కనీసం దిగువ స్థాయిలోని న్యాయశాఖ పరిపాలనా శాఖల ఉద్యోగుల జీవితాలకంటే తక్కువగా ఉండకూడదని అశుతోష్ అన్నాడు. తగినన్ని అర్హతలు కలిగి వుండి కూడా విద్యాశాఖ ఉద్యోగులు ఎంత హేయమైన జీతాలు తీసుకుంటున్నారో

* కలకత్తా లెజిస్లేటివ్ వివరాలు, ఏప్రిల్ 7, 1900

అతను ఉదాహరించేడు. ఇరవై అయిదేళ్ళు ఉద్యోగం చేసి సంస్కృత కాలేజీలో ప్రిన్సిపాల్‌గా ఉన్న ఒక ప్రఖ్యాత పండితుడు; ఇంకా 300 రూపాయల గ్రేడులో ఉన్నాడు. ఆయన దగ్గిర చదువుకుని పాలనాశాఖలో చేరిన వాళ్ళు అంతకి రెట్టింపు జీతం పుచ్చుకుంటున్నారు। ప్రభుత్వ పాఠశాలలో ఒక ఉపాధ్యాయుడికి నెలకి ఇరవై రూపాయల జీతం। కుర్రవాళ్ళ చదువులు మట్టిలోంచి వరదలోకి వెళుతున్నాయంటే వెళ్ళవూమరి? విద్యాశాఖలోనే (విద్యాశాఖలో కూడా) "సుపీరియర్", "ప్రొవిన్షియల్" సర్వీసుల మధ్య తేడా లున్నాయి. ఇవన్నీ ఒక పద్ధతిగా కాక, వెర్రివాడి చేతిలో రాళ్ళలా ఉన్నాయి. సమానమైన అర్హతలూ గుర్తింపూ గల ఇద్దరు పట్టభద్రుల్లో ఒకర్ని సుపీరియర్ సర్వీసులోను మరొకర్ని ప్రొవిన్షియల్ సర్వీసులోను వేశాం. ఇద్దర్నీ ఒకే కాలేజీలో వేశాం. పని ఇద్దరిదీ ఒకటే.-"తేడా అల్లా, జీతం దగ్గిరే వస్తుంది. మొదటివాడి జీతం రెండో వాడి జీతానికి సరిగ్గా రెట్టింపు।...ఇదిచాలా. అసందర్భం. ఇలా కూడా ఉంటే ఉండొచ్చులే అని సమర్థించడానికి తగినంత జడ్డితనం లేదు సుమండీ, నాకు।"

1903–04 బడ్జెట్‌లో విద్యారంగానికి కేటాయించిన నిధుల గురించి చర్చిస్తూ కూడా, ప్రభుత్వం విద్యాశాఖ స్థాయిని బాగు చేయలేక పోవడం పట్ల, పాలనాశాఖ న్యాయ శాఖలతో విద్యాశాఖను సమానంగా చూడలేక పోవటం పట్ల తీవ్రమైన ఆవేదన వ్యక్తం చేశాడు అశుతోష్.

1904 జనవరిలో అశుతోష్, వైస్రాయి శాసన మండలికి ఎన్నిక అయ్యాడు రాష్ట్రాల శాసన మండలుల అనధికార సభ్యులనుంచి ఈ ఎన్నిక. ఇందులో అశుతోష్ ఓడించిన ప్రత్యర్థులు సురేంద్రనాథ్ బెనర్జీ, దర్భాంగ మహరాజున్నూ.

1904 జనవరి 8వ తేదీని, ఇంపీరియల్ లెజిస్లేటివ్ కౌన్సిల్లో తన స్థానాన్నలంకరించాడు అశుతోష్. అయితే ఆ ఏడాది జూన్‌లో అతను కలకత్తా హైకోర్టు న్యాయమూర్తి కావడంతో ఆ సభ్యత్వం అయిపోయింది. కాని, ఈ స్వల్ప కాలంలోనే అతను, కౌన్సిల్ కార్యక్రమాల్లో ముఖ్యమైన పాత్రను నిర్వహించాడు.

చేరిన రోజునే, 1882వ సంవత్సరపు ఆస్తి బదలాయింపుల చట్టానికి సవరణను ప్రతిపాదిస్తూ వచ్చిన బిల్లుమీద చర్చలో అశుతోష్ అందులో

కొన్ని ముఖ్యమైన అంశాలను విమర్శించాడు. ఆ తరువాత; 1904 మార్చిలో, ఇండియన్ అఫీషియల్ సీక్రెట్స్ సవరణల బిల్లు వచ్చింది. భారత ప్రభుత్వానికీ స్వతంత్ర రాజ్యాలకీ మధ్య సివిల్ విషయాలలో జరిగే ఉత్తర ప్రత్యుత్తరాల సంగతి ఈ చట్టం నుంచి మినహాయించే ఉద్దేశ్యంతో అశుతోష్ కొన్ని సవరణలను ప్రతిపాదించాడు. వైస్రాయి, లార్డ్ కర్జన్, అలాంటి ఉత్తర ప్రత్యుత్తరాలు బహిర్గతం కాకుండా చూడాలని పట్టుపట్టాడు. "భారత ప్రభుత్వానికీ (అంటే వైస్రాయికీ) దేశీయ ప్రభువులకీ మధ్య సంబంధాలివి. ఇరుపక్షాల వారూ గొప్పగా చూసుకొనేవి. ఎక్కువ భాగం గౌరవ పదాలు. అలాంటివి బహిర్గతం చేసి వార్తా పత్రికల్లో యధేచ్ఛగా చర్చకు వదలడం కన్నా దురదృష్టం మరొకటి కనపడదు. అలాంటి పరిస్థితి మనకూ వాళ్ళకూ కూడా చిరాకే, ఇది ప్రభుత్వ ప్రయోజనాలకు ముప్పు" అన్నాడాయన. "ఈ దృక్పథాన్ని అంగీకరించలేక పోతున్నందుకు నాకు విచారంగా వుంది, భారత ప్రభుత్వానికి దేశీయ రాజ్యాలకీ మధ్య సివిల్ వ్యవహారాల గురించిన సమాచార ప్రచురణను ఈ బిల్లులో ప్రతిపాదిస్తున్న విధంగా శిక్షార్హం చెయ్యకూడదు. అలాంటి ప్రచురణ ఒక్కొక్కప్పుడు ఆయా వ్యవహారాల్లో సంబంధం వున్న కొద్ది మంది వ్యక్తులకు అధికారులకు తీవ్రమైన ఇబ్బందికి కారణం కావచ్చు (కాని అది అప్రస్తుతం కదా.) అదలా వుంచి ఈ రెండింటి మధ్య సివిల్ సంబంధాల ప్రచురణ అటు భారత ప్రభుత్వానికి ఇటు దేశీయ రాజ్యాలకీ కూడా ఉచితమైన ప్రయోజనం అని చెప్పడానికి నేను సాహసిస్తున్నాను, ఎంచేతంటే, ఈ రెండు శక్తుల వ్యవహారాలు ఎంత తీవ్ర పరిశీలననైనా తట్టుకోగల నిజాయితీ కలవి అయి వుంటే ఎలాంటి సహజమైన విమర్శకీ భయపడనక్కర్లేదు, అలాకాకుండా ఇంకో విధంగా వుంటే పరిపూర్ణంగా స్వేచ్ఛగా చర్చించుకోవడానికి అడ్డుండకూడదు."*

చర్చ ముగిసినప్పుడు బిల్లులో తాను అభ్యంతరం పెట్టిన భాగం మీద తన తీవ్ర నిరసనను తెలియజేశాడు అశుతోష్. "ప్రభుత్వం ఉద్దేశాలు ఏమయినా అవుగాక. ఈ బిల్లు ఇలా అమలు జరిగితే మాత్రం, ఈ

* వైస్రాయి లెజిస్లేటివ్ కౌన్సిల్ వివరాల సారాంశం మార్చి 4; 1904.

దేశంలో పత్రికా రచనమీద అది ఒక గొడ్డలి పెట్టు కాగలదు. సివిల్ వ్యవహారాలను గురించిన సమాచారాన్ని రహస్యంగా పరిగణించే ధోరణి ప్రభుత్వంలో ఒక బలహీనతగా మిగిలి పోతుంది. అంతేకాక న్యాయంగా స్నేహపూర్వకంగా వచ్చే విమర్శను అసంకల్పితంగా తప్పించుకునే ప్రకృతికి సూచనగా కూడా మిగిలిపోతుంది. ఏ దేశంలోనైనా, స్వేచ్ఛగాను బహిరంగంగాను చర్చించుకునే హక్కు మంచి ప్రభుత్వానికి తప్పనిసరి అయితే అది భారత దేశమే. యూరపులోను భారతదేశంలోను గొప్ప గొప్ప పత్రికా రచయితలు లేవదీసిన ఈ ఆందోళన చాలాబలిష్ఠమైంది. ఇది ఇరవయ్యవ శతాబ్దం. ఈ బిల్లు, పోనీ ఏదో నౌకాదళ సైనిక వ్యవహారాలకి మాత్రం సంబంధించిందైతే నేను దీన్ని తప్పక బలపర్చి ఉండేవాణ్ణి. కాని ఈ బిల్లు ప్రభుత్వ విధానాల మీద సజావైన విమర్శకి సంబంధించినట్టిది. ప్రభుత్వం ఇలా దీన్ని చట్టం చేసెయ్యడం పత్రికా స్వాతంత్ర్యానికి భంగకరం. ఇలాంటివి కూడా జరిగి పోతుంటే మనం ఏకాలంలో బతుకుతున్నట్టు? ఇది బ్రిటిష్ సామ్రాజ్యంలో ఏ భాగానికి చెందిన న్యాయశాస్త్రినికైనా సరే, ఒక మచ్చ అయి తీరుతుంది. అందు చేత ఈ బిల్లు మీద తీవ్రంగా నా నిరసనను తెలియపర్చడం నా విధిగా భావిస్తున్నాను."*1

తరువాత వచ్చిన సహకార పరపతి సంఘాల బిల్లును అశుతోష్ హృదయ పూర్వకంగా సమర్థించి ప్రభుత్వాన్ని అభినందించాడు. "మన కున్నది బహుళమైన వ్యావసాయిక జనాభా. వాళ్ళ ఆర్థికపరిస్థితి ఒక జటిలమైన సమస్య. ఇంతకు ముందొచ్చిన ప్రభుత్వాల నేర్పు ఈ సమస్యల పట్ల నిష్ఫలమై పోయింది. ఇది దానికి ఉపశాంతి కాగలదు. ముందు తరాల వారు ఈ బిల్లును ఈ సమస్యను విజయవంతంగా పరిష్కరించడానికి చేసిన మొదటి తీవ్ర ప్రయత్నంగా, సక్రమమైన పరిగణనం చేస్తారు."* 2

(1904 వ సంవత్సరపు భారతీయ విశ్వవిద్యాలయాల బిల్లును గురించి చర్చల్లో అశుతోష్ పాత్ర మూడవ ప్రకరణంలో చెప్పాము.)

---

*1. వైస్రాయి లెజిస్లేటివ్ కౌన్సిల్ వివరాల సారాంశం; మార్చి 4; 1904

*2. అందులోదే; మార్చి 23; 1904 నాటిది.

1904–05 సంవత్సరపు భారత ప్రభుత్వ బడ్జెట్ చర్చకొచ్చినప్పుడు, అప్పటికి నాలుగేళ్ళుగా ప్రతిఏటా ఫైనాన్స్ మెంబరు చూపిస్తూ వచ్చిన "మిగులు" విషయం ప్రస్తావించి, ఇప్పుడు పన్నులు తగ్గించడానికి సరైన అవకాశం ఉందని అన్నాడు అశుతోష్. ముఖ్యమైన విషయాలు రెండు:– 1. మారకంలో స్థిరత్వం. 2. 1883–84 నుంచి పెరుగుదలలో వున్న పన్నుల విధానం. మారకంలో స్థిరత్వం కృత్రిమం. అందువల్ల పేద ప్రజలకి అది బాధాకరం అయింది. అలాగే, ఒక్కొక్కసారి ఒక్కొక్క కారణం చెప్పి, అదనపు పన్నులను విధిస్తూ వచ్చారు. కాని ఆ కారణాలు (పరిస్థితులు) లేకుండా పోగానే ఆ పన్నులు తీసివేయడం జరగలేదు. ఒకానొక అగత్యం వల్ల విధించిన ఆదాయపు పన్నును ఎత్తెయ్యాలని అశుతోష్ గట్టిగా వాదించాడు. సాధారణంగా పన్నుల విధింపు అనేది ప్రభుత్వానికి హఠాత్తుగా తటస్థపడే తీవ్రమైన ఆర్థిక యిబ్బందిని ఎదుర్కొనడానికి, ఆదాయాన్ని ఖర్చుతో సమానం చెయ్యడానికీ జరగాలి. ఆ ఆర్థిక యిబ్బంది కొనసాగినన్నాళ్ళే ఆ పన్ను కూడా అమల్లో వుండాలి. అంతేగాని, ఓ పక్క బోలెడు మిగులు కనబడుతూ వుండగా కూడా, అంతకు ముందు దేనికోసమో వేసిన పన్ను కొనసాగడమనేది ఖచ్చితమైన ఆర్థిక సూత్రానికి, పన్నులు విధించడం వల్ల ఏర్పడే ప్రయోజనానికి వ్యతిరేకమై; చివరికి దుబారాలోకి దింపడానికి దారితీస్తుంది."*

ఆదాయపు పన్నుకి బహుళ జనామోదం లేదు; దీనివల్ల హింస లంచ గొండితనం వస్తాయి. అసలీపన్ను నిర్ణయంలోనే ఏదో అసమానత ఉంది —అని అశుతోష్ తన వాదనను కొనసాగించాడు. అంతకు ముందు 1862 లో వైస్రాయి కౌన్సిల్లో ఫైనాన్స్ మెంబరుగా వుండిన లాంగ్, 1868 లో వుండిన "మాసే"— ఆదాయపు పన్ను అనేది (స్వభావ సిద్ధంగా) తాత్కాలికంగా వుండాలన్న అభిప్రాయం వెలిబుచ్చిన సంగతి ప్రస్తావించాడు ......... బ్రిటిష్ నిధుల నుంచి, భారత నిధుల నుంచి కూడా సైనిక వ్యయాన్ని భరిస్తూన్నది, ప్రభుత్వం. అయితే, ఆ నిష్పత్తి పద్ధతి అన్యాయంగా వుందని అశుతోష్ తీవ్రంగా వాదించాడు. ఈ భారంలో మరికొంత

---

*వైస్రాయి లెజిస్లేటివ్ కౌన్సిల్ వివరాల సారాంశం: మార్చి 30; 1904

సమానత్వంగల పంపిణీ కోసం లోగడ వైస్రాయిలు పదునగా బ్రిటిష్ ప్రభుత్వాన్ని అడిగి లేదనిపించుకోవడం అశుతోష్ గుర్తు చేశాడు. భారత ప్రభుత్వం నుంచి వెళ్ళిన ఒక లేఖలో, "పన్నులు చెల్లించే తరగతి ప్రజలు ఇంగ్లాండులోనైతే ప్రపంచాని కంతటికీ ధనికులూ, భారతదేశంలో అయితే ప్రపంచాని కంతటికీ పేదలూ" అని మనవి చేయడం ప్రసక్తిలోకి వచ్చె అశుతోష్ ఈ విధంగా వ్యాఖ్యానించాడు. —"ధనికులూ, పెత్తందార్లూ అయిన జాతి; పేదలూ పాలితులూ అయిన జాతిమీద ఆధారపడి పబ్బం గడుపుకోవడం జరుగుతోంది. ఇది న్యాయం కాదు, సామ్రాజ్య విధానమూ కాదు "*

భారతదేశం అంతటా వ్యావసాయిక విద్యా బోధనకు ఏర్పాటు చేయాలన్నది అశుతోష్ ప్రభుత్వానికి చేసిన ఒక ముఖ్య సూచన. "మనకి కావలసినది భారత ప్రభుత్వంలో వ్యవసాయ శాఖంటూ ఒక డిపార్టుమెంటు కాదు; ప్రాథమిక, మాధ్యమిక, ఉన్నత స్థాయిలలో వ్యావసాయిక విద్య నిమిత్తం పాఠశాలలూ సదుపాయాలూ కూడాను" అన్నాడు అశుతోష్.

*వైస్రాయి లెజిస్లేటివ్ కౌన్సిల్ వివరాల సారాంశం; మార్చి 30; 1904.

# 5 కలకత్తా యూనివర్శిటీలో (1906-1914)

1908 లో కలకత్తా యూనివర్శిటీ స్నాతకోత్సవంలో మాట్లాడుతూ ఛాన్సెలర్ మింటో; "డాక్టర్ ముఖర్జీని వైస్ ఛాన్సెలర్‌గా పొందినందుకు ఈ విశ్వ విద్యాలయాన్ని నేను అభినందిస్తున్నాను." అన్నాడు. "ఈ విశ్వ విద్యాలయ చరిత్ర ఒకమలుపు తిరిగిన సందర్భంలో ఆయన దీని సారధ్యాన్ని చేపట్టారు. స్వర్ణోత్సవంతో ఈ విశ్వవిద్యాలయం ఒక సరికొత్త శకంలోనే కాక ఒక నూతన పాలనలో కూడ అడుగుపెట్టింది. (1857 నాటి విశ్వ విద్యాలయ స్థాపన చట్టం 1904 విశ్వవిద్యాలయ చట్టం వల్ల సవరించ బడింది కదా)

జ్ఞానం అనేది ఒక నావ. దాన్ని లోతులేని చట్లుల్లోంచి, ఇసుక పర్రల్లోంచీ కూడా నడిపించడానికి డాక్టర్ ముఖర్జీకన్నా సమర్ధుడైన నావికుణ్ణి నే నెరగను అన్నారు."

కలకత్తా యూనివర్శిటీకి సరికొత్త శకం ప్రారంభం అయింది. కాని; కొత్తగా ఏర్పరచిన నిబంధనలను సరిగా అమలుపరచడం ద్వారానే నిజానికి శకం ప్రారంభమయినట్లు, అప్పటి కలకత్తా విశ్వవిద్యాలయం పరిధి చాలా విపులమైనది. ఏర్పరచిన నిబంధనల స్వభావం విలక్షణమైనది. విద్యా ప్రమాణాల అభివృద్ధి కోసం ఏర్పరచిన ఆ నిబంధనల స్వభావాన్ని బట్టి అశుతోష్ కృషి ఎంత ముఖ్యమైనదో అర్థం చేసుకోవచ్చు. ఈ మార్పుల స్వభావాన్ని అశుతోష్ 1907 స్నాతకోత్సవ ఉపన్యాసంలో వివరించారు. "కొత్త నిబంధనలు ఏర్పరచడంలో కొన్ని ధ్యేయాలు వున్నాయి. పరీక్షలను సూక్ష్మీకరించాలి. (నేర్చుకునే విషయాలలో) ఏది ఎక్కువ అవసరమో ఏది తక్కువ అవసరమో తేడా తెలిసేటట్టు చెయ్యాలి. తక్కువ అవసరమనిపించే విషయాల్లో ఎంపికకి విద్యార్థులకి ధారాళమైన అవకాశం యిచ్చి ప్రతి విద్యార్థి తన విషయంలో 'పూర్ణంగా వుండాలని కోరడం. మాటవరసకి మెట్రిక్యులేషన్ స్థాయి తీసుకుందాం. దీనికి విషయాలు ఎలా నిర్ణయించాలి? గమనించే శక్తి

కొంత, తర్కించే శక్తి కొంత వ్యక్తీకరించే శక్తి కొంత, పట్టుబడేటట్టు ఈ నిర్ణయం జరగాలి. వ్యక్తీకరించే శక్తి అందించాలంటే మొట్టమొదట ఆ విషయం విద్యార్థికి తన స్వంత భాషలో చెప్పాలి. అంటే, విషయాన్ని అవగాహన చేసుకునేందుకు ఆ విద్యార్థికి భాషలో తగినంత పరిజ్ఞానం వుండాలి. క్రమంగా మెట్రిక్యులేషన్ నించి పట్టభద్రత వరకు విద్యార్థికి తన మాతృభాషలో స్వయంగా ఆలోచించి చెప్పగల, వ్రాయగల శక్తి అలవడాలని ఈ నిబంధనలు ఉద్దేశిస్తున్నాయి. భారతీయ దేశభాషల యోగ్యతకు గుర్తింపు రావాలి. అప్పుడు ఉత్తరోత్తరా సత్ఫలితాలు కలుగుతాయి-దేశభాషే కాదు. ప్రతి విద్యార్థి చాలినంత సాహితీశిక్షణ కోసం సరళమైనది, సరైనది అయిన ఇంగ్లీషు వ్రాయడం నేర్చుకోవాలి. పరిచితమైన విషయాలను స్పష్టం' ఆధునాతనం అయిన ఇంగ్లీషులో వ్యక్తపరిచే తెలివి కూడా సంపాదించాలి. ఇదికాక, వీలైనంత శాస్త్రోక్తంగా ఒక సంప్రదాయ భాషను అభ్యసించి. అందులో కొంత ప్రావీణ్యం పొందాలి. ఈ భాషలను తేలికగా నేర్పించి ఆ భాషల మధ్య పలుకుబడిలో, పద్ధతిలో, శైలిలో తేడాలు గమనించేట్టు చేస్తే, విద్యార్థికి తగినంత వివేకం చేకూరి, వ్యక్తీకరణ శక్తి సక్రమ మార్గంలో పెంపొందుతుంది. విద్యార్థికి కొంత తార్కిక శక్తి అలవరచాలంటే గణితశాస్త్రం కొంత చెప్పాలి. ముఖ్యంగా రేఖాగణితం ప్రయోగాత్మక రేఖా గణితంతో మొదలెట్టి, రేఖాగణితాత్మక తర్కానికి దారిచూపించాలి విద్యార్థికి గమనించే శక్తి కొంత అలవడాలంటే భౌతిక శాస్త్రం, మెకానిక్స్, (మూలక) రసాయన శాస్త్రం ప్రయోగాత్మక రీతిలో అభ్యసింపజేయాలి. మనకున్న పాఠశాలల్లో ఎక్కువ భాగానికి ప్రయోగాత్మక విషయాల బోధనకు అవసరమైన సరంజామా లేకపోవడం వల్ల ఇది ఆచరణయోగ్యం కానట్టు తెలిసింది.

అందువల్ల తన కిష్టమైన విషయం విద్యార్థిని ఎంచుకోనివ్వాలి. దేశ చరిత్రలో సాధారణమైన పరిజ్ఞానం కావాలి. అలాగే భూగోళంలోనూ. ఇలాంటి శిక్షణ వుండి దీనికి సరైన అధ్యయనం జరిగి, నిశితమైన జ్ఞాపక శక్తి కూడా వుంటే, విద్యార్థికి విశ్వవిద్యాలయ ప్రవేశానికి అర్హతలు లభిస్తాయి. ఇదంతా పదహారేళ్ళ వయసుకి పూర్తి చెయ్యడానికి విద్యార్థికి ఏమంత పెద్ద విశేషప్రజ్ఞ అక్కరలేదు. "అశుతోష్ చెప్పిన ఈ మాటలు దేశంలోని విద్యావేత్త

లందరూ వేదవాక్కుగా పదేపదే చదువుకుని పునశ్చరణ చేసుకోవాలి. (జ్ఞాన సంపాదనలో) సమగ్రతను సాధించే విధంగా న్యాయ, వైద్య (కళాశాలల) పద్ధతులలో మౌలికమైన మార్పులు సూచించబడ్డాయి-న్యాయ కళాశాలల్లో సమస్యల చర్చ కేసులు ఆధారంగా, న్యాయశాస్త్ర ప్రకరణాలు ఆధారంగా; జరిగే పద్ధతి ప్రవేశపెట్టబడింది-వైద్యవిద్యా పరీక్షల విషయంలో ఆస్పత్రి విధులకు అభ్యాసాత్మక శిక్షణకు వ్యవధి కలిపిస్తూ విద్యాభ్యాస కాలాన్ని ఒక ఏడాది పాటు పెంచడం జరిగింది-అధ్యాపకులు. బోధన విధానాల్లో సిద్ధాంతాల్లో శిక్షణ పొందడానికి బోధనలో ఒక డిగ్రీ కోర్సు ప్రవేశపెట్టబడింది. మౌలికమైన పరిశోధనకు గుర్తింపు. ప్రోత్సాహం వచ్చే విధంగా డాక్టరేటు డిగ్రీ నెలకొల్ప బడింది.

1904 సంవత్సరపు చట్టం మూడవ సెక్షను విశ్వవిద్యాలయ స్వరూపాన్నే మార్చేసింది. ఇప్పుడిది కేవలం పరిక్షా పీఠం మాత్రమే కాక, బోధనా సంస్థగా కూడా రూపొందింది. ఈ సెక్షన్ ప్రకారం లెక్చరర్లను ప్రొఫెసర్లను నియమించే అధికారం విశ్వవిద్యాలయాని కొచ్చింది. కనక, ప్రొఫెసర్ల, రీడర్ల, లెక్చరర్ల నియామకానికి సంబంధించిన నియమావళి రూపొందించ. అనుబంధితాలు కావడానికికాలేజీలు సమకూర్చుకోవలసిన అర్హతలు నిబంధించి బడ్డాయి-అలాగే, కాలేజీలను యూనివర్శిటీ అధికారి ఒకరు అప్పుడపుడు తణికీ చెయ్యడానికి సావకాశం చేస్తూ నిబంధన వచ్చింది. ఆ విధంగా కాలేజీలన్నీ యూనివర్శిటీలో భాగం అయిపోయి, అవన్నీ తృప్తిగా పని చేసేటట్టు చూడం యూనివర్శిటీకి విధాయకమైంది. విద్యార్థుల మానసిక వికాసంతో బాటు వారి భౌతిక నైతిక సంక్షేమాలు చూసే పనికూడా కాలేజీల బాధ్యత అయింది-అలా, విద్యార్థుల వసతికి నిబంధన లొచ్చాయి. శాడ్లర్ కమిషన్ ఈవిధంగా వ్యాఖ్యానించింది:-1904వ సంవత్సరపు చట్టం వచ్చి దాని ప్రకారం పని ప్రారంభం అయ్యాక, విద్యార్థి జీవితపు పరిస్థితులు, కాలేజీలిచ్చే శిక్షణ స్వభావం సమూలంగా మెరుగు పడ్డాయి· ఈ విజయాల విలువను మేం సాదరంగా గుర్తిస్తున్నాం."

ప్రఖ్యాత జాతీయ నాయకుడు సురేంద్రనాథ్ బెనర్జీ అప్పుడు సెనేటు సభ్యుడు. అశుతోష్ ఉపాధ్యక్షత గురించి తన అభిప్రాయాలను "ఎ నేషన్

ఇన్ మేకింగ్" అనే గ్రంథంలో ఇలా వ్రాశాడు:- కలకత్తా యూనివర్శిటీతో అతనిది సుదీర్ఘమైన పరిచయం. విద్యావిషయిక సమస్యల మీద అతనిది సువిశాలమైన అవగాహన. వాటిని పరిష్కరించడంలో అతని శక్తి అసాధారణం. ఇదే సర్ అశుతోష్‌ని యూనివర్శిటీలో ప్రముఖ వ్యక్తిని చేశాయి-అతను చాలా ఏళ్ళు ఈ యూనివర్శిటీకి వైస్ ఛాన్స్‌లర్‌గా వున్నారు-మహోత్కృష్టమైన పాలన అది. నిబంధనలు అమలు పరచడంలో ఎంతో వివేచన పాటించాడు. అన్ని రకాల వారి మీద (సమానమైన) శ్రద్ధ చూపించి బెంగాల్‌లో విద్యావంతులకి కొంత ఆందోళనా అనుమానం రగిలించేదు కూడాను."

మూడు టరమ్‌లు దాటి ఇంచుమించు నాలుగో టరమ్ మధ్య వరకూ కూడా, ఆలా భారత ప్రభుత్వపు నమ్మకాని చూరగొనడం వల్లనే ఒకానొక సందర్భంలో బెంగాల్ అస్సాంల లెఫ్టినెంట్ గవర్నర్ సర్ బామ్ పైఫుల్లర్ మీద అతను విజయం సాధించ గలిగాడు.,-

అది 1906. అంటే అశుతోష్ ముఖర్జీ కలకత్తా యూనివర్శిటీకి వైస్ ఛాన్స్‌లర్‌గా వున్న మొదటి సంవత్సరం. లార్డ్ కర్జన్ బెంగాల్ విభజన తలపెట్టాడు. దానికి వ్యతిరేకంగా ఆందోళన జరుగుతోంది. ముఖ్యంగా సిరాజ్‌గంజ్‌లో రెండు పాఠశాలల విద్యార్థులు నగరంలో చాలా విశృంఖలంగా ప్రవర్తిస్తున్నారు-ప్రయివేటు మేనేజిమెంటులో నడుస్తున్న ఈ స్కూళ్ళకి కలకత్తా యూనివర్శిటీలో గుర్తింపు ఉపసంహరించు కోవలసిందిగా బెంగాల్ అస్సాంల విద్యా శాఖల నుంచి ప్రతిపాదన వచ్చింది. బెంగాల్ ప్రభుత్వము ముఖ్య కార్యదర్శి కలకత్తా యూనివర్శిటీ రిజిస్ట్రారుకి ఆ విధంగా వ్రాశారు· ఛాన్స్‌లర్ మింటోగారికి ఈ ప్రతిపాదన లోని అనౌచిత్యాన్ని ఎత్తి చూపించి, ఈ విషయం పరిష్కారంలో యూనివర్శిటీకి ఏది సక్రమమని తోస్తుందో అలా చెయ్యడానికి అనుమతి కోరాడు అశుతోష్ ముఖర్జీ. లార్డ్ మింటో దీనికి అంగీకరించాడు. దాని మీద భారత ప్రభుత్వం బెంగాల్ అస్సాంల లెఫ్టినెంట్ గవర్నర్ సర్ బామ్-ఫైల్డిఫుల్లర్‌కి; ఈ పరిస్థితిలో ఆ స్కూళ్ళకి గుర్తింపును

---

* 'ఎ నేషన్ ఇన్ మేకింగ్' — ఎస్.ఎన్. బెనర్జీ

ఉపసంహరించుకోవడం రాజనీతికి విరుద్ధంగా ఉండగలదని వ్రాసింది-బామ్‌ఫైల్డ్ గారికి ఇది అంగీకారం కాలేదు. ప్రభుత్వం కోరినట్టు చేస్తారా నా రాజీనామా అంగీకరిస్తారా అన్నాడు.మింటో అతని రాజీనామాను సంతోషంగా అంగీకరించాడు. అవిధంగా యూనివర్శిటీ స్కూళ్ళమీద ఆధిపత్యాన్ని నిలబెట్టుకో గలిగింది-1908 మార్చి 31తో అశుతోష్ ముఖర్జీకి కలకత్తా యూనివర్శిటీ ఉపాధ్యక్షత్వపు మొదటి టరమ్ ముగియవలసివుంది- కాని; రాబోయే నెలల్లో యూనివర్శిటీకి గొప్ప కార్యభారం వుండి పోయింది. అనుబంధ కళాశాల లున్నాయి. గుర్తింపు పొందిన స్కూళ్ళున్నాయి. వీటిలో అధ్యాపక బృందం వున్నారు- గ్రంథాలయ ప్రయోగశాలల ఉద్యోగు లున్నారు-పరీక్షలున్నాయి ఇవి కాక బోలెడు ఇతర బాధ్యతలున్నాయి. పోనీ ఇంకొక రెవరైనా ఇవన్నీ యింత సమర్థవంతంగా నిర్వహించగల వారున్నారా అంటే లేరు. అందుచేత; అశుతోష్ ముఖర్జీనే మళ్ళీ వైస్‌ఛాన్సెలర్‌గా నియమించడం తప్పనిసరి అని ప్రభుత్వాన్నికి అనిపించింది అవతల హైకోర్టు న్యాయమూర్తిగా అతని విధులు, ఇక్కడ యూనివర్శిటీలో ఈ కార్యభారం కలిపి అతనికి మరీ తడిపి మోపెడై పోతాయని కూడా ప్రభుత్వం తలపోసి, అతనికి హైకోర్టు పని నుంచి 1908 జనవరి 1వ తేదీ నుంచి అగస్టు 31 వరకు ఎనిమిది నెలలు సెలవు యిచ్చి డెప్యుటేషను మీద యూనివర్శిటీ పనికి నియమించింది. "డాక్టర్ ముఖర్జీ తీవ్రంగా అస్వస్థులు కావడానికి పని వొత్తిడే కారణమని వైద్య సలహాదారులు నిర్ణయించారు. అందుచేత అటు హైకోర్టులో పని ఇటు వైస్‌ఛాన్సెలర్ బాధ్యతలు రెండు చేపట్టడం అతనికి మిక్కిలి హానికరం కాగలవు*" అని ఈ సందర్భంగా లెఫ్టినెంట్ గవర్నర్ ఫ్రేజర్ వ్రాశాడు.

తరువాత కొద్ది సంవత్సరాలూ అశుతోష్ ముఖర్జీ సారథ్యంలో కలకత్తా యూనివర్శిటీ బోధన, పరిశోధనల విషయంలో పరిపూర్ణతను సాధించిన విశ్వవిద్యాలయంగా పెద్దపెద్ద అంగలు వేసింది. యూనివర్శిటీకి అప్పట్లో, పట్టభద్రోపరి తరగతులకు తగిన వసతి, గ్రంథాలయాలు ముఖ్య అవసరంగా వుండేవి ఉన్నది ఒకే ఒక్క భవనం. అది యూనివర్శిటీ

*అశుతోష్ ముఖర్జీ జీవితచరిత్ర - ఎన్.కె. సిన్హా - పుట. 74

సెనేటు భవనం. అందులో పాలనా కార్యాలయాలకి బొటాబొటీగా సరిపోయే వసతి మాత్రం వుంది. యూనివర్శిటీ ఇంతకు ముందు లాగా కేవలం పరీక్షా నిర్వహణ పీఠం కాదాయెను. కొత్తగా వచ్చిన బోధనా, పరిశోధనా ధర్మాల నిర్వహణకి తగిన వసతి అత్యవసరం. ఈ అవసరాల నిమిత్తం అశుతోష్, దేశంలో అతి ధనికులైన ఇద్దరు దాతల ఔదార్యాన్ని సంపాదించాడు. ఒకరు దర్భాంగా మహారాజు, మరొకరు సర్ గురు ప్రసన్నఘోష్. ఇద్దరూ చెరో రెండున్నర లక్షలు విరాళంగా యిచ్చారు. ఇందులో రెండోది భారతీయ విద్యార్థులను యూరప్, అమెరికా, జపాన్‌లకు ఆయా దేశాల్లో కళల్లో, పరిశ్రమల్లో శిక్షణ నిమిత్తం పంపడానికి. దర్భాంగా మహారాజు విరాళానికి ప్రభుత్వం రెండు లక్షలు చేర్చగా యూనివర్శిటీ తనో రెండులక్షలు వేసింది - ఈ డబ్బుతో సెనేటు మందిరానికి పడమటగా వున్న "బస్తీ" దఖలు పడి, నాలుగంతస్తుల "దర్భాంగా భవనం" లేచింది- ఈ కొత్త భవనంలో యూనివర్శిటీ పాలనా కార్యాలయం, గ్రంథాలయం, లా కాలేజితో కలుపుకుని పట్టభద్రోపరి తరగతులకు వసతి సమకూరింది. సెనేటు మందిరానికి దక్షిణంగా ఒకటిన్నర బిఘాల స్థలంలో ఒక బజారు ఉండేది. నిలవ ధనం లోంచి లక్షా యాభై వేలు ఖర్చుపెట్టి యూనివర్సిటీ ఆ స్థలం కూడ కొనేసింది. (తరువాత ఈ స్థలంమీదే ప్రస్తుతం ఆర్ట్స్, కామర్సుల్లో పోస్టు గ్రాడ్యుయేట్ తరగతులున్న "అశుతోష్ భవనం" లేచింది.) అంతకు ముందు కొలూ తలవీధిలో ఒక అద్దె యింట్లో వుండిన కలకత్తా యూనివర్సిటీ ప్రెస్సుకు కూడా స్వంత భవనానికి 1908లో పునాది రాయి పడింది.

1909లో యూనివర్శిటీ లా కాలేజి వ్యవస్థాపన అశుతోష్ ఘనకార్యాలలో ఒకటి. అంతకుముందు న్యాయశాస్త్ర బోధన అనుబంధ కళాశాలల్లో జరిగేది. 1908 నాటికి న్యాయశాస్త్రం అనుబంధిత మైనవి. 18 కాలేజీ లయ్యాయి. విశ్వవిద్యాలయపు కొత్త నిబంధనల ననుసరించి వీటిలో వుండవలసినంత మంది అధ్యాపకులు లేరు. పైగా వీటిలో న్యాయశాస్త్రి గ్రంథాలయాలు అసలు లేనట్టే లెక్క.

విశ్వవిద్యాలయపు కొత్త నిబంధనల ననుసరించి వున్న యీ లోటును అవసమర్థతను గ్రహించి ప్రభుత్వం తమ కళాశాల లన్నిటిలో 'లా' తర

గతులను మూసి వేయడానికి సంకల్పించింది. ప్రయివేటు కాలేజీలు కూడా అరేపని చేశాయి. (ఒక్క రిప్పన్ కాలేజి తప్ప). 1908 జూలైలో యూనివర్శిటీలో ఒక లాకాలేజి స్థాపించాలని అశుతోష్ సెనేట్‌లో పెట్టేసరికి అది ఏకగ్రీవ ఆమోదం పొందింది: 1909 జూలై నుంచే లాకాలేజీ పని చెయ్యడం ప్రారంభించింది. భారత ప్రభుత్వం బెంగాల్ ప్రభుత్వం కూడా లాకాలేజి నిర్వహణకి సాంవత్సరిక గ్రాంట్లను మంజూరు చేశాయి. ప్రయివేటు వనరులు కూడా ఇతోధికంగానే సమకూరాయి. కసింబజారు మహారాజు, పోటీ పరీక్షల్లో ప్రతిభచూపే 'లా' విద్యార్థులకి కొన్ని ఉపకార వేతనాలను వ్యవస్థాపించమని యూనివర్శిటీ లాకాలేజికి యాభై వేలిచ్చాడు. మహారాజా ప్రద్యోత్ కుమార్ టాగూరు, లా లైబ్రరీ సంపాదన నిమిత్తం పదివేలు ఇవ్వడమే కాక, తనచిన తాతగారైన ప్రసన్నకుమార్ టాగూర్ గారు విడిచి పెట్టిన అమూల్యమైన లా పుస్తకాల సంచయాన్ని బహూకరించాడు. 1912లో అనాధ నాధదేవ్ అనే ఆయన న్యాయశాస్త్రి పరిశోధనలో ఒక బహుమతి వ్యవస్థాపన నిమిత్తం పాతికవేలు ఇచ్చాడు. యూనివర్శిటీ లాకాలేజి దర్భాంగా లైబ్రరీ భవనాన్ని స్థావరం చేసుకుంది. కొత్త నిబంధనల ప్రకారం న్యాయశాస్త్రి విద్యార్థుల శిక్షణ కోసం కృతిమ కోర్టుల ఏర్పాటుంది - అశుతోష్ తరచు ఇక్కడ అధ్యక్షత వహించి, లా విద్యార్థుల ప్రయోజనం కోసరం లెక్చర్లు ఇస్తూ వుండేవాడు.

భవన నిర్మాణ కార్యక్రమాలు ప్రారంభం కావడానికిముందే యూనివర్శిటీలో ఉన్నత విద్యాబోధన సాగే ఏర్పాట్లు చేశాడు అశుతోష్. బోధన తలపెట్టిన అన్ని విషయాలకు చాలినన్ని నిధుల ఏర్పాటు సాధ్యం కాలేదు. అంచేత, యూనివర్శిటీ కళాశాలల్లోని అధ్యాపకులనే, ఈ విషయాల్లో ఉపన్యాసాల అవసరంమేరకి, పట్టభద్రోపరి తరగతుల్లోకూడా ప్రస్తుతానికి నియమించారు. కోశాంబి అనే మరాఠీ పండితుణ్ణి పాళీభాషా వాఙ్మయాల బోధనకి నియమించి భారతీయ విశ్వవిద్యాలయాల్లో తొలిసారిగా పాళీభాష బోధనను చేపట్టిన విశ్వవిద్యాలయం అయింది కలకత్తా యూనివర్శిటీ. వేదాధ్యయనంలో ఉన్నతబోధనకి ఆచార్య సత్యవ్రత సదుస్రామి నియమించబడ్డారు. అలాగే వేదాంత విద్యకి పాండేయ రామావతార శర్మ. విశిష్టులూ

విలక్షణులూ అయిన పట్టభద్రులు మాష్టర్ డిగ్రీకి వెళ్ళదలిస్తే, నెలకు 32రూ॥ చొప్పున రెండేళ్ళపాటు లభించే విధంగా 12 ఉపకార వేతనాలు ఏర్పాటయ్యాయి. పురాతన ప్రాచ్య దేశాలలో ఖగోళశాస్త్రం పైన డాక్టర్ థిబో లెక్చర్లు ఇచ్చారు. అలాగే అధునాతన భౌతికశాస్త్ర ప్రగతి పైన ప్రొ॥ స్క్రూశ్చర్. ఉన్నతవిద్యను అభిలషించే ఉన్నత స్థాయిగల విద్యార్థుల్లో ఈ ఉపన్యాసాలు గొప్ప ఉత్సుకతను రేకెత్తించాయి.

1908, కలకత్తా యూనివర్శిటీకి రజతోత్సవ వత్సరం. లార్డ్ మింటో సెనేట్ లో మాట్లాడుతూ, అర్థిక శాస్త్రంలో ఒక ఆచార్య స్థానాన్ని నెలకొల్పే నిమిత్తం భారతప్రభుత్వం పదివేల రూపాయల వార్షిక గ్రాంటును ఇస్తుందని ప్రకటించాడు. పంజాబ్ యూనివర్శిటీలోను, కేంబ్రిజ్ యూనివర్శిటీలోను ఘనత సాధించిన మనోహర్ లాల్ ని "మింటో ప్రొఫెసర్" లలో మొదటి వాడుగా అశుతోష్ నియమించాడు.

ప్రాచ్య పాశ్చాత్య దేశాల్లోని మహా మేధావుల గూర్చి తెలుసుకోవలసిందిగా అశుతోష్, యూనివర్శిటీ విద్యార్థులను కోరాడు. ఆవిధంగా, ప్రత్యేకమైన విషయాలపైన ఉపన్యాసాలివ్వడానికి ప్రత్యేకమైన యూనివర్శిటీ రీడర్లను నియమించే పద్ధతి ప్రారంభమై తరువాతి కాలంలో కూడా కొనసాగింది. భారతీయ భూగర్భశాస్త్రంపైన డాక్టర్ హాలండ్ ఉపన్యాసాలిచ్చాడు. అలాగే గణితాత్మక భౌతికశాస్త్రంపైన డాక్టర్ గిల్బర్టు; బెంగాలీ భాష, వాఙ్మయ - చరిత్రలపైన దినేశ్‌చంద్ర గుప్తా; పదహారవ శతాబ్దపు వంగదేశం గూర్చి ప్రొఫెసర్ జె.ఎన్.దాస్ గుప్తా.

ఆ రోజుల్లోనే డాక్టర్ కల్లిస్, కేంబ్రిజ్‌కి చెందిన డాక్టర్ ఫోర్‌సిత్, జపాన్‌కి చెందిన ప్రొఫెసర్ యమాకమీ, గోథింజెన్‌కి చెందిన హెర్మన్ ఓల్డెన్‌బర్గ్, హెర్మన్‌జాకొబి, పాల్‌వినగ్రాడఫ్‌లు ఇతర రీడర్‌షిప్ లెక్చర్లను ఇచ్చారు. ఇవన్నీ పరిశోధనలో గొప్ప అభిలాషను రేకెత్తించాయి. వీటికి అధ్యాపకులూ ఉన్నత విద్యాభిలాషులైన విద్యార్థులూ హాజరైనారు.

పరిశోధన మీది అభిరుచిని ప్రోత్సహించేటందుకు ప్రేమ్‌చంద్ రాయ్‌చంద్ విద్యార్థి వేతన ప్రధాన నియమావళిని సవరించడం జరిగింది -

మొదట్లో వ్రాత ఫలితాలనుబట్టి ఈ విద్యార్థి వేతన, ప్రదానం జరిగేది. క్రమంగా వ్రాత పరీక్ష మీద కొంత, పరిశోధనమీద కొంత ఆధారంగా యిచ్చేవారు. ఇప్పుడీ సవరణ జరిగాక అంతా పరిశోధన ఆధారంగానే ఈ విద్యార్థి వేతనాలను అభ్యర్థులకు ప్రదానం చేయసాగారు.

ప్రొఫెసర్ పిషెల్ జర్మన్ పండితుడు.అలాగే డా॥ ధియొడార్ బ్లాష్ ఈ ఇద్దరు విదేశీ పండితులచేత ప్రత్యేక విషయాలపైన ఉపన్యాసాలిప్పించ డానికి అశుతోష్ ప్రతిపాదించగా సెనేటు అంగీకరించింది - ప్రొఫెసర్ పిషెల్ ప్రాకృత భాషల శబ్దవ్యుత్పత్తి శాస్త్రంలోను, డా॥ బ్లాష్ పురాతన భారతీయ చరిత్రపైన ఉపన్యసించ వలసి వుండింది. కాని వారిద్దరూ ఆ ఉపన్యాసాలివ్వకుండానే చనిపోయారు. 1908లో స్వర్ణోత్సవం సందర్భంగా భౌతికశాస్త్రం, జీవశాస్త్రం, తత్వశాస్త్రం, చరిత్ర, శబ్దవ్యుత్పత్తి శాస్త్రం మొద లైన వాటిలో మౌలికమైన కృషి చేసేవారికి బహుమతులు నెలకొల్పబడ్డాయి. కలకత్తా విశ్వ విద్యాలయంలోని విద్యార్థులకీ, అధ్యాపకులకీ ప్రయోజనం చేకూరే విధంగా వారి వారి పరిశోధనా విషయాలమీద ఉపన్యాసా లివ్వడానికి ప్రపంచం నలుమూలలనుంచి పండితులను ఆహ్వానించడంలో పి హెచ్ డి. డిగ్రీని వ్యవస్థాపించడంలో అశుతోష్ ధ్యేయం నెరవేరి అనుబంధ కళాశాల ల్లోని ప్రముఖులైన అధ్యాపకులు వారివారి విషయాల్లో జ్ఞానాభివృద్ధికి తగి నంత కృషి చేసి దాని ఆధారంగా పిహెచ్.డి. పట్టాల్ని పొందారు. సతీష్ చంద్ర ఆచార్య, ప్రజేంద్రనాథ్ శీల్, హీరాలాల్ హాల్దార్. శ్యామదాస్ ముఖర్జీలు అలాంటి వాళ్ళలో ప్రథములు.

1912 జనవరిలో ఐదవ జార్జి రాజు తనకు సమర్పించబడిన స్వాగత పత్రానికి సమాధానం యిస్తూ ఇలా అన్నాడు-"సైన్సు, ఆర్ట్సు-వంటి ముఖ్యతర మైన శాఖల్లో అధ్యాపక స్తోమత లేకపోయినా. పరిశోధనకి చాలినంత అవకాశాన్ని ఏర్పాటు చెయ్యకపోయినా ఈ రోజుల్లో ఏ విశ్వవిద్యాలయం కూడా సమగ్రంకాదు-" ఈ మాటల్లోంచి ప్రోత్సాహాన్ని తెచ్చుకొని అశుతోష్ రెండు విశ్వవిద్యాలయ ఆచార్య పీఠాల వ్యవస్థాపన గురించి ప్రభుత్వానికి విజ్ఞప్తి చేశారు. చక్రవర్తి ఆగమన సందర్భంగా ఒకటి రీజియస్ ప్రొఫెసర్ షిప్ అనీ, రెండోది లార్డ్ హార్డింజి పేరిట వుండాలని కోరాడు. మొదటిది ప్రాచీన భారతీయ చరిత్ర కోసం; రెండోది ఉన్నత గణితశాస్త్రం కోస

మూనూ. ఇందులో ప్రాచీన భారతీయ చరిత్రకి సంబంధించిన ఆచార్య పీఠాన్ని ప్రభుత్వం మంజూరు చెయ్యలేదు. అందువల్ల విశ్వవిద్యాలయమే తనంతట తానుగా దీన్ని వ్యవస్థాపించింది. ఇందులో మొట్టమొదటి ప్రొఫెసర్ డాక్టర్ థిబా౽. అయితే ప్రభుత్వం రెండు ఆచార్య పీఠాలకు నిధులు అందజేసింది-గణితశాస్త్రంలో హార్డింజి పేరిట ఒకటి;తత్వశాస్త్రంలో ఐదవ జార్జిపేరిట ఒకటి. ఫ్రాన్సు దేశంలోని పొయిటార్స్ విశ్వవిద్యాలయానికి చెందిన ప్రొఫెసర్ ప్రెచెట్, హర్డింజి పేరిట నెలకొల్పిన గణిత శాస్త్రాచార్య పీఠానికి ప్రప్రథమంగా ఎన్నికయ్యాడు. అలాగే తత్వశాస్త్ర పీఠానికి బ్రజేంద్రనాథ్ శీల్.

(విశ్వవిద్యాలయానికి) అశుతోష్ చేసిన సేవలను గుర్తించి ప్రభుత్వం 1911 డిశంబర్‌లో ఢిల్లీ దర్బార్‌లో అతనికి 'సర్' బిరుదాన్ని ప్రదానం చేసింది. 1912 స్నాతకోత్సవ ఉపన్యాసంలో లార్డ్ హార్డింజి, విశ్వవిద్యాలయానికి అశుతోష్ అందించిన సమర్థవంతమైన సారథ్యాన్ని ప్రశంసించి "కలకత్తా విశ్వవిద్యాలయం చట్టం నిర్దేశించిన మార్గంలో, ఇతని సారథ్యంలో గణనీయమైన ప్రగతిని సాధించిం"దని ఉద్ఘాటించాడు.

1904 వ సంవత్సరపు చట్టాన్ని అమలు పరచడంలో అప్పటికి ప్రభుత్వం అశుతోష్‌కు సహకరించ సాగింది. అతను వరుసగా నాలుగో సారికూడా వైస్ ఛాన్సెలర్‌గా నియమించ బడ్డాడు. కలకత్తా విశ్వవిద్యాలయాన్ని బోధనా పరిశోధనల విశ్వవిద్యాలయంగా రూపొందించడానికి ఛాన్సెలర్ కూడా సుముఖంగా వున్నాడని లార్డుహార్డింజి చెప్పిన ఈ మాటలను బట్టి స్పష్టమైంది;- మాస్టర్ డిగ్రీపై ఆసక్తి వున్న ఇంతమంది విద్యార్థులను అందుకు తగిన వసతి కల్పించలేని కారణంగా తిరస్కరిస్తున్నాం కనక; ఉన్నత విద్యకిగల అవకాశాలు చాలినన్ని లేవనే నేను అనుకుంటున్నాను. మన విద్యార్థులకి ఉన్నత విద్య అభ్యసించే శక్తి వున్నదనడంలో నాకెలాంటి సందేహంలేదు. ఈమధ్య గణితశాస్త్రం రసాయనశాస్త్రం భారతీయ పౌరాతన్యం- ఈ మూడింటిలో వచ్చిన పరిశోధనా వ్యాసాలకి మూడు "ప్రేమ్‌చంద్ విద్యార్థి వేతనాలు" ప్రదానం చేశారనీ, ఈ మూడూ ప్రత్యేక యోగ్యతలు కలవి అనీ పరీక్షాధి కారులే అన్నారుట. కోట్సస్మృతి చిహ్నంగా నెలకొల్పబడిన బహుమతి అయితేనేం, దర్భాంగా స్మారక విద్యార్థి

వేతనమైతేనేం, ఇక్కడ వైద్య విద్యారంగంలో పరిశోధన చేయడానికి అభిలాష, శక్తి కలిగిన వాళ్ళున్నారని సూచిస్తున్నాయి కదా. అదలావుంచి గ్రిఫిత్ స్మారక బహుమతి కోసం అధిక సంఖ్యలో వ్యాసాలు రావడాన్ని బట్టి మన పట్టభద్రుల్లో చాలామంది ఉన్నత విద్య, పరిశోధన చేపట్టారన్నది రుజువైంది కదా. అంచేత మనం హెచ్చు సంఖ్యలో ఎమ్. ఏలకు శిక్షణ యివ్వాలన్నది ముఖ్యమైన విషయం. లేకపోతే మన కాలేజీలకి సమర్థులైన అధ్యాపకులుగాను, పరిశోధకులుగాను నియమించు కోవడానికి చాలినంత మంది లభించడం కష్టం." విశ్వ విద్యాలయంలో అధ్యాపకుల, ఆచార్యుల నియామకానికి ఏడాదికి అరవై అయిదువేల చొప్పున గ్రాంటును ప్రభుత్వం మంజూరు చేసినట్టు ఛాన్సెలర్ ప్రకటించారు. విశ్వవిద్యాలయానికి భవనాలు, గ్రంథాలయాలు, పరికరాలు ఏర్పాటు చేసుకోవడానికి నాలుగు లక్షల మేరకు వాగ్దానం వచ్చింది. కలకత్తాలో విద్యార్థి వసతి గృహాలకోసం పదిలక్షల ప్రత్యేక గ్రాంటు రావలసి వుంది. అరవై అయిదువేల రూపాయల గ్రాంటులోంచి (హార్డింజి) గణితశాస్త్ర ఆచార్యులకు, (ఐదవ జార్జి) తత్వశాస్త్ర ఆచార్యులకు వేతనాలను సమకూర్చి విశ్వవిద్యాలయ లాకాలేజికి గ్రంథాలయానికి కొంత సొమ్ము కేటాయించడానికి నిర్ణయమైంది. నాలుగు లక్షల మేరకున్న కేపిటల్ గ్రాంటులోంచి, విశ్వవిద్యాలయ లాకాలేజికి అనుబంధితం కావలసిన విద్యార్థివసతి గృహానికి మూడులక్షలు వెచ్చించి, దానికి హార్డింజి హాస్టల్ అని పేరు పెట్టారు. మిగతా లక్ష రూపాయలు విశ్వవిద్యాలయ గ్రంథాలయానికి పుస్తకాలూ సరంజామా సమకూర్చే నిమిత్తం వినియోగించారు.

హ్యుమానిటీస్ శాఖలో పట్టభద్రోపరి తరగతుల శిక్షణా, పరిశోధనల అభివృద్ధి విషయంలో అశుతోష్ కొంత ప్రగతిని సాధించాడు. అయితే సైన్సు టెక్నాలజీ శాఖల వ్యవస్థాపనకి నిధులు అప్పటికి ఇంకా సంపాదించలేకపోయాడు, వీటికి వసతి లేదు; పరిశోధనశాలలు లేవు. అంచేత విశ్వవిద్యాలయ సైన్సు టెక్నాలజీ కాలేజీల వ్యవస్థాపన అసాధ్యంగా తోచింది. అయితే, బెంగాల్‌లోని ఇద్దరు ప్రముఖ న్యాయవాదుల నుంచి అశుతోష్ సేకరించ గలిగిన భూరివిరాళాలవల్ల ఇదీ త్వరలోనే సాధ్యమైంది - తారక నాథ్ పాలిత్ అనే ప్రఖ్యాత న్యాయవాది; రసాయన భౌతిక శాస్త్రాల్లో ఒక్కొక్క ఆచార్య పదవినిర్వహణకు ఆదాయాన్నిచ్చే విధంగా నాలుగున్నర లక్షలు నగదు

రూపంగాను, రెండున్నర లక్షలు స్థిరాస్తి రూపంలోను మొత్తం ఏడు లక్షల రూపాయల ఆయివేజును జూన్ 1912లో విశ్వవిద్యాలయానికి వప్పగించాడు. రసాయన శాస్త్ర ఆచార్యపదవికి పి. సి. రేని, భౌతిక శాస్త్ర ఆచార్య పదవికి సి. వి. రామన్‌ని అశుతోష్ ఎన్నిక చేశాడు. సి. వి రామన్ ఇండియన్ ఆడిట్ అండ్ అక్కౌంట్స్ సర్వీసులో ఉద్యోగంలో వుంటూ, తీరిక వేళల్లో ఇండియన్ అసోసియేషన్ ఫర్ కల్టివేషన్ ఆఫ్ సైన్సు అనే సంస్థలో పరిశోధన కొనసాగించే వాడు. పి. సి. రే అప్పటికే సుప్రసిద్ధ శాస్త్రజ్ఞుడు. కలకత్తాలో రసాయన శాస్త్ర అధ్యయనానికి ఒక విద్యాలయాన్ని స్థాపించాడు. అంతర్జాతీయ ఖ్యాతిని సంపాదించుకున్న జె. ఎన్. ముఖర్జీ, జె. సి. ఘోష్ వంటివారు ఆ విద్యాలయంలో చదువుకున్నారు సి. వి. రామన్ అలా పరిశోధన సాగిస్తూనే, భౌతిక శాస్త్రంలో నోబుల్ బహుమానాన్ని సాధించుకున్నాడు. 1912 అక్టోబరులో తారకనాథ్ పాలిత్, విశ్వవిద్యాలయానికి రెండో సారి భూరివిరాళంగా సైన్సు టెక్నాలజీల అభివృద్ధికోసం తన నివాస గృహంతో సహా, మొత్తం ఏడున్నర లక్షలిచ్చాడు. విదేశాల్లో శాస్త్ర పరిశోధన చేసే పురోగామి విద్యార్థులకు ఉపకార వేతనాల ఏర్పాటు కోసం, విశ్వవిద్యాలయం ఇందులో ఒక లక్ష కేటాయించ వలసివుంది. సైన్సు టెక్నాలజీ కాలేజీల వ్యవస్థాపన అనే తన అద్భుత ప్రణాళికకు రెండో మహాదాత మరెవరో కాదు, అశుతోష్‌కి ఒకప్పటి గురువుగారే అయిన రాస్‌బిహారి ఘోష్, 1930 అగష్టులో ఈ మహాదాత అశుతోష్‌కి ఇలా వ్రాశాడు:- "నువ్వు సెనేటు అనుమతితో రూపొందించిన విశ్వవిద్యాలయ సైన్సుకాలేజి అభివృద్ధి కోసం, విశ్వవిద్యాలయానికి నేను పది లక్ష లిద్దామని ఇప్పుడు నిర్ణయించాను: దీంట్లో అనువర్తన గణిత శాస్త్రం, భౌతిక శాస్త్రం, రసాయన శాస్త్రం, వ్యవసాయానికి ప్రత్యేక అన్వయం కలిగిన వృక్షశాస్త్రం- ఈ విషయాల్లో తలా ఒకటి చొప్పున మొత్తం నాలుగు ఆచార్య పదవులు రావాలి. అదికాక, ఈ నిధి నుంచి వచ్చే ఆదాయంలోంచి ఏడాదికి తొమ్మిది వందల రూపాయల చొప్పున ఎనిమిది విద్యార్థి వేతనాల ఏర్పాటు జరగాలి. ఈ ఎనిమిమంది పరిశోధక విద్యార్థులు ఇద్దరేసి చొప్పన ఆ నలుగురు ఆచార్యుల మార్గ దర్శకత్వంలో పరిశోధన కొనసాగించాలి." అలా నియమించబడ్డ ఆచార్యుల్లో ప్రథములు:- అనువర్తన గణిత శాస్త్రంలో డాక్టర్ గణేశ్ ప్రసాద్, రసాయన శాస్త్రంలో

డాక్టర్. పి. సి. మిత్రా, భౌతిక శాస్త్రంలో డాక్టర్ డి. ఎం. బోస్, వృక్ష శాస్త్రంలో డాక్టర్ ఎస్. సి. అగర్కార్.

ఇప్పటికి నియమించ బడిన మొత్తం పదిమంది ఆచార్యులలో అయిదు గురు బెంగాలీయేతరులుండడం గమనార్హం, అశుతోష్ సారధ్యంలో కలకత్తా విశ్వ విద్యాలయం ఒకానొక సర్వసమ భావాన్ని సమకూర్చుకున్నది.

వ్యక్తులనుంచి ఎంత ఘనమైన విరాళాలు చేకూరి నప్పటికీ, వాటికి అనుబంధంగా ప్రభుత్వం నుంచికూడా తగిన రీతిలో నిధులను అశుతోష్ సహజంగానే ఆశించాడు. ఆవిధంగా, 1923 అక్టోబర్‌లో కలకత్తా విశ్వ విద్యాలయం ప్రభుత్వాన్ని అదనపు వార్షిక గ్రాంటు నిమ్మని కోరింది దానికి ప్రభుత్వం, నిధులు (సమృద్ధిగా) వున్నప్పుడు ఈ అభ్యర్ధనను మిగిలిన వాటితోబాటు పరిశీలించడం జరుగుతుందని సమాధానం యిచ్చింది. కాని యూనివర్శిటి సైన్సు కాలేజి అలా నిరీక్షణలో ఆగిపోకూడదుకదా. అంచేత, అశుతోష్ వైస్ ఛాన్సెలర్‌గా తన నాలుగో టరమ్ ఇంక నాలుగు రోజుల్లో కడతేరిపోతుందనగా అంటే 1914మార్చి 27న, (సైన్సుకాలేజి) భవనానికి శంకుస్థాపన చేసేశాడు.(ఈ ఖర్చును పంచయ నిధుల్లోంచి సమకూర్చుకొంటూ భవన నిర్మాణాన్ని కొన సాగించింది విశ్వ విద్యాలయం.) ఆ సందర్భంగా ప్రసంగిస్తూ, పాలిత్, ఘోష్ మహాశయుల ఔదార్యానికి తనూ కొంత గ్రాంటిచ్చి తోడుపడడానికి భారత ప్రభుత్వం ఇష్టపడలేదే అని విచారాన్ని వ్యక్తం చేసి, అలాంటి పరిస్థితుల్లో ప్రయోగ శాలల గురించి, సాధనాలను గురించి మొదట్లో వేసుకున్న ప్రణాళికలను కొంతవరకు తగ్గించుకోక తప్పలేదని అన్నాడు అశుతోష్.

"ఈ నిగర్వమైన ప్రారంభానికి తప్పనిసరిగా అంగీకరిస్తున్నాం గాని మన ఆశయాలు దృఢమైనవే. క్రమంగా ఇది విస్తరిల్లాలి. దృఢంగా జీవం పోసుకుని పెరగాలి. మన కార్యకలాపాలు అవిచ్ఛిన్నంగా సాగాలి. ఎందుకంటే మనం తలపెట్టింది గొప్పపని గనుక. సైన్సు అనేది తన అంతిమ స్థిరవచనంలో జీవద్భగవానుని వాణికి ప్రతిధ్వనే అవుతుందన్న దృఢమైన విశ్వాసమే మన ఆవేశం కనక. విశ్వవిద్యాలయం నిధులను కోరుతూ చేసిన అభ్యర్ధన భారత ప్రభుత్వపు నిరాకరణకి గురికావడం అశుతోష్ పైన, అతని ప్రియమైన విశ్వవిద్యాలయంపైన, ప్రభుత్వ విద్యా శాఖ సరికొత్తగా పెంపొందించుకుంటున్న విరుద్ధ భావానికి ఒక ఉదాహరణ.

ఆ తరువాత విశ్వ విద్యాలయం జాతకమంతా సంకుచిత హృదయు లైన నిబంధనా సిద్ధాంతుల చేతుల్లోపడి పోయింది. హెన్రీ షార్ప్ భారత ప్రభుత్వంలో విద్యాశాఖకు జాయింట్ సెక్రటరీ అయ్యాడు. అతను ఒకప్పుడు తూర్పు బెంగాల్-అస్సాం రాష్ట్రంలో స్కూళ్ళ ఇన్‌స్పెక్టరు క్రమంగా ఆరాష్ట్రంలోనే డైరెక్టరాఫ్ పబ్లిక్ ఇన్‌స్ట్రక్షన్ అయ్యాడు ఒకప్పుడు తన అధికారి బాంప్ ఫైర్డిపుల్లర్ అశుతోష్ వల్ల పొందిన సంకట పరిస్థితిని అతను మరిచిపోలేదు. దానికిప్పుడు ప్రతీకారంగా అశుతోష్‌నీ, అతని (ప్రియతమ) విశ్వవిద్యాలయాన్నీ ఏడిపించడానికి దొరికిన ప్రతీ అవకాశాన్నీ ఉపయోగించుకో సాగాడు. మొట్టమొదటి సారిగా 1913 మేలో షార్ప్ విశ్వ విద్యాలయాన్ని కాటువేశాడు. ఎ. రసూల్, అబ్దుల్లా సుహ్రవర్దీ, కె. పి. జేస్వాల్‌లను అధ్యాపకులుగా రెండేళ్ళ కాలానికి నియమించిన విషయం విశ్వవిద్యాలయం ప్రభుత్వానికి తెలియపరచింది. షార్ప్ ఈ నియామకానికి వ్యతిరేకంగా ఒక గట్టి వ్యాఖ్యానం వ్రాశాడు. వాళ్ళు రాజకీయ ఉద్యమాల్లో పాల్గొన్నారన్న ఆరోపణ కారణంగా షార్ప్ ఈ అభ్యంతరం తెలిపాడు. షార్ప్ వ్రాసినది వైస్రాయి కౌన్సిల్ మీద పని చేసింది. ఆ ఉద్యోగాలకు ఆమోదం రాలేదు. ఈ ఉద్యోగాల్లో వాళ్ళని నియమించడం కేవలం వారి విద్యా విషయిక అర్హతలను బట్టి, విశ్వవిద్యాలయపు అవసరాల్ని బట్టి జరిగిందని, రాజకీయ ఉద్యమాల్లో పాల్గొన్న వ్యక్తుల్ని అధ్యాపకులుగా నియమించ రాదన్న నిబంధన ప్రభుత్వం అంతకుముందెన్నడూ విధించలేదని అశుతోష్ నచ్చ జెప్పాడు. కానీ ఫలితం లేకపోయింది. నిర్ణయాన్ని పునః పరిశీలించ వలసిందిగా సిండికేటు తీర్మానం చేసి ప్రభుత్వాన్ని అభ్యర్థించినా ప్రయోజనం శూన్యం. అశుతోష్ పెడసరం మనిషనీ, గర్వపోతనీ, విశ్వ విద్యాలయం ఆశ్చర్యకరమైనంత అవిశ్వాసాన్ని ప్రదర్శించిందనీ చెప్పి షార్ప్ తనపై అధికారులను నమ్మించాడు. అశుతోష్ వైస్‌ఛాన్సెలర్‌గా అయిదో టరమ్‌కి నియమించబడడు అనేవిషయం తెలుస్తూనేవుంది. చెప్పినట్లల్లా వినే వైస్‌ఛాన్సెలర్ దొరికితే నెలనెలా జీతం యిచ్చి అయినా పెట్టుకోవడానికి కూడా ప్రభుత్వం యోచించింది.*

---

*అశుతోష్‌ముఖర్జీ జీవితచరిత్ర (ఎన్. కె. సిన్హా) 102,103 పుటలు

తన మీద జరిగిన బాంబు దాడి వల్ల కలిగిన ప్రభావం నుంచి బయట పడినందుకు ఛాన్సెలర్ లార్డ్ హార్డింజికి హృదయ పూర్వక సంతృప్తిని తెలియజేయడానికి సెనేటు సభ్యులంతా 1913 డిసెంబరులో ఒక ప్రత్యేక స్నాతకోత్సవంలో కలుసుకున్నారు. అప్పటి ప్రసంగం సందర్భంగా, ఈ నవీన విశ్వవిద్యాలయ నిర్మాణానికి భారత ప్రభుత్వ సహకార ఆవశ్యకతను ప్రాముఖ్యాన్ని సెనేటర్లు నొక్కి చెప్పారు. దానికి సమాధానంగా లార్డ్ హార్డింజి విశ్వవిద్యాలయపు ఆదర్శాలకీ ఆశయాలకీ ప్రభుత్వం సానుభూతి పరంగా లేదని తాను అనుకోవడం లేదంటూ, అప్పటికే విశ్వవిద్యాలయం ప్రభుత్వం నుంచి పొందిన ఆర్థిక సహాయ పరిణామాన్ని పేర్కొన్నాడు. అయితే విశ్వవిద్యాలయానికి ఇటుపైన కావలసిన ఆర్థిక సహాయం గురించి మాత్రం ఆతను ఏవిధమైన మాటా ఇవ్వలేదు. ఈ స్నాతకోత్సవంలో ప్రొఫెసర్ వినోగ్రదోల్ఫ్, ప్రొఫెసర్ జాకొబి, ప్రొఫెసర్ యంగ్, డాక్టర్ రాసవిహారిఘోష్, రవీంద్రనాథ్‌టాగూర్, మిస్టర్ హేడెన్, ప్రొఫెసర్ సిల్వేన్ లెవీ-లకు గౌరవ డాక్టరేట్ పట్టాల ప్రదానం జరిగింది.

వైస్‌ఛాన్సెలర్‌గా అశుతోష్ నాలుగవ టరమ్ 1914 మార్చి 31కి ముగిసింది. దేవప్రసాద్ సర్వాధికారి వైస్‌ఛాన్సెలర్‌గా నియమితుడయ్యాడు. ఇతడు సిండికేటు సభ్యుడు. బెంగాల్ శాసన మండలిలో విశ్వవిద్యాలయం ప్రతినిధి.

ఆ ఏడాదే సెనేట్ సభ్యుడుగా అశుతోష్ టరమ్ కూడా ముగిసింది. అప్పటికి పాతికేళ్ళుగా అశుతోష్, సెనేట్‌కి నామినేటెడ్ సభ్యుడు. ఇప్పుడు (జీవితంలో) తొలిసారిగా రిజిస్టర్డు గ్రాడ్యుయేట్లు వోట్లతో తిరిగి సెనేట్ సభ్యుడుగా ఎన్నికై వచ్చాడు. రిజిస్టర్డ్ గ్రాడ్యుయేట్లు, విశ్వవిద్యాలయానికి అశుతోష్‌ది నిలువెత్తు తైలవర్ణచిత్రం బహూకరించారు. లాకాలేజీ ప్రిన్సిపాలు, విద్యార్థులు, ప్రొఫెసర్లు కలిసి, అశుతోష్‌ది పాలరాతి బస్ట్ బహూకరించారు. విశ్వవిద్యాలయ రెక్టార్ లార్డ్ కార్మైకేల్ ఆవిష్కరించిన ఈ బస్ట్ జ్ఞాన సత్యాన్వేషులైన యావత్ప్రపంచ పండితులకు స్వాగతం చెబుతున్నదా అన్నట్టు దీర్ఘంగా భవనపు మెట్లమీద చివర్న నిలిచివుంది. అంతకుముందు, సెనేటు అశుతోష్‌కి "డాక్టర్ ఆఫ్ సైన్స్" గౌరవ పట్టా ప్రదానం చేసింది.

ఆ సంవత్సరాల్లో విశ్వ విద్యాలయంలోని వివిధ పరిషత్తుల కార్య కలాపాలకవిలె కట్టలను తిరగేసి చూసే శ్రమ చేస్తే తప్ప, వైస్ ఛాన్సలర్‌గా ఆ విశ్వ విద్యాలయపు రూపురేఖలు సరిదిద్దడానికి అశుతోష్ ఎంత బ్రహ్మాండ మైన శ్రమ చేశాడో అర్థంకాదు. అటు హైకోర్టులో న్యాయమూర్తిగా ఎంతో కష్టతరమైన పనిచేస్తూ, ఇటు విశ్వవిద్యాలయంలో తన విధులను నిర్వర్తించాడంటే; కష్టపడి పనిచెయ్యడానికి అతనికి వున్న శక్తిపట్ల ఆశ్చర్యం కలుగుతుంది. 1914 మార్చి 28న విశ్వవిద్యాలయ స్నాతకోత్సవంలో మాట్లాడుతూ, అశుతోష్ ఇలా చెప్పాడు: "గడచిన ఎనిమిదేళ్ళు అక్షరాలా కష్టకాలం అని చెప్పాలి. కష్టం అంటే సామాన్యమైన కష్టం కాదు. విష పూరితమైన కోరలతో ఏరుటుకు పడే జల సర్పపు తలల్లాంటి అరదులూ అవ రోధాలూ, కలిగాయి, తగిలాయి. న్యాయమూర్తిగా తప్పనిసరిగా నిర్వహించ వలసిన, నా బాధ్యతలు నాకు విడిచి పెట్టిన ప్రతిగంట, ప్రతినిముషం కూడా ఇన్నేళ్ళూ నేను విశ్వవిద్యాలయం పనికి వినియోగించాను. విశ్వ విద్యాలయ సామర్థ్యాన్ని ఉన్నతం చేయగల ప్రణాళికలు పథకాలూ నా పగటి కలలు. వాటిలో 'కూరుకు' పోవడం ఎంతటి కార్యభారవాహికైనా తప్పదు. అయితే అవి నన్ను ఏ రాత్రి నిద్రపోనివ్వక వేధిస్తూనే వచ్చాయి. విశ్వవిద్యాలయం క్షేమం కోసం నేను నా చదువూ పరిశోధనా మానుకున్నాను. కొంతవరకు కుటుంబ క్షేమాన్ని స్నేహ మాధుర్యాన్ని త్యజించాను. అంతకు మించి, నా ఆరోగ్యాన్ని శక్తిని చెప్పకోదగ్గ మేరకు నష్టపోయాను. చేసిన త్యాగాల వల్ల బాధకలిగి కృంగి కృశిస్తున్నా ననుకోకండి. వాటికి నాకు రావలసిన ప్రతిఫలం రకరకాలుగా వచ్చేసింది".

"మన ఆశయం ఉన్నతమనీ పవిత్రమనీ; ఆ ఆశయ సాధన కోసం మన యావచ్ఛక్తినీ ధారపోసి జీవితంలోని సాధారణ సౌఖ్యాలను సైతం వదులుకోవి; మనల్ని మనం పూర్తిగా అర్పణ చేసుకొంటున్నామనీ స్పృహ కలిగినప్పుడు; అందులోని నమ్మకం చేత మనకెంతో హాయి కలుగుతుందని నేను మీకు గుర్తు చెయ్యక్కర్లేదు ........" ఈ ప్రసంగాన్ని అశుతోష్, మనస్సును కదిలించే కొన్ని మాటలు చెప్పి ముగించాడు: "ఎంత చెప్పినా ఎంత చేసినా, నా అంతరాల్లో ఒక ప్రగాఢమైన విశ్వాసం మిగిలింది. ఇన్నే ళ్ళుగా నన్నూ నా సహచరులనూ పోరాటానికి ప్రేరేపించి దుర్గమం అంధ

కారం అయిన మార్గంలోకి పురిగొల్పిన ఆ కాంతిపుంజం— ఏదో మఖలో పుట్టి పుబ్బలో మాడిపోయే మిణుగురు పురుగు కాదు— అది చిరస్థాయిగా వెలుగులను చిమ్మే చైతన్య జ్వాల. అది కాస్త దూరంగానే ఉండి వుండవచ్చు. కాని అది సత్యానికి నిలయం; ఆశయానికి ఆలయం. మన దేశవాసులలోని ఉత్తములు మనకు అండగా వున్నారు. ఉన్నత విద్యాభ్యాసానికి మనం నూతనంగా కల్పించిన అవకాశాలను యువతరం పెల్లుబికే ఉత్సాహంతో వినియోగించుకుంది. ఇక్కడ మనం ఒక అగ్నిని రాజబెట్టాం. ఇది ఆరేదికాదు. దీనిలోంచి అగ్నికణాలు దేశం అంతటికీ ఎగిరి వెళ్ళాయి. ఆ రీతిగా, మనం చొరవతో ప్రవేశపెట్టిన విషయాలను విద్యావిధానాలను ఇతర విశ్వ విద్యాలయాలు కూడా అనుసరిస్తున్నాయి ఒక కొత్త చైతన్యం జాగరితమైంది. ఆ చైతన్యం నుంచి ఉత్సాహమూ నమ్మకమూ పొంది ప్రగతి పతాకను చేతపట్టి మనం ధైర్యంగా జాగ్రత్తగా ముందడుగు వేయాలి. ........ ఇన్నేళ్లు ఈ బరువు బాధ్యతలను మోశాక; నాకు ఎన్నో బలమైన కారణాలవల్ల ప్రియతమమైన ఈ కార్యభారం నుంచి వైదొలగుతున్న ఈ తరుణంలో ఈ నమ్మకయే నాకు హాయినిచ్చే భావం."

ఈ స్నాతకోత్సవానికి ఛాన్సలర్ రాలేదు. యూనివర్శిటీకి సర్ అశుతోష్ ముఖర్జీ చేసిన ఉత్తమ సేవలన్నిటిపట్ల భారత ప్రభుత్వపు కృతజ్ఞతలను తెలియజేస్తూ ఒక సందేశం మాత్రం పంపాడు. యూనివర్శిటీ రెక్టార్ లార్డ్ కామిషేల్ అధ్యక్షత వహించాడు. అతనిలా అన్నాడు:- "భారత ప్రభుత్వమే కాదు; సర్ అశుతోష్‌కి ఇంకా చాలామంది కృతజ్ఞులుగా ఉండాలి. కలకత్తా యూనివర్శిటీతో సంబంధం వున్న ఏ ఒక్క వ్యక్తిగాని, ఆ మాటకొస్తే బెంగాల్‌లోని విద్యావంతుడైన ఏ ఒక్కవ్యక్తిగాని, అశుతోష్‌కి కృతజ్ఞులుగా ఉండక తప్పదు. అశుతోష్ ఈ యూనివర్శిటీకి చేసినది "ఉత్తమ సేవ" కాదు; "అత్యుత్తమ సేవ". అదీ అతను అలుపూ అపూ లేని శక్తితో చేసినది. సర్ అశుతోష్ ఈ యూనివర్శిటీకి వైస్ ఛాన్సలర్‌గా 1906 మార్చి 31న అంటే ఎనిమిదేళ్ళ కిందట—వచ్చారు. ఈ ఎనిమిదేళ్ళపాటూ (ఆయనే చెప్పినట్టు) ఆయన చాలా శ్రమించి, గర్వించదగ్గ సేవ చేశాడు. నిర్విరామంగా పనిచేసే అద్భుతమైన ఆ శక్తి సర్ అశుతోష్ కున్నట్టు ఇంక ఎవరికీ ఉండదు హైకోర్టు న్యాయమూర్తిగా ఆయన తన విధులను ఎన్నడైనా

నిర్లక్ష్యం చేశాడని ఏ ఒక్కరూ అనలేదు. ఆ పనే చాలా కష్టసాధ్యం. ఇంతకాలమూ కూడా వైస్ ఛాన్స్‌లర్ పని విడిగా ఒక సమర్థుడైన వ్యక్తికి చాలినంత కార్యభారం అయినాసరే, అదీ ఇదీ కూడా నిర్వహించాడాయన. బృహత్తరమైన ప్రణాళికలను అవగాహన చేసుకోవడమేకాక వాటి సూక్ష్మతర వివరాలను కూడా అర్థంచేసుకుని వాటిని రూపొందించాడాయన. ఎంత పెద్ద ప్రతిపాదన అయినా అతను పరిశీలించ లేనిది లేదు; ఎంత చిన్న పాయింటు అయినా సరే అతను పరిశీలించ నిరాకరించలేదు. జనంతో అతనికున్న పరిచయం అపారం. విద్యావంతులతో అయితే మరీనూ. ఎందు కంటే అతను ఎప్పుడూ వారికోసరమే పని చేశాడు కనక. ఎం. ఏ. అయిన వాళ్లా అతనికి తెలిసిన వాడే అనీ; కలకత్తా యూనివర్శిటీలో ఆ డిగ్రీ తీసుకున్న ఏ వ్యక్తి కూడా అతనికి పరిచితుడు కానివాడు లేడనీ నాకు తెలిసింది. శ్రమ తీసుకోవడానికి అతనికున్న శక్తి అనంతం. కష్టం కదా అని అతను ఏ పనీ ఎన్నడూ వదల్లేదు చర్చకా అతనెన్నడూ సంసిద్ధుడే! స్థిరమైన నిర్ణయాలు అతన్నుంచి త్వరగా వచ్చేవి. సమావేశాలకయితే అతని అధ్యక్షత నిపుణతే. అలా వుండడం వల్లనే, తన మార్గం ఇతరుల మార్గం కానప్పుడు తన మార్గాన్నే తాను అనుసరించేవాడని నేను నమ్మకంగా చెప్పగలను. అయితే అతనెప్పుడూ కార్యవాది. ఏదో ఒకటి త్వరగా చెయ్యాలనే ధ్యేయం అతనిది. అతని నిర్ణయాలు సదుపాయంగా వుండక పోవచ్చుగాని అతను సిద్ధాంతానికి కట్టుబడడానికి సిద్ధమే.

# 6. కలకత్తా యూనివర్శిటీ (1914-1923)

అశుతోష్‌కి కలకత్తా యూనివర్శిటీ వైస్ ఛాన్సలర్ పదవి లేక పోయినా, అతనికి అక్కడ అధికారం పలుకుబడి అలాగే వుండడం చూసి భారత ప్రభుత్వ అధికారులకి కళ్ళు కుట్టాయి. ఏప్రిల్ 1915లో హెన్రీ షార్ప్ "ఇందులో ఏదైనా మార్పు కలిగే వరకూ యూనివర్సిటీకి ఆర్థిక సహాయం నిలిపి వేయడమే ఉత్తమమైన పద్ధతి" అంటూ ఒక నోట్ పెట్టాడు. యూనివర్సిటీ వ్యవహారాల మీద విచారణకి ఒక కమిటీ వస్తుం దని పుకారు పుట్టింది. భారత ప్రభుత్వంలో విద్యారంగ సభ్యులు అలాంటి కమిటీ వస్తున్నట్లు నిర్ధారణ లేదన్నాడు. "అక్కడ సర్వాధికారాలతో సర్ అశుతోష్ ముఖర్జీ వుండగా యూనివర్సిటీ లోప విచారణ జరిపినా ఏం ప్రయోజనం వుండదు. అని హార్కోర్ట్ బట్లర్ అనే ఆయన 1915 అక్టో బరులో వ్రాశాడు. ※

భారత ప్రభుత్వం లోగడ మంజూరు చేసిన గ్రాంట్లకు మించి కొత్తగా ఏమివ్వడానికీ నిరాకరించే సరికి, యూనివర్శిటీలో ఒక విషమ పరిస్థితి ఏర్ప డింది. పట్టభద్రోపరిశాఖలను కొనసాగించడానికి ముప్పు వచ్చింది. అశుతోష్ అలాంటి కమిటీలకు వ్యతిరేకికాదు. అంతేకాక పట్టభద్రోపరి శిక్షణ గురించి ప్రభుత్వానికీ యూనివర్సిటీకి మధ్య అభిప్రాయ భేదాలేవైనా వుంటే నిర్మొహమాటంగా వాటిని చర్చించుకోడం వల్లనే పరిస్థితి మెరగవు తుందని అతని నమ్మకం. 1916లో వైస్రాయి కౌన్సిల్‌లో విద్యారంగ సభ్యుడిగా శంకరన్ నాయర్ రావడంతో పరిస్థితి నయమైంది. కలకత్తా యూనివర్సిటీలో పట్టభద్రోపరి శిక్షణకు ఏర్పాట్లను, పునర్విమర్శ చేయ డానికి అశుతోష్‌ముఖర్జీ అధ్యక్షతను ఒక కమిటీ ఏర్పడింది. ఎం.ఏ. క్లాసుల నిర్వహణకు ఉండిన నిధులేమిటో, లభ్యమయ్యేవనరులేమిటో చూసుకుని సక్రమంగా ఉపయోగించే నిమిత్తం సూచనలివ్వడానికి ఈకమిటీ.

---

※ అశుతోష్ ముఖర్జీ జీవిత చరిత్ర—ఎన్. కె. సిన్హా - పుట 204
※ అదే గ్రంథంలో

కమిటీ అధ్యక్షుడు కాక ఆరుగురు సభ్యులు. అందులో నలుగురు యూరపియన్లు. 1916 డిశంబరు 12న ఈ కమిటీ రిపోర్టు నిచ్చింది. ఇది ఏకగ్రీవం. యూనివర్సిటీ పట్టభద్రోపరి విద్యనంతటినీ ఒకే తాడు మీదకి తేవాలని విన్నవించింది. అసలు పట్టభద్రోపరివిద్య మీద (అది ఆర్ట్స్ కాని సైన్సు కాని, సర్వాధికారాలూ యూనివర్సిటీకి వుండాలని కమిటీ శిఫార్సు చేసింది. అంతకు ముందు కలకత్తాలో ఎమ్. ఏ. కొౕకటి, ఎమ్. ఎస్ సీ కొౕకటీ శిక్షణ ఇచ్చే కాలేజీలు రెండుండేవి. అదంతా పోవాలనీ, మొత్తం నిర్వహణ యూనివర్సిటీ చేతుల్లోనే వుండాలనీ కమిటీ అన్నది. అంటే ఈ కాలేజీలోని ఉద్యోగుల పని క్రిందతరగతుల శిక్షణకి పరిమితం ఆయిపోవాలని కాదు ఉద్దేశం. కాలేజీల సమాఖ్య క్రింద తరగతుల్లో బోధనతో పాటు పై తరగతుల శిక్షణను కూడా ఒక పనిగా చేపట్టడం ఈ పథకంలో చెప్పిన ముఖ్యమైన విషయం. మరి పట్టభద్రోపరి తరగతుల్లో శిక్షణేమో యూనివర్సిటీ లోనే కేంద్రీకృతంగా జరుగుతోంది. అంచేత యూనివర్సిటీలో ప్రత్యేకం ఈ పనికోసమే జీతాలిచ్చుకుని ఉద్యోగులను నియమించాలి. ఆర్ట్స్ కొౕకటీ, సైన్సుల కొౕకటీ మొత్తం రెండు పట్టభద్రోపరి విద్యా మండలు లేర్పడాలి. వీటికి ఆ తరగతుల శిక్షణ మీద, దాని నిర్వహణ మీద పూర్తి అధికారం వుండాలి. కమిటీ చేసిన ఈ శిఫార్సుల మీద సెనేట్‌లో బోలెడు చర్చ జరిగింది. అయినా అక్కడున్నది సర్ అశుతోష్‌ముఖర్జీ కనక, ఆయన సామర్థ్యం బలీయమైనది కనక, సెనేట్ ఆమోదాన్ని పొందింది. వెంటనే వీటన్నిటినీ అమలు చెయ్యడానికి నిబంధనలు కూడా ఏర్పరిచింది సెనేటు. ఈ నింధనలకి 1917 జూన్ 26న భారత ప్రభుత్వ ఆమోదం లభించింది. రెండు నెలల్లో కొత్తగా సూచించిన అధికార పీఠా లేర్పడ్డాయి; 1917 సెప్టెంబరు నుంచి కొత్త పద్ధతి అమల్లో కొచ్చింది. అటు ఆర్ట్స్‌లోనూ, ఇటు సైన్సుల్లోనూ కూడా పట్టభద్రోపరి విద్యా మండలులు రెండింటికి అధ్యక్షుడిగా అశుతోష్ ముఖర్జీ వొక్కడే ఎన్నికయ్యాడు. ఇది అశుతోష్ సాధించిన ఘన విజయం. కలకత్తా యూనివర్సిటీని కేవలం పరీక్షా పీఠంగా కాక బోధన విశ్వవిద్యాలయంగా తీర్చి దిద్దిడమనే మహదాశయానికి కొన్నాళ్ళ కిందట విశృబ్దంగా నిరాడంబరంగా పునాది పడి, ఇప్పుడు మరో ముందడుగు పడింది. అసలు, ఈ కమిటీలో సభ్యులైన హార్నెల్ (బెంగాల్

రాష్ట్రీపు డైరక్టరాఫ్ పబ్లిక్ ఇన్‌స్ట్రక్షను), డబ్ల్యు. సి. వర్డ్స్‌వర్త్ (ప్రిన్సిపాల్)లు; పట్టభద్రోపరివిద్యలను విశ్వవిద్యాలయంలో కేంద్రీకరణం చేయడాన్ని వ్యతిరేకించాలన్న మాట. కాని, వాళ్ళు కూడా అశుతోష్‌తో ఏకీభవించేసి, రిపోర్టును ఏకగ్రీవం చేసారు. తన హేతువాద బలంతో ప్రతి విషయంలో నూతన వ్యతిరేకుల్ని తన పక్షానికి లాగేసుకునే శక్తిని అశుతోష్ ప్రదర్శించాడు.

"కలకత్తా యూనివర్శిటీలో పరిస్థితులను గూర్చి, మంచిచెడ్డలను గూర్చి విచారించి యిందులో సమస్యల దృష్ట్యా ఒక నిర్మాణాత్మకమైన పద్ధతిని ప్రవేశ పెట్టే ఆలోచన నిమిత్తం గవర్నరు జనరల్ ఒక కమీషను నియమిస్తా"రని 1917 సెప్టెంబరులో భారత ప్రభుత్వం ప్రకటించింది. (ఇంగ్లాండు) లోని లీడ్స్ యూనివర్శిటీ వైస్‌ఛాన్స్‌లర్ డాక్టరు ఎం. ఇ. శాడ్లర్ ఈ కమిషను అధ్యక్షుడు గాను, సర్ అశుతోష్ ముఖర్జీ (ఇతను ఈ యూనివర్సిటీకి వైస్ ఛాన్సలర్ కానప్పటికి) కమిషన్ ఏడుగురు సభ్యుల లోనూ ఒకరుగాను నియమించారు. శంకర్ నాయర్ విద్యారంగ సభ్యుడిగా ఉన్నాడు కనక ఇక షార్ప్ ఆటలు సాగవని స్పష్టమై పోయింది. ఈ కమిషను 1917 నవంబరులో సమావేశమయింది. కమిషను సభ్యులు భారత దేశంలో వివిధ భాగాల్లో సంచారం చేసి ఎన్నో కాలేజీలు స్కూళ్లూ మొదలైన విద్యా కేంద్రాలకు వెళ్ళి, అనేక సాక్ష్యాధారాలను సేకరించి, 1919 మార్చి నాటికి ఒక బృహత్తరమైన నివేదికను భారత ప్రభుత్వానికి అందజేశారు. దృక్పథం స్పష్టంగా, వ్యక్తీకరణ తేటతెల్లంగా, వ్రాయబడిన ఈ నివేదికను "విద్యా విషయకమైన ప్రవచనాల్లో మిక్కిలి ప్రామాణికమైన వాటిలో ఒక్కటిగా పేర్కొని పాండిత్యానికి ఒక చిహ్నంగా పరిగణించారు. దీంట్లో అశుతోష్ సమర్పణ ఎంతో ఏదో ఖచ్చితంగా నిర్ణయించడం కష్టం. అయితే అతను ఇందులో దేనికి అసమ్మతిని వ్యక్తపరచలేదు. ఈ రాష్ట్రీపు విద్యారంగ పద్ధతిలోని లోటుపాట్లు అతనికి తెలుసు. కనుక దాని మేలుకోసం నిర్మాణాత్మకమైన సూచనలకు ఎల్లప్పుడూ స్వాగతమే చెప్పాడు. శాడ్లర్‌కి మాత్రం అశుతోష్ మీద ఉన్నతమైన అభిప్రాయం ఏర్పడింది. దేశపు విద్యారంగం గురించి అశుతోష్ కున్న అపార పరిజ్ఞానంవల్ల అతనూ ప్రయోజనం పొందాడని చెప్పవచ్చునేమో! శాడ్లర్ పొద్దుట పూటల్లో మైదానంలో అశుతోష్‌తో

కలిసి షికార్లు చేస్తూ, కమిషన్ పని గురించి అతనితో చర్చిస్తూ ఉండేవాడట. అశుతోష్‌కి ఈ నివేదికలో చెప్పుకోదగ్గ భాగం సమర్పించక తప్పింది కాదు. నివేదిక మొత్తం అయిదు సంపుటాలు. విద్యారంగం గురించి సర్వస్వం వుంది దాంట్లో. అయితే ఆ నివేదికలో అశుతోష్ జీవితచరిత్రతో సంబంధం వున్న కొద్దిపాటి శిఫార్సులను మాత్రం చెప్పుకోవచ్చు.

కలకత్తాలో నిజమైన బోధన విశ్వవిద్యాలయం ఏర్పడాలని కమిషన్ సూచించింది. కలకత్తా యూనివర్సిటీలో పట్టభద్రోపరిశాఖల ఘనతల విలువను గణనకు తెచ్చి ఆవిధంగా అశుతోష్‌ని పరోక్షంగా సమర్థించింది. ఈ నివేదిక పట్టభద్రోపరి విద్యా పద్ధతి వల్ల ఒక కొత్త జిజ్ఞాసాభావం, పరిశోధనా తృష్ణ మేల్కొన్నాయని నివేదిక ఉదాహరించింది. ఈ శాఖల ఉద్యోగుల జీతాలు పెంచడానికి వీలుగా వెంటనే ప్రభుత్వం సాలీనా లక్ష ఇరవై ఐదు వేల రూపాయల గ్రాంటు నివ్వాలని శిఫార్సు చేసింది. అంతే కాదు కలకత్తా యూనివర్సిటీలో గాని, కాలేజీల్లో గాని ప్రాతినిధ్యంలేని ఇరువై ఏడు కొత్త శాఖలున్నాయని నిధుల కొరత లేకపోతే వాటిని వెంటనే ప్రారంభించాలని కూడా కమిషన్ శిఫార్సు చేసింది విస్తారమైన సంఖ్యలో ఆదర్శ పీఠాలను నెలకొల్పాలని కూడా కమిషన్ సూచించింది. (మతం-భారతీయతత్వ శాస్త్రం; వేదభాష-వాఙ్మయం, సంస్కృతి, భారతీయ మానవ వర్ణనాశాస్త్రం వాటిలో పేర్కొనదగిన కొన్ని) "అశుతోష్ వ్యవస్థాపించిన" న్యాయశాస్త్ర శిక్షణాపద్ధతి బాగా పనిచేస్తున్నట్టు తోస్తోందని నివేదిక ఉదాహరించింది. (విశ్వవిద్యాలయంలో దేశభాషల శాస్త్రీయ అభ్యాసాన్ని ప్రోత్సహించాలని కూడా నివేదికలో చెప్పబడింది.) మెట్రిక్యులేషన్ పరీక్షకు కూర్చుంటున్న విద్యార్థులు ప్రశ్నలకు తమ జవాబులను ఆంగ్లంలో గాని వారి దేశభాషలో గాని వ్రాయడానికి అనుమతించవలసి వుంది. (గణితశాస్త్రం ఇంగ్లీషు మాత్రం ఈ సూత్రం నుంచి మినహాయించి.) విద్యారంగ దృక్పథంలో ఒక కొత్తదనం రావాలని కమిషన్ కోరింది అయితే అవసరమే అయిన సంస్కరణలేవీ కూడా చాలినన్ని నిధులు లేకపోతే అమలు జరగవు. కమిషన్ సూచనలు, చూసీచూడగానే ప్రభుత్వ ఖజానాకు ఘోరంగా తోచవచ్చు. కాని, ఇలా చేసిన ఖర్చు దేశపు పౌరస్వత్వ పారిశ్రామిక శ్రద్ధమీద ఆర్థిక సంక్షేమం మీదనే కాక, నైతిక పటిష్ఠతమూలం మీద కలిగించే ఫలితాల

దృష్ట్యా ఫలప్రదంగానే ఉండగలదని వారు విశ్వసించారు. బెంగాల్ పౌరులు ఇలాంటి మేలు తరగతి విద్యకు, ఆ ప్రయోజనాలకు అవసరమైన మూల్యం చెల్లించగలిగేటంత ధనికులు కారని అంటే అనవచ్చు. కాని ప్రస్తుతం అమల్లోవున్న విద్యావిధానం వల్ల ఇంత ప్రతిభ వృధా అయిపోతున్నదే; దీన్ని భరించ గలిగేటంత అజ్ఞానులు కారుకదా బెంగాలీలు! కమిషన్ అభిప్రాయం ఏమిటంటే; ప్రభుత్వం తమ నిధులనుంచి ఈ ఖర్చునంతా భరించినట్లయితే, ఇది ఖర్చు కాదు. "ఉత్తరోత్రా అనేక విధాలుగా యిది బెంగాలుకి తద్వారా భారతదేశానికి యావత్ప్రపంచానికీ కూడా ఒక పొదుపూ, ఒక వరమూ కా గలదు".* ఈ వాక్కులు అశుతోష్ జీవితాంతం విశ్వసించిన భావాలకు నిశ్చయమైన సారూప్యంతో ఉన్నాయి.

ప్రత్యేకంగా కలకత్తా యూనివర్శిటీని సంస్కరించడానికీ పునర్వ్యవస్థీకరించడానికీ మాత్రం ఈ కమిషన్ నియమించబడింది. అయినా సరే, ఈ కమిషన్ శిఫార్సులను అమలు పరచడానికి ప్రభుత్వం ఏమీ చెయ్యలేదు. కలకత్తా యూనివర్సిటీ ఆర్థిక ఇబ్బందులు అలాగే ఉండిపోయాయి; పైగా ప్రభుత్వం కొత్త యూనివర్సిటీలను ఏర్పాటు చేసి ఆ ఇబ్బందిని ఇంకా పెంచింది. విద్యార్థుల పరీక్ష రుసుం కలకత్తా యూనివర్సిటీకి ఒక ఆదాయం. కాగా కొత్త యూనివర్శిటీల ఏర్పాటు ద్వారా ఈ యూనివర్సిటీలో విద్యార్థుల సంఖ్య తగ్గి ఆదాయం కూడా నన్నగిల్లింది. అయినా సరే అశుతోష్ సారధ్యంలో పట్టభద్రోపరిశాఖలు ఉన్నత విద్యా బోధన పరిశోధన రంగాల్లో గణనీయమైన కృషి చేస్తూనే వచ్చాయి. వైస్ ఛాన్సలర్ సర్ నీలరతన్ సర్కార్ 1920 జనవరిలో జరిగిన స్నాతకోత్సవంలో ప్రసంగిస్తూ ఈ యూనివర్శిటీలో పట్టభద్రోపరిశాఖలు చేస్తున్న కృషిని ఈ విధంగా ప్రశంసించాడు.

"ఈ ఏడాది పట్టభద్రోపరి శాఖలు సాధించిన వాటిలో మిక్కిలి గణనీయమైనదిగా, పరిశోధనా రంగానికి సమకూర్చిన ప్రేరణను పేర్కొనవచ్చు. చాలామంది మెరికల్లాంటి అధ్యాపకులున్నారు. వాళ్ళలో ఎక్కువమంది సమర్థంగా పాఠాలు చెప్పడం మాత్రమేకాక పరిశోధక విద్యార్థులకి మార్గదర్శకులుగా ప్రోత్సాహాన్నిస్తూ వచ్చారు. సైన్సు శాఖల్లో మౌలికమైన పరిశోధన ననుసరించి సమర్పించిన వ్యాసాలు 82. అందులో అధ్యాపకులవి

60; అధ్యాపకులూ, పరిశోధకులూ కలిసి సమర్పించినవి 14; విద్యార్థులు స్వతంత్రంగా పరిశోధన సలిపిన ఫలితంగా వచ్చినవి 8. పరిశోధనా రంగంలో ఆర్ట్సు శాఖల ప్రగతికూడా తక్కువదేం కాదు. ఈ శాఖ పరిశోధనకోసం చేపట్టిన విషయాలు 20 కన్నా ఎక్కువే. ఈ పరిశోధన ఫలితాలు విధిగా మన జ్ఞాన భాండాగారానికి అదనపు విలువలు కాగలవు. మౌలికమైన పరిశోధన ఆధారంగా పాతికకు పైగా వ్యాసాలు ప్రచురించబడ్డాయి. ఇవికాక చాలా ముఖ్యమైన విషయాలు పదిహేనింట పరిశోధనా వ్యాసాలు తయారవుతున్నాయి. మౌలిక విషయాలపై మన పట్టభద్రోపరి శాఖలు ప్రచురించిన వ్యాసాలు కొన్ని యూరపులోను, అమెరికాలోను అత్యధిక విద్యావంతుల దృష్టిని ఆకర్షించాయి ఆర్ట్సు శాఖలో పని కార్యదీక్షా బద్ధులయిన కొందరు అధ్యాకుల బృందం నెరవేరుస్తున్నారు. వీళ్ళల్లో చాలామందికి తగినంత ప్రతిఫలం ముట్టడం లేదు. అయితే అది జ్ఞాన తృష్ణ. పరిశోధనా కాంక్ష జ్ఞాన విస్తరణాభిలాష. అక్కడ ప్రతిఫలం మీదకంటె కృషి మీదనే ఆసక్తి ఎక్కువ. ఆ విధంగా పట్టభద్రోపరి విద్యాశాఖ ఆశాజనకంగా వుంది. అయితే ఈ శాఖ చాలా ఇబ్బందుల్లో ప్రతికూల పరిస్థితుల్లో నడుస్తోంది. విద్యార్థుల వసతి సదుపాయాల ఏర్పాటుకు, గ్రంథాలయం ప్రయోగశాలల విస్తరణకి, సిబ్బందిని పటిష్ఠం చేయడానికి, ఇంకా చాలా విషయాలలో అభివృద్ధి సాధించడానికి, నిధుల అవసరం వుంది."

ప్రభుత్వం నుంచి అవసరమైనంత సహాయం దొరక్క పోయినా, అశుతోష్ అదృష్టవశాత్తూ మరో ఇద్దరు వ్యక్తుల ఔదార్యం వల్ల భూరి విరాళాలను సేకరించ గలిగాడు. ఆర్ట్సు, సైన్సులలో పట్టభద్రోపరిశాఖల విస్తరణకి ఇవి బాగా తోడ్పడ్డాయి.

1913లో యూనివర్శిటీ సైన్సు కాలేజీ సహాయార్థం సర్ రాసబిహారీ ఘోష్ పది లక్షల రూపాయల విరాళం ఇచ్చారు. 1919 డిశంబరులో అతడు మరో పదకొండు లక్షల నలభై మూడువేలు ఇచ్చాడు. దానిమీద వచ్చే ఆదాయాన్ని ప్రత్యేకం సాంకేతిక విద్యకు పరిశోధనకు వెచ్చించవలసివుంది. అనువర్తన రసాయన శాస్త్రంలో ఒకటి, అనువర్తన భౌతికశాస్త్రంలో ఒకటి, మొత్తం రెండు కొత్త ఆదర్శ పీఠాలు; వాటిలో ఒక్కొక్క శాఖకు రెండు చొప్పున అనుబంధితాలవుతూ నాలుగు అదనపు విద్యార్థి వేతనాలు నెలకొల్ప వలసి వుంది. ఆ నిధి ఇచ్చే సాలుసరి ఆదాయంలోంచి ఈ ఆచార్య పీఠాలకు

జీతాలు, విద్యార్థి వేతనాలు చెల్లించగా మిలిగిన సొమ్మును ప్రయోగశాలల నిర్వహణకు, పరికరాలకు, వస్తు ప్రదర్శనశాలలకు; వర్క్‌షాపులకు ఖర్చు చేయాలి. "వీటికి సమృద్ధిగా (ధనం) ఏర్పాటు చెయ్యడం తప్పనిసరి అవసరం. కాని ఇతర నిధుల్లోంచి ఏర్పాటు చేయటానికి చాలినంత ధనం యూనివర్శిటీ చేతుల్లో లేదు." అనువర్తన రసాయన శాస్త్రంలోను, అనువర్తన భౌతిక శాస్త్రంలోను ఆచార్యులుగా క్రమంగా ప్రొఫెసర్ హెచ్. కె. సేన్, ప్రొఫెసర్ పి. ఎన్. ఘోష్ వంటి ప్రసిద్ధ శాస్త్రజ్ఞులు నియమితులయ్యారు.

కలకత్తా హైకోర్టు ఇచ్చిన ఒక తీర్పుననుసరించి రాణి వాగీశ్వరీ దేవి అనే ఆవిడ ఖైరాకు చెందిన కుమార గురు ప్రసాద్ సింగు మీద తెచ్చిన దావాలో, నాలుగు లక్షల అరవై వేల రూపాయల నగదు, కలకత్తా కామక్ వీధిలో 3వ నెంబరు ఇల్లు, అందులో ఖాళీ స్థలం ఇవన్నీ రాణిగారి హక్కులకు కట్టుబడి యూనివర్సిటీకి దఖలు పడ్డాయి. రాణిగారు ఆస్తంతా తన పేర తీసేసుకోడానికి యూనివర్సిటీకి ఆరు లక్షల యాభై వేలు చెల్లించడానికి ఒప్పందం అయింది. ఈ కానుక ఉపయోగించే విధానం రూపొందిచే అధికారాన్ని కోర్టు వారు సర్ అశుతోష్‌కి ఇచ్చారు. సర్ అశుతోష్ వేసిన పథకం 1921 ఆగష్టులో సెనేటు అంగీకారం పొందింది. ఈ పథకం ప్రకారం భారతీయ చిత్ర కళలు, స్వర శాస్త్రం, భౌతిక శాస్త్రం, రసాయన శాస్త్రం, వ్యవసాయ శాస్త్రం-ఈ అయిదు విషయాల్లో అయిదు ఆచార్య పీఠాలను నెలకొల్ప వలసివుంది. యూనివర్సిటీ ఎదుర్కొంటున్న తీవ్ర ఆర్థిక ప్రతిష్ఠంభనను అనుసరించి అశుతోష్ ముఖర్జీ తన పథకంలో ఈ నిబంధనను చేర్చారు:-

''పట్టభద్రోపరి శిక్షణ, పరిశోధన కొనసాగించడానికి సెనేటు ఋణం తేవచ్చు. కోర్టు కేసు ఫలితంగా చివరికి ఆరున్నర లక్షలు వచ్చింది. ఈ నిధుల అయివేజులను తాకట్టు పెట్టి రెండేళ్ళల్లో తీర్చే పద్ధతిని మూడు లక్షలకు మించని ఋణం సెనేటు తేవచ్చును" (అని ఈ నిబంధన సారాంశం). అలాంటి తాకట్టు వ్యవహారం అంతా సర్ అశుతోష్ ముఖర్జీ గారి మూలకంగా అనుమతిసేనే జరగాలి. మూడు లక్షలు అని

ఎందుకన్నాదంటే, యూనివర్సిటీలో పట్టభద్రోపరి శాఖలకు అప్పటికి ఆదాయ వ్యయాల మధ్య వున్న తేడా అది.

భారతీయ లలిత కళల్లో ఆచార్య పీఠాన్ని తొలిసారిగా అలంకరించినది ప్రఖ్యాత చిత్రకారుడు అవనీంద్రనాథ్ టాగూరు. ప్రస్తుతం జాతీయ ఆచార్యత్వంలో వున్న సునీతికుమార్ చటర్జీ భారతీయ భాషా శాస్త్ర స్వర శాస్త్రాల ఆచార్య పదవికి నియమితుడయినాడు. మేఘనాధ్ సాహా అని దరిమిలాను రాయల్ సొసైటీ ఆఫ్ ఇంగ్లాండు సభ్యుడై అంతర్జాతీయ ఖ్యాతి పొందిన శాస్త్రజ్ఞుడు భౌతిక శాస్త్ర ఆచార్య పీఠానికి నియమితుడయ్యాడు. జె. ఎన్. ముఖర్జీ రసాయనశాస్త్రానికి, అతనుకూడా ప్రపంచ స్థాయి శాస్త్రజ్ఞులలో ముఖ్య స్థానాన్ని పొందిన వాడే. వ్యవసాయ శాస్త్ర ఆచార్య పీఠం నాగేంద్రనాథ్ గంగూలీకి దక్కింది. అతను క్రమంగా "రాయల్‌సొసైటీ ఆఫ్ అగ్రికల్చర్ ఇన్ ఇండియా" లో సభ్యుడైనాడు.

1919 సంవత్సరపు భారత ప్రభుత్వ చట్టం అమల్లో కొచ్చాక భారత ప్రభుత్వం యూనివర్సిటీ వ్యవహారాల బాధ్యతలను విడనాడి ఈ సంస్థను బెంగాల్ ప్రభుత్వానికి అప్పగించింది. ఇది చట్ట సమ్మతమై 1921 ఏప్రిల్ 27వ తేదీ నుంచి అమల్లో కొచ్చింది. చరిత్రాత్మకమైన ఈ నిర్ణయం అమలు పరుస్తూ కూడా, భారతీ ప్రభుత్వం యూనివర్సిటీ ఆర్థిక బాధ్యతలను చక్కపెట్టే విషయంలో బెంగాల్ ప్రభుత్వానికి ఏ విధమైన ఏర్పాటు చెయ్యలేదు. ఆపైన బెంగాల్ గవర్నరు ఈ యూనివర్సిటీకి లోగడ వలె రెక్టార్ కాకుండా ఛాన్సెలర్ గానే వ్యవహరించవలసి వచ్చింది.

1921 ఫిబ్రవరి 5వ తేదీని, ఉన్నత విద్యలో శిక్షణ అభివృద్ధి నిమిత్తం, కలకత్తా యూనివర్సిటీ బెంగాల్ ప్రభుత్వం నుండి ఆర్థిక సహాయాన్ని కోరింది. పట్టభద్రోపరి శాఖల అధ్యాపకుల వేతనాల చెల్లింపు నిమిత్తం అప్పటి కిస్తున్న లక్ష డెబ్బయి వేలు కాక పది లక్షల కాపిటల్ గ్రాంటును అడిగింది. పట్టభద్రోపరి శాఖల అభివృద్ధి కని ఒక లక్షడెబ్భైఅయిదు వేల గ్రాంటును, సాంకేతిక విద్య నిమిత్తం పది వేలు కాపిటల్ గ్రాంటును మాత్రం ఇస్తూ, ఇక మీదట ప్రభుత్వానికి యూనివర్సిటీ గ్రాంటులు అడిగినా ఇచ్చే పరిస్థితి లేదని, ఆరిక ప్రతిషంభన కారణంగా శాడ్లర్ కమిషన్ శిఫార్సు

లను అమలు చెయ్యడం కూడా సాధ్యం కావడం లేదని బెంగాల్ ప్రభుత్వం తెలియచేసింది.

యూనివర్సిటీ ఈ గొడవల్లో పడి వుండగా, పరిస్థితిని మరింత క్లిష్టం చేసేందు కన్నట్లు సహాయ నిరాకరణోద్యమం వచ్చింది. విద్యార్థులు స్కూళ్ళను, కాలేజీలనూ బహిష్కరించసాగారు. "ఈ గోలంఖానా" నిర్వహించే పరీక్షలు మాకొద్దన్నారు. ఆ విధంగా పరీక్ష ఫీజుగా వచ్చే ఆదాయం పడిపోయింది. రూల్సు ప్రకారం ఫీజు రూపంలో వచ్చే డబ్బులో మూడవ వంతు పట్టభద్రోపరిశాఖలకు ఖర్చు పెట్టేవారు. ఇప్పుడు ఈ శాఖలకి ఈ భాగం వనరు పోయింది. పట్టభద్రోపరి తరగతుల అధ్యాపకులు నెలలు తరబడి జీతాలు తీసుకోకుండా పని చేసేరు. అధ్యాపకులకి యూనివర్సిటీ పట్ల సర్ అశుతోష్ పట్ల వున్న భక్తి విశ్వాసాలే పట్టభద్రోపరి శాఖ పతనమై పోకుండా కాపాడాయి. వీళ్ళందరూ ఆయా విషయాల్లో నిష్ణాతులు. అడగాలే కాని, ప్రభుత్వంలో, లేక కొత్తగా లేస్తున్న విశ్వ విద్యాలయాల్లో వీళ్ళకి ఇంత కంటె బాగా జీతాలు దొరికే ఉద్యోగాలు లభించి ఉండేవి. అది గుర్తుంచు కోవలసిన విషయం.

వేలకొలది విద్యార్థులు స్కూళ్లను కాలేజీలను వదలి వెళ్లివేయడమనేది ఒక జాతీయ విపత్తులా తోచింది అశుతోష్‌కి. అతను కూడా ఏ రాజకీయ నాయకుడికీ తీసిపోనంతటి దేశభక్తుడే. కాని, ధ్యేయాన్ని సాధించే పద్ధతి, అతవిదివేరు. స్వాతంత్ర్య సాధనకి విద్యావ్యాప్తి రామబాణంలాంటి సాధనం అని అతని అభిప్రాయం. సగటు బెంగాలీ కుటుంబం ఆర్థిక పరిస్థితి ఏమిటో అతనికి తెలుసు. చదువుకి ఓ సారి అంతరాయం కలిగితే మళ్లీ కొనసాగే అవకాశం అనేక సందర్భాలలో మృగ్యం అని అతనికి నమ్మకంగా తెలుసు. పోమరులై పోయిన ఈ కుర్రాళ్లంతా భవిష్యత్తులో ఏమిటి చేస్తారు? సహాయ నిరాకరణోద్యమం మాంచి ఉధృతంలో ఉన్నప్పుడు విద్యార్థుల నుద్దేశించి ప్రసంగిస్తూ అతనిలా అన్నాడు: "మీకు కావలసింది స్వదేశీ జాతీయ విశ్వ విశ్వవిద్యాలయం కదా. మరి కలకత్తా విశ్వవిద్యాలయం జాతీయవిశ్వవిద్యా లయం కాదా? దీనికి సిండికేటూ సెనేటూ బెంగాల్ వాళ్ళ చేతుల్లోనే వున్నాయి. దీనికి నిధులిచ్చి పెంచుతున్నవాళ్ళంతా ఈ మన దేశపు బిడ్డలే. దీని వేషం అంతా జాతీయమే తప్ప ఇక్కడ విదేశీయం ఏమీలేదు. కలకత్తా

విశ్వవిద్యాలయంలోనే జాతీయత కావలసినంత ఉండగా ఉదారమైన ఈ త్యాగాన్ని పవిత్రమైన ఈ దేశభక్తినీ మీరిలా అవమానం చెయ్యొచ్చా?"

1921 మార్చి 24న జరిగిన విశ్వవిద్యాలయ స్నాతకోత్సవంలో మాట్లాడుతూ బెంగాల్ గవర్నర్ లార్డ్ రోనాల్డ్ షే కలకత్తా యూనివర్శిటీ సర్ అశుతోష్ సారథ్యంలో జాతికి చేస్తున్న ప్రముఖ సేవలను ఉదాహరించి దీని ఉపాధ్యక్షత్వాన్ని స్వీకరించుమని ఆహ్వానించడానికి తన కున్న ఉద్దేశాన్ని ప్రకటించాడు.

"భారతదేశపు నాగరికతకి, సంస్కృతికి ఇవ్వవలసినంత గౌరవాన్ని ఇవ్వడానికి ఇక్కడ జరుగుతున్న బృహత్ప్రయత్నానికి మీరు నిశ్చయంగా గర్వపడాలి. ఇక్కడ గణుతికెక్కిన భారతీయ పండితులు నిర్వహిస్తున్న బోధన పరిశోధన అత్యున్నత స్థాయికి చెందినవి. శాఖోపశాఖలుగా విస్తరించిన ప్రాచీన భారతీయ విజ్ఞానపు అధిక భాగాన్ని జీర్ణించుకుంటూ ఉన్నత స్థాయి సంస్కృతంలోనూ, బౌద్ధ విజ్ఞానాన్ని ఆకళింపుకు తేగల పాళీభాషలోనూ, ఇక్కడ బోధనా పరిశోధన జరుగుతున్నాయి. అలాగే ఇస్లాం మతంలో, వేదాంతంలో, వాఙ్మయంలో, అలంకార శాస్త్రంలో, కవిత్వ తత్త్వంలో, వ్యాకరణంలో, తత్త్వ శాస్త్రంలోనూ. భారతీయ భాషల, ప్రాచీన భారతీయ చరిత్ర సంస్కృతుల అధ్యయనం వివరంగా జరుగుతోంది. దేశాన్ని నిజంగా ప్రేమించే ప్రతి భారతీయుడి విశ్వాసము చేయూత ఎవరికి చెందాలి? భారతీయ జ్ఞానార్జనకు ఇంత చేసిన ఆ మహావ్యక్తికి. అతడే, భారతీయుల్లో నిజమైన భారతీయుడు, సర్ అశుతోష్ ముఖర్జీ. అశుతోష్ ముఖర్జీ యొక్క చేయూతను ఆశించడమనేది కేవలం అద్భుతమైన ఈ పట్టభద్రోత్తరపరిబోధనా శాఖను సృష్టించినందుకు మాత్రమేకాదు; ఆయన యూనివర్శిటీ సభ్యుడిగా చేసిన సిఫార్సులను కూడాను. ప్రస్తుతం అమల్లో వున్న ఉన్నత విద్యా విధానానికి ఎన్నో మెరుగులు దిద్దాలని, ప్రత్యేకించి రెండు కోణాల్లో మార్పులు తేవాలని అతను ఉద్దేశించాడు. అదే, వృత్తి విద్యల అధ్యయనానికి అభివృద్ధికి సావకాశం కలగచేయడం; అమల్లో వున్న విద్యా విధానం యావత్తూ మరింత స్పష్టంగా భారతీయతను సంతరించుకునేటట్లు చేయడం."

"మీ యూనివర్శిటీ భవిష్యత్తు తీర్చిదిద్దడానికి, దీన్ని జాతీయ విశ్వవిద్యాలయంగా రూపొందించి ఆ మాటను సార్థకం చేయడానికి ఇంతకంటే

అర్హతలున్న వ్యక్తి మరొకడు లేడు గాక లేడు." అని చెప్పి సర్ అశుతోష్ వైస్ ఛాన్సెలర్‌గా రావడానికి ప్రజల అందదండలను కోరాడు బెంగాల్ గవర్నరు లార్డ్ రోనాల్డ్ షే.

ఆ విధంగా ఏడేళ్ళ ఎడం తర్వాత 1921 ఏప్రిల్ 4వ తేదీన సర్ అశుతోష్ మళ్లా కలకత్తా యూనివర్శిటీ వైస్ ఛాన్సెలర్ స్థానాన్ని అలంకరించాడు. ఈ ఏడేళ్ళూ అతను వైస్ ఛాన్సెలర్ కాకపోయినప్పటికీ, యూనివర్శిటీ వ్యవహారాల మార్గదర్శకత్వం అతని చేతుల్లోనే వుంది. అతను యూనివర్శిటీ సిండికేట్‌లో, సెనేట్‌లో, ఫేకల్టిస్‌లో ఇంచుమించు అన్ని పరిషత్తులలో సభ్యుడుగా కొనసాగాడు. అంతేగాక ఆర్ట్స్, సైన్సులో పోస్టుగ్రాడ్యుయేట్ కౌన్సిల్‌లకు రెండింటికీ అధ్యక్షుడతనే. ఈ ఏడేళ్ళూ అతను (తన శక్తిని దృష్టిని) యూనివర్శిటీలో పట్టభద్రోపరిశిక్షణమీద కేంద్రీకరించి ఆ శాఖకు ఒక నిర్వాహకాన్నిచ్చాడు. వ్యక్తుల నుంచి వచ్చిన ఉదారమైన ధనసహాయంతో హెచ్చు సంఖ్యలో ఆచార్యపీఠాలూ, విద్యార్థి వేతనాలూ కల్పించాడు. పట్టభద్రోపరిశాఖలో అధ్యాపకులుగా యావద్భారత దేశం నుంచి విష్ణాతులనూ పండితులనూ నింపాడు. ఐరోపీయ విశ్వవిద్యాలయాలకు చెందిన ప్రఖ్యాతులనేకుల ద్వారా ఆయా విషయాల్లో రీడర్‌షిప్ ఉపన్యాసాలను ఏర్పాటు చేసాడు. అలా కలకత్తా విశ్వవిద్యాలయం ఇంచుమించుగా సర్వసమభావ విశ్వవిద్యాలయం అయిపోయింది. పరిశోధనకి అతని హయాంలో మంచి ప్రోత్సాహం లభించింది. పట్టభద్రోపరిశాఖల్లో విద్యార్థులూ అధ్యాపకులూ కూడా జ్ఞాన పరిధులను విస్తరింపజేసుకోవడంలో నిమగ్నులయి పోయారు.

విశ్వవిద్యాలయంలో ఎం. ఎ. పరీక్షకు భారతీయ భాషలలో కోర్సులను ఏర్పాటు చేయడం అశుతోష్ సాధించిన మహత్కార్యాల్లో కెల్లా గొప్పది. భారతీయ విశ్వవిద్యాలయాలు జాతీయ జీవనంతో దృఢమైన సంబంధం కలిగి వుండాలందే, భారతీయ భాషల అర్హతలను పూర్ణాంగీకారంతో గుర్తించవలసిందే. లోగడ ఒకసారి చెప్పుకున్నాం. ఎం. ఎ. వరకు గల యూనివర్సిటీ పాఠ్య విషయాల్లో భారతీయ భాషలకు ఒక స్థానం ఇవ్వడానికి ఉద్దేశించి 1891లో సెనేటర్‌గా అశుతోష్ తీర్మానాలు తేవడం అవిసెగ్గక పోవడమూ నూ.

అశుతోష్ దాన్నక్కడ వదిలెయ్యలేదు. జీవితంతో తనకు హృదయ పూర్వకంగా ప్రియతమమైన ఆ ఒక్క విషయాన్ని అలా గుర్తుంచుకుని సమయం చూసి, 1904వ సవంత్సరపు చట్టం ప్రకారం కొత్త నిబంధనలు తయారు చెయ్యడం తన మీద పడినప్పుడు దేశ భాషల్ని మెట్రిక్యులేషన్, ఇంటర్ మీడియేట్, బి ఏ. స్థాయిల్లో తప్పని సరిగా అభ్యసించవలసిందిగా చేసేశాడు.

1913లో భారతీయ భాషల్లో మిక్కిలి ప్రగతి శీలమైన భాషను యావజ్జీవ విశ్వాస పాత్రుడైన "రవీంద్రనాథ్ టాగూర్"కి డాక్టరాఫ్ లిటరేచర్ డిగ్రి ప్రధానం చేసి, తన రాష్ట్రపు దేశ భాష అయిన బెంగాలీకి, విద్యా విషయకమైన గుర్తింపును ప్రసాదించాడు.

1918లో సర్ అశుతోష్ ప్రోద్బలంచేత యూనివర్సిటీ: భారతీయ దేశభాషలన్నిటిలోనూ ఆయా భాషల వాఙ్మయ ప్రారంభదశనుండి అర్వాచీన కాలం వరకూ గల సాహిత్యం నుంచి ఉదాహరణాత్మకాలైన భాగాలను చేర్చి సంపుటాల శ్రేణులుగా కూర్చే ఒక పథకాన్ని ఆమోదించింది. దీని ఉద్దేశం ఏమిటంటే, మాస్టర్ ఆఫ్ ఆర్ట్స్ డిగ్రీకి వీటిని పాఠ్య విషయాలుగా చేర్చడం. 1919లో అశుతోష్ కలకత్తా యూనివర్సిటీలో భారతీయ దేశభాషల్లో పోస్టు గ్రాడ్యుయేట్ శాఖను ప్రారంభించాడు.

ఒక భారతీయుడికి, తన మాతృభాష యందు, సహ మాతృ భాషల యందు కల జ్ఞానం ఆధారంగా అత్యున్నతమైన డిగ్రీని సాధించడానికి భారతీయ విశ్వవిద్యాలయ చరిత్రలో తొలిసారిగా సాధ్యపడింది. ఈ పథకం ప్రకారం, ఈ డిగ్రీని కోరే విద్యార్థికి తన మాతృభాషలో కూలంకషం గానూ, దేశభాష ఇంకో దాంట్లో కొంచెం తక్కువ గానూ (ఇలా, రెండింటిలో) పరిజ్ఞానం అవసరం. అంతేకాక అట్టి విద్యార్థికి: తాను ఎం. ఏ. డిగ్రీ కోసం అధ్యయనం చేసే దేశభాషలు రెండింటికీ మూలకాలైన పాళీ, ప్రాకృత, పర్షియన్‌వంటి సంప్రదాయ భాషల్లో తగు మాత్రం పరిజ్ఞానం కూడా అవసరం. ఇది కాక, విద్యార్థి తాను ఎన్నుకున్న దేశభాషకు సంబంధించిన శబ్ద శాస్త్రంలో తగు మాత్రం పరిజ్ఞానం సంపాదించుకోవలసి వుంటుంది. కలకత్తా యూనివర్సిటీలో ఎం. ఏ. డిగ్రీకి గుర్తింపు పొందిన

దేశభాషలు బెంగాలీ, హిందీ, ఉర్దూ, అస్సామీ; వాటికి అనుబంధాలుగా గుర్తింపు పొందిన దేశభాషలు బెంగాలీ, అస్సామీ, ఒరియా, హిందీ, ఉర్దూ, మైథిలి, గుజరాతీ, మరాఠీ, తెలుగు, తమిళం, కన్నడం, మళయాళం, సింహళి.

సంకుచితమైన ప్రాంతీయతత్వానికి ఈ పథకం ఒక పెద్ద దెబ్బ. జాతీయ సమైక్యత అని మనం అంటున్నామే. దాని కోసం ఇతరులందరి కన్నా బాగా ముందుగానే అశుతోష్ కృషి చేశాడని నిశ్చయంగా దీన్ని బట్టి చెప్పవచ్చు.

దేశభాషలు కాక, ఫ్రెంచి, జర్మన్. చైనీస్, జపానీస్, టిబెటన్, భాషల బోధనను కూడా యూనివర్శిటీ చేపట్టింది.

అయితే అశుతోష్ బ్రహ్మాండమైన ఈ జాతీయ మహదాశ్వర్యతను ఎలా తీర్చేటట్టు? అసలే ప్రభుత్వం సానుభూతి అన్నది లేకుండా యూనివర్సిటీని ఎండగట్టేస్తోందే! దీనికి జవాబులాగా అశుతోష్, యావత్ భారతం నుంచి అందుతున్న ప్రోత్సాహం వివరాలు చెప్పి అందువల్లనే తాను ఈ కష్టాన్ని అధిగమించ గలుగుతున్నానని అన్నారు. "భారత దేశపు వివిధ ప్రాంతాల నుంచి ఈ జాతీయ పథకానికి తమ అండదండలు ఉంటా యని మన ఆహ్వానానికి బదులు పలికారు. ఎంతోమంది సంస్కృతీపరులు ఈ యూనివర్శిటీకి సహాయ పడడానికి ముందు కొచ్చారు.......... ఒరియా భాషలో ఏర్చి కూర్చిన వాఙ్మయ అందాల సంపుటాలను ప్రచురించేందు కయ్యే ఖర్చును సోనేపూర్ మహారాజా భరిస్తున్నారు. అలాగే మరాఠీకి ఇందోర్ హోల్కార్‌గారు, పారశీకభాషలోని ప్రమాణగ్రంధం Zanda Avista నుంచి తీసిన భాగాల ప్రచురణ కయ్యే ఖర్చు నిమిత్తం ఆర్. డి. మెహతాగారు ఉచితరీతి విరాళం అందించారు. అలాగే అస్సామీ భాషలో ప్రచురణలకి పదివేల రూపాయిలు బోలానాధ్ బారువాగారిస్తున్నారు, సనత్ కుమార్ ముఖర్జీగారు తమ అమూల్యమైన బెంగాలీ వ్రాతప్రతుల సంచయాన్నంతటినీ బహూకృతిగా సమర్పిస్తున్నారు. ఇలాంటివి దేశభాషల్లో పరిశోధనకి చాలా బాగా తోడ్పడతాయి కదా. దీనక్ పూర్‌కి చెందిన టి. చౌధురిగారు మైథిలి భాషలో ఒక అధ్యాపకత్వానికి పోషకులు. అలాగే మైథిలి భాషలో పరిశోధక

అధ్యాపకత్వానికి రాకీజార్మానంద్ సింగ్ (మరియు సహచరులు). ఒక అధ్యాపకత్వానికి సోనేపూర్ మహారాజు పోషకులుగా నిధులను సమ బెంగాలీ భాషలో కూర్చారు." ఇలా అనేకుల ఔదార్యాన్ని చేర్చగలగడం అశుతోష్‌కి కనుక, చేతనయింది.

1921 ఏప్రిల్లో కలకత్తా యూనివర్శిటీ సిండికేట్ సర్ అశుతోష్ నుంచి ఒక కానుకను స్వీకరించింది. దీని విలువ మూడు వేల రూపాయలు. ఇవి ప్రభుత్వ సెక్యూరిటీల రూపంలో ఉన్నాయి. రెండేళ్ళ కొకసారి రెండు వందల రూపాయల విలువగల ఒక స్వర్ణ పతకాన్ని తన తల్లిగారి పేరిట 'జగత్తారిణీ మెడల్' గా యివ్వాలని నిర్ణయం. ఈ పతకాన్ని పొందే వన్నీ బెంగాలీ భాషలో మౌలికమైన రచన (శాస్త్రంలో గాని కవిత్వం గాని) చేయాలి; అది ఉత్తమమైనదిగా సిండికేటు నిర్ణయించాలి.......... తొలి సారిగా ఈ పతకాన్ని డాక్టరు రవీంద్రనాథ్ టాగూర్ పొందారు.

పట్టభద్రోపరిశాఖ అధ్యాపకుల్లో ఏ ఖాళీలొచ్చినా అశుతోష్ దానిని నింపడానికి యావద్భారత దేశంలోనూ దానికి తగిన అతర్హతకలవాడు ఎవడున్నాడా, ఎక్కడున్నాడా అని అన్వేషించే వాడు. 1921లో బ్రజేంద్రనాథ్ శీల్ మైసూరు యూనివర్సిటీ వైస్‌చాన్సెలర్‌గా నియమితుడై వెళ్ళిపోతే ఐదవ జార్జి పేరిట వున్న తత్వశాస్త్ర ఆచార్య పదవి ఖాళీ అయింది. దానికి సర్వేపల్లిరాధాకృష్ణన్‌ని తెచ్చి వేశాడు అశుతోష్. దరిమిలాను రాధాకృష్ణ పండితుడు ఎంత ఉన్నతికి ఎదిగాడో దాన్ని బట్టి యోగ్యతను గుర్తించడంలో అశుతోష్ ప్రతిభను తెలుసుకోవచ్చు

1919కి అశుతోష్ డాక్టరేటు పుచ్చుకొని పాతికేళ్లయింది. అతని అభిమానులు రజతోత్సవం తలపెట్టారు. ఈ కార్యక్రమాన్ని అత్యుత్తమంగా రూపొందించడం కోసం, యూనివర్శిటీ ఇంగ్లీషు ప్రొఫెసర్ డాక్టర్ హెన్రీ స్టీఫెన్ అధ్యక్షతను ప్రఖ్యాత పండితులు సభ్యులుగా ఒక కమిటీ ఏర్పడింది. కళలు, సాహిత్య శాస్త్రం, ప్రాచ్య వాఙ్మయంలాంటి విషయాలన్నిటితో కొన్ని ఉత్తమ గ్రంథాల సెట్టును (తమకందరికీ అతనిపై వున్న గౌరవానికీ, ప్రశంసకీ గుర్తుగా) అతనికి ఈ సందర్భంగా బహూకరించడానికి నిశ్చయ మైంది. ఈ సంపుటాలు 1922 మార్చి 18న జరిగిన స్నాతకోత్సవంలో

ఛాన్సెలర్ లార్డ్ రోనార్డ్‌షే లాంఛన ప్రాయంగా సర్ అశుతోష్‌కి బహూకరించడం జరిగింది. విశ్వవిద్యాలయం సభ్యులైన అనేకులు తమ తమ జ్ఞాన సంపత్తితో సమర్పించిన రచనలెన్నో ఈ రజతోత్సవ సంపుటాల్లో చేరాయి. "విద్యా ప్రయోజనానికి, దేశంలో జ్ఞాన సముపార్జనకి అతను చేసిన ఆశ్చర్యకరమైన సేవలకు చిహ్నంగా సమర్పించే కానుక ఇంతకంటే సముచితమైనదాన్ని ఊహించడం అసాధ్యం. ఈ స్నాతకోత్సవంలో లార్డ్ రోనార్డ్‌షే, ఇటు యూనివర్శిటీకి ఛాన్సెలర్‌గా, అటు రాష్ట్రానికి గవర్నర్‌గా ద్విపాత్రాభినయం చేయడంలోగల ఇబ్బందిని వెల్లడించారు. ఛాన్సెలర్‌గా ఈ యూనివర్శిటీ పట్టభద్రోపరిశాఖల కృషిని దాపరికం లేకుండా మెచ్చుకున్నారు. ఇదంతా చాలా ఖర్చుతో కూడినదైనప్పటికి ఇది దేశానికెంతో ఉపయోగకరమైనదని కనుక దీనికయ్యే ఖర్చును వ్యతిరేకించేవారు సంకుచిత హృదయులు" అని అన్నాడాయన. గవర్నర్‌గా, ప్రజాధనం నుంచి దీనికి నిధులను అందజేయడం కష్టంగావుంది కనక, యూనివర్శిటీ విస్తరణ కార్యక్రమాలను ఆచి తూచి మాత్రం చేపట్టాలని సలహా ఇచ్చాడు. "పట్టభద్రోపరివిద్యకు కౌన్సిల్‌ని ఏర్పాటుచేయడం ఈ యూనివర్శిటీ ఇటీవలి కాలపు చరిత్రలో అతి ముఖ్య ఘట్టం. అప్పుడు నేను రెక్టర్‌గా ఉండేవాణ్ణి. ఈ పథకాన్ని హృదయపూర్వకంగా సమర్థించాను. ఎందుకంటే, కలకత్తాలో ఈ యూనివర్శిటీ ఆధ్వర్యంలో ఒక నికార్సయిన జ్ఞాన సముపార్జనా కేంద్రం వ్యవస్థాపనకీ ఈ దేశపు పురాతన సంస్కృతిని పునరుజ్జీవింపచేయడానికీ ఉద్దేశించింది ఈ కౌన్సిల్ ఏర్పాటు. ప్రఖ్యాత భారతీయ విశ్వవిద్యాలయాలు (ఉదాహరణకి నలంద వంటివి) నా స్ఫురణలో ఉన్నాయి. భారతసామ్రాజ్యంలో అత్యధిక జనాభా గల ఈ మహానగరంలో ఒక నవీన నలంద మొలకెత్తుతున్నట్టు నాకు దృగ్గోచరమైంది". ఉన్నత విద్య అనేది అసలు అవసరం అని సామాన్యుడు ఎందుకు అనుకుంటాడో వివరంగా చెప్పి తన ఉద్దేశంలో అది సంకోచిత భావం, అన్నాడాయన. "పట్టభద్రోపరిశాఖల కృషి కేవలం అందులో పాలు పంచుకున్న కొద్దిమందికే ప్రయోజనకారి అనుకోకూడదు. అది ఋజువైన దృష్టికాదు. ఈ విద్య ఫలితాలు యావద్దేశం మీద తమ ప్రభావాన్ని చూపుతాయి. మానవ విజ్ఞానానంతటిని సమీకరించడం అనే పరమోత్తమమైన విధి విశ్వవిద్యాలయానికి ఉందని అనేకులు చెపుతారే; ఆ విధి ఈ పట్టభద్రోపరి విద్యాశాఖవల్లనే నెరవేరాలి. మాట వరసకి, శాస్త్రపరిశోధన

ద్వారా కనిపెట్టిన భూంశాలు జాతీయ సంపదను ఇనుమిక్కలిగా పెంచగల వన్నది మరువకూడదు. మానవ మేధ ప్రగతికి తనదంటూ ఏ సమర్థ్య చూపనని జాతి ఏదీకూడా ప్రపంచపు ముఖ్య జాతులలో ప్రముఖమైన స్థానాన్ని పొందగలదని నేను అనుకోను."

(ఆ రోజు) ఆయన మాట్లాడిందంతా అశుతోష్ సేవలకు పరిపూర్ణ మైన సమర్థనే. అలా సమర్థిస్తూనే ఆయన. "మరి. ఒక పేదదేశంలో, ప్రభుత్వ నిధుల నుంచి ఇలాంటి విద్యార్జనకి ఎంతవరకు ధన సహాయం చెయ్యవచ్చు అనే విషయంలో కొన్ని నిర్దుష్టమైన పరిమితులున్నాయి కదా. యూనివర్శిటీకి ప్రస్తుతం ఉన్న ఇబ్బందుల దృష్ట్యా కొంత అదనపు సదుపాయం చెయ్యడానికి శాసనసభ సుముఖంగా ఉండగలదని నేను ఆశి స్తున్నాను. కాని ఎంతచెట్టు కంత గాలి అన్నట్టు అసలే తక్కువ వనరులున్న శాసనసభ కూడా ప్రస్తుతం కొన్ని అత్యవసర సమస్యలతో సతమత మౌతోంది. ఈ పరిస్థితుల్లో నాకొకటి అనిపిస్తున్నది, ఈ యూనివర్శిటీలో పట్ట భద్రోపరి శాఖలున్నాయి. వాటిలో ఎన్నో విషయాయి బోధిస్తున్నారు. అన్నిట్లోనూ పరీక్షలు జరిపి డిగ్రీ లిస్తున్నారు. అయితే, అన్ని విషయాల లోనూ బోధన ఏర్పాటు చెయ్యక తప్పదా అనేది యూనివర్శిటీ ఆలోచించాలేమో".

శాసనసభ యూనివర్శిటీకి అదనంగా ఏమీ యివ్వలేదు. 1922-23 బడ్జెట్‌లో డక్కా యూనివర్శిటీకి తొమ్మిది లక్షలు కేటాయించి కలకత్తా యూనివర్శిటీకి ఎప్పుడూ ఇస్తున్న ఒక లక్షా నలభై ఒక్కవేలు మాత్రం ఇచ్చేరు. 1923 మార్చి 1వ తేదీన విద్యా మంత్రి ప్రవాస్ చంద్ర మిత్రా బెంగాల్ శాసన మండలిలో ఉపన్యసిస్తూ, • గతంలో అనాలోచితంగా యూనివర్శిటీని పెంచుకుంటూ పోవడమే ప్రస్తుతం అక్కడ ఐదు లక్షల రూపాయల లోటుకి కారణమని ప్రకటించి. యూనివర్శిటీలో ఆర్థిక వ్యవహార దక్షత ఘోరంగా వుందని అధిక్షేపించాడు "కలకత్తా యూనివర్శిటీ పాలకులు పట్ట భద్రోపరిశాఖల విస్తరణపై ఏర్పడిన ఉత్సాహంవల్ల ప్రేరేపితులయ్యారు. భారతప్రభుత్వం ఏదో ఇచ్చేస్తుంది కదా అనే ఆశతో ఇలాంటి వాట్లో తెగించి ముందడుగు వేసెయ్యడం సరైన ఆర్థిక విధానం కాదని వాళ్ళు గుర్తించి ఉండవలసింది. విస్తరణపై ఉత్సాహంలో దీని వెనక వుండే ఆర్థిక సమస్యను

పట్టించుకోక పోవడం శుద్ధ ఆలోచనా విహీనత. ఈరాష్ట్రంలోనే కాక, యావద్భారతదేశం లోనూ మేధావులలో ఒకరైన ఈ యూనివర్సిటీ ప్రస్తుత వైస్‌ఛాన్సెలర్ (సర్ అశుతోష్ ముఖర్జీ) నా సలహాలోని వివేకాన్ని గ్రహించ గలరనడానికి నాకు సందేహం లేదు. ఆయన గట్టిగా తల్చుకుంటే కలకత్తా యూనివర్సిటీ పరిస్థితి కొంత మెరుగవుతుందని నానమ్మకం".

1922 మార్చి 18న జరిగిన స్నాతకోత్సవ ఉపన్యాసంలో అశుతోష్, పట్టభద్రో పరిశాఖను పూర్తిగా సమర్థించాడు. ఈ యూనివర్సిటీలో బోధనా శాఖల ఏర్పాటు అసలు 1904లో వచ్చిన "ఏక్టఆఫ్ ఇంపీరియల్ లెజిస్లేచర్" ననుసరించి జరిగిందని, పట్టభద్రోపరి శాఖల్లో బోధన 1917లో ప్రభుత్వ అనుమతి తోనే సమీకరించబడిందని అతను ఎత్తిచూపాడు. ఒక్కొక్క శాఖనే పేర్కొంటూ దానిమీద అవుతున్న ఖర్చు సక్రమ మైనదేఅని సమర్థించాడు. ఈ యూనివర్సిటీ విషయంలో, విస్తరణ పథకాలేవీకూడా యాదృచ్ఛికంగానో కాకతాళీయంగానో జరిగినవి కావని అతను నొక్కి చెప్పాడు. "జాతీయ జీవనంలో విశ్వవిద్యాలయాల నిజమైన ధర్మం ఏమిటీ అనే ఖచ్చితమైన భావన ఆధారంగా అవన్నీ నెలకొన్నాయి. ప్రజల స్వేచ్ఛకు, ఆరోగ్యానికి, సంపదకు యూనివర్సిటీ చేయగలిగింది చాలావుంది. లా, ఇంజినీరింగ్, కామర్స్ లాంటి విషయాల నుంచి ఆర్కిటెక్చర్, బ్యాంకింగ్, జర్నలిజం, పబ్లిక్ అడ్మినిస్ట్రేషన్ వరకు మనకిప్పుడున్న మేధా సంబంధమైన ప్రవృత్తులలో కర్మచారులుగా ప్రజాభి ప్రాయాన్ని ప్రతిబింబించగల నాయకులుగా తమ విధులను సమర్థంగా నిర్వహించగల విద్యావంతులైన యువతీ యువకుల వాహినులను సమాజంలోనికి పంపడం యూనివర్సిటీ విధి. అవిధంగా, సర్వతోముఖాభివృద్ధి కోసం, దేశానికీ జాతికీ సేవ చెయ్యడానికి ఉద్దేశించిన యూనివర్సిటీని; ఏదో కొన్నివిషయాలు మాత్రమే బోధపరచమని, పరిమితులు విధించ కూడదు"

1922 ఆగస్టు 23వ తేదీని బెంగాల్ ప్రభుత్వం యూనివర్సిటీకి రెండు లక్షల యాభై వేల అదనపు గ్రాంటును ఇస్తామని తెలిపింది. కాని ఈ గ్రాంటు ఎనిమిది షరతులకి లోబడి ఉంటుందని చెప్పింది. ఆ సెప్టెంబరు 9వ తేదీని ప్రభుత్వ ఉత్తరువు. దాంట్లో షరతులు పరిశీలించే నిమిత్తం, అశుతోష్ ముఖర్జీ అధ్యక్షుడుగా ఒక కమిటీని సెనేటు నియమిం

చింది. కమిటీ నివేదికను డిశంబరు 2వ తేదీ సమావేశంలో చర్చించింది. సెనేటు. నివేదికను అమలు పరచే ప్రతిపాదనను ప్రవేశపెడుతూ కమిటీలో సభ్యుడైన ప్రొఫెసర్ పి. సి. రే. ఇలా అన్నాడు:— ప్రభుత్వం (వారు వ్రాసిన) ఉత్తరం ఒకసారి చూస్తే. యూనివర్సిటీకి ప్రస్తుతం వున్న ఆర్థిక సంకట పరిస్థితిని ఉపయోగించుకుని. 1904వ సంవత్సరపు ఇండియన్ యూనివర్సిటీల చట్టంలో లేని పద్ధతిలో ప్రభుత్వం యూనివర్శిటీ మీద అధికారం చలాయించడానికి తలపెట్టిందన్న నిశ్చయానికి వస్తాం. ఈ షరతులన్నీ కూడా మనల్ని ఎంతో హీనపరచేవిగా ఉన్నాయి. ఇవి మన ఆత్మగౌరవాన్ని పొదుపు మాటలతో అవమాన పరుస్తున్నాయి. (ఇవన్నీ దిగమింగి ఈ గ్రాంటును పుచ్చుకొనే కంటె), మనం ఈ సంస్థను మూసేసి, యూనివర్సిటీ గేట్లకి తాళాలువేసేసి, సహాయం అర్థిస్తూ దేశంమీదికి బయలుదేరడం మంచిదని నాకు అనిపిస్తోంది. మన జాతి పురోగమన క్షితిజ రేఖ దగ్గర ఒక తీవ్రమైన ఆపద, పొడసూపుతున్నది. ఇది ఒక జాతీయ విపద్భయం. ఇలాంటప్పుడే మన నిలదొక్కుకోవాలి. మన ఉన్నత సంప్రదాయాన్ని ఒక గుక్కెడు గంజికి అమ్ముడు పోకుండా చూసుకోలి.

హోవెల్స్ అనే ప్రిన్సిపాల్ ఈ అభిప్రాయాన్ని సమర్థిస్తూ అన్నాడు:.... "ఆదాయాన్ని మించి ఖర్చు పెట్టడమనేది ఏ సంస్థకయినా మంచి పద్ధతి కాదనడంలో సందేహం లేదు, ఇది వ్యక్తులకు, సంస్థలకు ప్రభుత్వాలకు కూడా వర్తిస్తుంది. మరి, బెంగాల్ ప్రభుత్వానికి ఎనభై ఏడు లక్షల లోటుందని మనకు తెలుస్తోంది. అదలా వుంచుకుని (ప్రభుత్వం) మనదగ్గర కొచ్చేటప్పటికి పెద్దరికం తెచ్చుకుని మనకి కొద్ది లక్షలు లోటుందని, మనం ఆదాయాన్ని మించి ఖర్చు చెయ్యడం తప్పు అంటూ నీతులు చెబుతోంది. దీనికి మానవ సహజమైన జవాబుఒక్కటే "డాక్టరుగారూ! ముందు మీ ఆరోగ్యం సరిగా చూసుకోండి!' అన్నట్టుగా చెప్పడమే. దీనికి గాని మనం లొంగామంటే ఒక యూనివర్సిటీగా మన మీద ఉంచిన విశ్వాసాన్ని వమ్ముచేసినట్టే!" .... ఈ సందర్భంలో సర్ అశుతోష్ ప్రసంగం గొప్పది! "నాలో ఒక్కనెత్తురు బొట్టు మిగిలినంతవరకు యూనివర్సిటీకి జరుగుతున్న ఈ అవమానాన్ని సహించనని ఇదే చెబున్నాను! యూనివర్సిటీ అంటే బానిసల్ని ఉత్పత్తి చేసే కర్మాగారం కాదు. మనం కోరేది

నిష్కపటంగా ఆలోచించడం, మనం బోధించేది స్వేచ్ఛ. భావితరంలో ఉన్నతమైన ఉదారమైన ఆలోచనలూ అభిప్రాయాలూ కలిగించే ఒకానొక ప్రేరేపణను మనం సమకూర్చాలి. మనమేమీ ప్రభుత్వపు సచివాలయం లోని ఒక విభాగం కాదు. వాళ్ళిప్పుడిస్తామంటున్నది వార్షికంగా కొంత కాలం పాటు ఇచ్చే గ్రాంటు కాదు, శాశ్వతమైనది అసలేకాదు. ఎంతండీ, ఇస్తామంటున్నారు? రెగడున్నర లక్షలా? ఈ మాత్రం దానికి మన స్వేచ్ఛను విక్రయించాలా?....నా మట్టుకు నాకు, ఈ చేత్తో ధనం, ఆ చేత్తో బానిసత్వం అందిస్తే పోపొమ్మంటాను. మనం ఈ డబ్బు తీసుకోవద్దండి. కొంత మందిని తొలగించి, ఉన్నదాంట్లో సరిపెట్టుకుందాం. బెంగాల్‌లో ప్రతి గ్రామానికి వెళ్ళి బెంగాల్ జనావళి ఆత్మను మేల్కొలుపుదాం. సామర్థ్యం కల రాష్ట్రం యిది. అతి ముఖ్యమైన విద్యాపీఠం మనది. దీని పోషణ తమ బాధ్యత అని బెంగాల్ ప్రజలు గుర్తించేటట్లు చేద్దాం .... ... మన పట్ట భద్రోపరిశాఖల అధ్యాపకులు పస్తులైనా ఉంటారు గాని వాళ్ళ స్వేచ్ఛను మాత్రం బలిపెట్టరు. సెనేటు సభ్యులైన మిమ్మల్ని, యూనివర్సిటీ హక్కుల పరిరక్షణ కోసం కలిసికట్టుగా నిలబడమంటున్నాను. బెంగాల్ ప్రభుత్వాని కేమిటి, ఏదైనా అంటుంది; అదంతా మరిచిపోండి. భారత ప్రభుత్వం సంగతి కూడా మరిచిపోండి. ఈ యూనివర్సిటీ సెనేటరుగా, మన విద్యాపీఠం పుత్రులుగా, మీ విధిని నిర్వహించండి. మనకి కావలసిం దేమిటి, మొట్ట మొదటిది స్వేచ్ఛ; రెండోది? స్వేచ్ఛ! మూడోటికీ స్వేచ్ఛే — ఇంకేది మనకి తృప్తినివ్వదు".

ప్రభుత్వం దిగొచ్చింది. సరే; షరతులేం లేవు; రెండున్నర లక్షలు ఇస్తున్నాం: అన్నది. వైస్ ఛాన్సెలర్ మహాగణకులను సంప్రదించి యూనివర్శిటీ అకౌంట్లను పునర్వ్యవస్థీకరిస్తే చాలునన్నది.

యూనివర్శిటీ (సంకట) పరిస్థితి 1923లో ఇంకా కొంచెం విషమిం చింది. తీవ్రమైన ఆర్థిక ఇబ్బందులలా వుండగా; యూనివర్శిటీని అంత కంటె తీవ్రంగా దెబ్బతీయగల శాసన ప్రతిపాదనల విపత్ప్రయం వచ్చి పడ్డది. ఈ ఏడాది మొదట్లో, యూనివర్శిటీ ఛాన్సెలర్ లార్డ్ లిటన్, వైస్ ఛాన్స్‌లర్ అయిన అశుతోష్‌కి, యూనివర్శిటీలో కొన్ని సంస్కరణ లను, బోర్డాఫ్ సెకండరీ ఎడ్యుకేషన్ ఏర్పాటును సూచిస్తూ వచ్చిన రెండు

బిల్లుల కాపీలను రహస్యంగా పంపాడు. ఈ బిల్లులను పరిశీలించి ఒక వివేదికను సమర్పించే నిమిత్తం సెనేటు జనవరి 23వ తేదీని సమావేశం అయి, అశుతోష్ అధ్యక్షుడుగా ఒక కమిటీని వేసుకుంది. ఈలోపుగా వచ్చిన మరి రెండు బిల్లులను కూడా సెనేటు పరిశీలనకు స్వీకరించింది. వీటివి, బెంగాల్ శాసన మండలిలో అనధికారవర్గ సభ్యులు (సురేంద్రనాథ్ మల్లిక్, యతీంద్రనాథ్ బసు) రూపొందించారు. ప్రభుత్వం నుంచొచ్చిన బిల్లుల విషయాలు, ఆయా ప్రతిపాదనలను ముందుగా ప్రజలకు తెలియ జేయడం అవసరమని సెనేటు తన అభిప్రాయాన్ని ఛాన్సెలర్‌కు తెలియ పరచింది. అనధికార వర్గం నుంచొచ్చిన బిల్లులు "రాజకీయ సంబంధివి తప్ప, విద్యా విషయకమైనవి కాదు; అని సెనేట్ ప్రకటించింది. "విద్యా మంత్రికి యూనివర్శిటీ వ్యవహారాలమీద పెత్తనం సాధించడమే" వీటి ధ్యేయం అని సెనేటు అభిప్రాయ పడింది. మొత్తంమీద నాలుగు బిల్లులూ కూడా; శాడ్లర్ కమీషన్ శిఫార్సులకు మూలం నుంచే దూరమయ్యాయని కూడా సెనేటు అభిప్రాయపడింది. అదంతా అలా వుంచి, ఈ నాలుగు బిల్లులూ కూడా యూనివర్శిటీకి ఆర్థిక సహాయం విషయంలో ఏవిధమైన ఏర్పాటూ చెయ్యలేదని; అందువల్ల ప్రజలు అభ్యంతరం తెలిపే అవకాశం కలవిగా ఉన్నాయి (అని సెనేటు తలచింది.)

అశుతోష్ ఈకాలమంతా దైహికంగా, మానసికంగా, గొప్ప క్షోభకు గురైనాడు. ఇటు యూనివర్శిటీలో లెక్కలేనన్ని మీటింగులు; అటు ఛాన్సెలర్ లార్డ్ లిటన్‌తో యూనివర్శిటీ వ్యవహారం సంగతి సందర్భం సరైన వివరం—తెలుపడంలో ఉత్తర ప్రత్యుత్తరాలు. సరిగ్గా ఈ సమయంలోనే అతనికి ఎంతో ప్రీతిపాత్రురాలైన కుమార్తె కమల మరణం అతని హృదయాన్ని ఛిద్రం చేయడం.

1923 ఏప్రిల్ 3వ తేదీతో అశుతోష్‌కి (వైస్ ఛాన్సెలర్) టరమ్ పూర్తి కావలసివుంది. ఆ ఏడాది మార్చి 24వ అతను చివరి సారిగా యూనివర్శిటీ స్నాతకోత్సవంలో ప్రసంగించాడు. యూనివర్శిటీ ఎన్నో అవిశ్చిత విపత్కర పరిస్థితులు నెలకొన్నప్పటికీ, వాటికి అతీతంగాను యూనివర్శిటీ వ్యతిరేకులు దిగ్భ్రాంతి చెందే విధంగాను అక్కడ సవి ఎంత స్థిరంగా సాగుతున్నదో అతని ఉపన్యాసంలో వర్ణించాడు; తీవ్రాతితీవ్రమైన

ఆర్థిక ఇబ్బందుల మధ్యకూడా యూనివర్శిటీలోని ప్రతి శాఖలో అధ్యాపకులు తమ విధులను విజయవంతంగా నిర్వహించారు. వారందరికీ యూనివర్శిటీలో ఉద్యోగాలు తప్ప వేరే ఆదాయమిచ్చే వ్యావృత్తులు లేవు. ఐనా సరే, వాళ్ళు ఇష్టపూర్వకంగా తమ వేతనాల్లో చెప్పుకోదగ్గ భాగాలను, తర్వాత ఎప్పుడో తీసుకోవచ్చులే అని విడిచిపెట్టారు. యూనివర్శిటీలో పనిచేస్తూ ఇతర కాలేజీలతో (అధ్యాపక) సంబంధం ఉన్నవాళ్ళు, లేక వేరే విధమైన ఆదాయం ఇస్తున్న వ్యావృత్తుల వారు, అసలు ఏ విధమైన పారితోషికం పుచ్చుకోకుండానే ఇక్కడ సంపూర్ణ అంగీకారంతో పని చేసేరు. వీళ్ళందరి లోకీ మకుటాయమానులుగా ప్రొఫెసర్ ప్రఫుల్లచంద్రరేగారున్నారు. ఆయన ఏకంగా అయిదేళ్ళ పాటు తన జీతం జీతమంతా కూడానూ యూనివర్శిటీకే వదిలేశారు!......... దీనికంతటికీ మిక్కిలి విశ్వాసంతో కృతజ్ఞతలు చెప్పడం నాకెంతో ఆనందదాయకమైన విధి". పరిశోధనా రంగంలో యూనివర్సిటీ అధ్యాపకుల కృషి సంతృప్తికరమైన ప్రగతిని సాధించినందుకు అశుతోష్ తృప్తి చెందారు. వారిలో అయిదుగురికి డాక్టరాఫ్ సైన్సు డిగ్రీ, నలుగురికి డాక్టరాఫ్ ఫిలాసఫీ డిగ్రీలు లభించాయి. యూనివర్శిటీ అధ్యాపకులు పరిశోధక విద్యార్థులు ప్రపంచంలో అన్ని దేశాల పత్రికలకు వ్యాసం మీద వ్యాసంగా పంపుతూనే ఉన్నారు।

యూనివర్శిటీకి స్వతంత్ర ప్రతిపత్తి ఉండవలసిన అవసరం గురించి మాట్లాడుతూ, బ్రిటన్‌లోని యూనివర్శిటీలపై రాయల్ కమిషన్; అలహాబాదు యూనివర్శిటీ ఛాన్సెలర్‌గా సర్ హార్‌కోర్ట్ బట్లర్; రంగూన్ యూనివర్శిటీ ఛాన్సెలర్‌గా సర్ రెజినాల్డ్ క్రాడక్; వెలిబుచ్చిన అభిప్రాయాలను ఉదాహరించారు. గ్లాస్గో యూనివర్శిటీ ఛాన్సెలర్‌గా ఎర్ల్ ఆఫ్ రోజ్‌బెరీ చేసిన స్మరణీయ మైన ప్రసంగంలోంచి కొంత భాగాన్ని ఉదాహరించారు:- "మా వరకు మేం ప్రభుత్వాన్ని ఎక్కువ అడిగిందీలేదు, పుచ్చుకున్నదీ లేదు। అయినా, ప్రభుత్వమే మాటిమాటికీ - రండి రండి, మా సాయం మీ కెప్పుడూ వుంటుందని ఆహ్వానిస్తూ వుంటుంది. నాకేవో అస్పష్టమైన గుసగుసలు వినిపిస్తూ వుంటాయి. (ఇలాగ) :— 'దృఢంగా వున్నావే! ఫర్వాలేదు, మేంఉన్నాం నీ నడుం విరక్కొట్టడానికి! కళ్ళు కనపడుతున్నాయా? ఒద్దొద్దు; అంధుడివి కా; బావుంటుంది! సరిగ్గా వినగలుగుతున్నావా? హుం!! చెవిటివాడివిగా

ఉండు; బాగుపడతావు। నడవగలుగు తున్నావా? ........ ఎందుకయినా మంచిది, అంత దూకుడు మానెయ్యి. ఇదిగో ఓ చేతికి చంక కర్ర। ఇది కాని అలవాటయితే రెండోదీ కావలసి వస్తుంది. శుభస్య శీఘ్రం।"........ శిక్షణకు మనం అవలంబించే సూత్రం ఉన్నతి, ఇంకా ఉన్నతి— అయితే; అధునాతన నాగరికత పిలుపు - అధోగతి, ఇంకా అధోగతి; ప్రభుత్వం ప్రతి దాంట్లోనూ వేలు పెడుతుంది; తొంగి చూస్తుంది; శోధిస్తుంది; సాధిస్తుంది।

సాక్షాత్తు స్వరాజ్యానికి పుట్టినిల్లు అయిన ఆ దేశంలోనే, బ్రిటిష్ సామ్రాజ్యంలో అత్యున్నత స్థానం పొందిన ఒక వ్యక్తికే ఇలాంటి అభిప్రాయం వుందీ అంటే; ఈ దేశంలో మనం ప్రభుత్వ ధర్మకర్తలను చూసి భయపడ్డంలో ఆశ్చర్యం లేదు. ప్రభుత్వ విధుల ధర్మకర్తలు మన విషయంలో చేసినట్టే, పాటించడానికి సాధ్యంకాని షరతుల్ని విధించవచ్చు. పరిపూర్ణమైన స్వతంత్ర ప్రతిపత్తి సాధించగలిగితే అదే ఒక అమూల్యమైన సంపద అని గుర్తించడానికి ఆసక్తి గలిగివుంటే యూనివర్శిటీలు ప్రభుత్వం ఇలాంటి షరతుల్ని ఏ రూపంలో విధించినా తీవ్రంగా ప్రతిఘటించాలి. ఒక జాతిగా విద్యార్జనే మన ధ్యేయం అని అనుకుంటే, అదే మన రాజకీయం మాత్రం కాకూడదన్న సూత్రానికి మనం అరమరిక ల్లేకుండా కట్టుబడి వుంటాం. విద్యకి స్వాతంత్ర్యమే ప్రాణం. విద్య ఉన్నతికి స్వాతంత్ర్యమే ఆధారం. ఆఖరికి విద్య విజయంలో మర్మం కూడా స్వాతంత్ర్యమే. తన కడసారి స్నాతకోత్సవ ఉపన్యాసం ముగిస్తూ అశుతోష్ ఆ పట్టభద్రుల నుద్దేశించి పలికిన ఈ మాటలు కొన్ని తరాల మనసుల్ని కదిలిస్తాయి. "మీ అదృష్టం ఏ రంగంలోనైనా ఉండనీ, జీవితంలో మీ ఆశలూ భయాలూ ఏమవనీ, మీ విద్యా పీఠంమీద భక్తి, శ్రద్ధ, అభిమానం నిలబెట్టుకోండి. కావిళ్ళు వస్తాయి, పోతాయి. మంత్రిత్వాలు మొగ్గ తొడుగుతాయి, తుంచుకుపోతాయి. పార్టీలు ఉద్భవిస్తాయి, మాయమై పోతాయి; లేకపోతే వాటి స్వభావాన్ని మార్చుకొని ఏదోలా బతికేస్తాయి. కాని ఈ యూనివర్శిటీ మన అందరిదీనూ. వేల సంఖ్యలో లక్షల సంఖ్యలో ఈ యూనివర్శిటీ బిడ్డలు కష్టంలో సుఖంలో అచంచలమైన భక్తి విశ్వాసాలతో అండగా నిలిస్తే ఇది శాశ్వతంగా నిలుస్తుంది. జీవిస్తుంది. ఎందుకంటే, ఈ యూనివర్శిటీ

ఉజ్జ్వల భవిష్యత్తు మీద నాకు చెక్కుచెదరని విశ్వాసంవుంది. తరాల తర బడివి ఈ ప్రజానీకపు విభిన్నమైన అవసరాలకు అనుగుణంగా తనని తాను, సిద్ధం చేసుకుంటూ జాతిసేవకు అంకితం కాగలదు కనుక ఇది తప్పక ఒక జాతీయ సంస్థకాగలదు.

స్నాతకోత్సవం నుంచి ఇంటికి వెళ్ళేసరికి, అక్కడ లార్డులిటన్ రాసిన ఉత్తరం ఒకటుంది. ప్రభుత్వాన్ని వ్యతిరేకించే వైఖరికి స్వస్తి చెప్పి హృదయపూర్వక సహకారాన్ని అందిస్తానని ఒక హామి ఇమ్మని లార్డ్‌లిటన్ అశుతోష్‌ని కోరాడు. అలాగే చేస్తే, మరొక టరం పాటు అశుతోష్‌ను వైస్‌ఛాన్సెలర్‌గా పునర్నియమించే ఏర్పాటు చేయగల నన్నాడు. "బెంగాల్‌లో ఉన్నత విద్యా ప్రయోజనానికీ యూనివర్శిటీకి కూడా మీ శక్తి సాధనలు మిక్కిలి విలువ కలవిగా నేను భావిస్తున్నాను. కనుక మిమ్మల్ని ఈ పదవిలో ఉంచాలని నా ఆదుర్దా. కాని యూనివర్శిటీకి ఏదో మేలు చేస్తున్నాననే నమ్మకంలో పడి ఆశక్తినీ (విజయ) సాధనను ప్రభుత్వానికి వ్యతిరేకంగా ఉపయోగిస్తే మటుకు మీరు ఆ పదవిలో కొనసాగడం అసాధ్యమవుతుంది." అని లార్డ్‌లిటన్ వ్రాశాడు.

ఆ తరువాత ఆ ఉత్తరంలో ప్రభుత్వపు ఉద్దేశాలకు ఆదర్శాలకు తప్పుడు అర్థాలను వివరించాడని, ప్రభుత్వాన్ని అగౌరవపరిచే వ్యాసాలు పత్రికల కిచ్చాడని అశుతోష్ మీద ఆరోపణలు చేసేడు. సర్‌మైకేల్ శాడ్లర్‌కి, భారత ప్రభుత్వానికి, అస్సాం ప్రభుత్వానికి మన బిల్లును వ్యతిరేకించ మని విన్నపాలు చేశారు. మీరు ఇదంతా కూడ ప్రభుత్వానికీ యూనివర్శిటీకి మధ్య సహకార వాతావరణాన్ని పెంపొందించమనికి ఒకసాటిఉద్యోగి చేసినవి కాకపోగా, ఆ రెండిటి మధ్య సంబంధాల పొందుకు వ్యతిరేకిగా చేసినవి. సరే ఇప్పుడు వైస్‌ఛాన్సెలర్ పదవిఖాళీని మళ్ళీ నింపాల్సిన ఈ తరుణంలో, ఈ వ్యతిరేక భావాన్ని ఒకానొక హృదయ పూర్వక సహకారంగా మార్చు కొంటానని నాకు హామీ ఇస్తారని మిమల్ని ఆహ్వానిస్తున్నాను."

ఈ ఉత్తరం, ఎంత లేదన్నా, కేవలం, దురభిప్రాయంతో వ్రాసి వది. లిటన్ గారికి అశుతోష్ స్వభావం గురించి చాలా తక్కువ తెలుసు అని దీనివల్ల రుజువవుతోంది. లేకపోతే ఆతన్ని నాలుగు చివాటు పెట్టి

ఎలాగో లౌంగరీసికుని వైస్‌ఛాన్సెలర్ పదవిని ఆశ చూపించి అతని సహాయ సహకారాలను కొనేసు కుందామను కోవడం అనేది అర్థంకాని విషయం.

రెండు రోజుల్లో అశుతోష్ లిటన్‌కి తగిన సమాధానాన్ని పంపాడు. ప్రభుత్వబిల్లులను వ్యతిరేకించుమని అస్సాం ప్రభుత్వానికి, సర్ మైకేల్ శాడ్లర్‌కి విన్నపాలు చేసినట్లు ఆరోపణ గురించి అశుతోష్ యిలారాశాడు: బిల్లులో అంశాలు చర్చించడానికి సెనేట్‌లోని ప్రతి సభ్యుడికి అవకాశం యివ్వాలని నేను నిర్ణయించాను. అస్సాం గవర్నరుగారు, గవర్నరు జనరల్ గారి కౌన్సిల్లో విద్యాశాఖకు అధిపత్యం వహించిన సభ్యుడు, అస్సాం విద్యాశాఖ మంత్రిగారు, అస్సాం డైరెక్టర్ ఆఫ్ పబ్లిక్ ఇన్‌స్ట్రక్షన్, వీరందరు కూడ సెనేటు సభ్యులే అని మీకు తెలుసు. బిల్లుకి సంబంధించిన గోప్యమైన పత్రాలు యిందులో ప్రతి ఒక్కరికి పంపబడ్డాయి. అలావాళ్ళకి ఆ కాగితాలు పంపి ఉండక పోతే వాళ్ళకి నామీద అకారణంగా సజావైన ఆగ్రహానికి అవకాశం కలిగేది. అప్పుడే మయ్యేది? ఆ విషయంలో వాళ్ళకి ఏది సక్రమమైనదనిపిస్తే దానికి చర్యలు తీసికొనేవారు, అంటే, మీ ప్రభుత్వం నిర్ణయం మీద ప్రతికూలమైన అభిప్రాయాన్ని ఏర్పరచుకొనే వారు, మీరు దానికి చింతించేవారు కాని అలాంటప్పుడు మీరు (ఇలాంటి) ఫిర్యాదు చేయడానికి ఆస్కారం మాత్రం ఉండేది కాదు.

తాను అధ్యక్షత వహించిన కమిషన్ చేసిన శిఫార్సులను, సెనేటు సలహాను తన సలహానుకూడ ప్రభుత్వం తోసి పుచ్చిందని మైకేల్ శాడ్లర్‌కి అశుతోష్ తెలియ పరచాడు. కాని అదంతా ప్రజాసామాన్యం అందరికీ తెలిసిపోయిన సంగతే. ఇదంతా యూనివర్సిటీకి దేశానికి మంచి క్షేమమే. ప్రభుత్వాన్ని అగౌరవ పరిచే వ్యాసాలను పత్రికల కివ్వడం అనే ఆరోపణ సంగతి ప్రస్తావిస్తూ అశుతోష్ ఈవిధంగా తన అసమ్మతిని వెలి బుచ్చాడు. "ఇది కేవలం దూషణ. ఈ నిరాధారమైన ఆరోపణని సమర్థించే సాక్ష్యం చూపించుమని నేను సవాలుచేస్తున్నాను! "తన విమర్శలు నిర్మాణాత్మ కంగా కాక వినాశనకరంగా వున్నవన్నఆరోపణను అతను అంగీకరించాడు. "అవును. నా విమర్శలు ఆ బిల్లులో ఉన్నసూత్రాలకు వినాశన కరమైనవే. నాకు అలాగే అనిపించింది. సెనేటులో వున్న నాసహసభ్యులకు కూడ అవి

చాలా అభ్యంతరకరంగా అనిపించాయి. ఎందుకంటే అవన్నీ విద్యా విషయక మైన దృక్పథంతో కాక రాజకీయ దృష్టితో తయారు చేసినవి కనక. ఛాన్సెలర్‌కి తాను సహాయకారిగా లెడన్న ఆరోపణను అతను ఖండించాడు. "నా మట్టుకు నేనెప్పుడూ మీకు నా సలహాలనూ సహాయాన్నీ అందజేస్తూనే వున్నాను. అయితే మీరు వాటిని అంగీకరించక పోవడం ఎందుకో మీకే బాగా తెలియాలి. నేను ఎన్ని ఇక్కట్లలో వున్నా సరే ఆ బిల్లులలోని సూత్రాల గురించి వివరంగా వ్యాఖ్యానాలు చేస్తూ మీకు ఉత్తరాలు మీద ఉత్తరాలు రాస్తూనే వచ్చాను. అయినా మీరు నా విమర్శలకు సమాధానం యివ్వడాని కెన్నడూ పట్టించుకోలేదు. పోని కమిటీ ఆ రెండు బిల్లుల మీద కూలంకష విమర్శ చేసి ప్పుడైనా మౌద్మకృధం మీద మీ రెన్నడూ మీ అభిప్రాయాలను వ్యక్తపరచలేదు. ఆ రిపోర్టుగురించి మీతో మాట్లాడడానికి నాకు మీరెన్నడూ అవకాశం యిచ్చిందే లేదు."

ఇదంతా రాసిన తరువాత, నువ్వు సరిగా ప్రవర్తిస్తే నిన్నింకొక టరమ్ వైస్ ఛాన్సెలర్‌గా నియమిస్తానంటూ వొచ్చిన అవమానకరమైన ప్రతి పాదనను తిరస్కరిస్తూ వ్రాశాడు. "మీ ఉత్తరంలో, నేనేదో ఆ వుద్యోగానికి దరఖాస్తు పెట్టుకున్నట్టూ, ఆ ఉద్యోగంలో పునర్నియామకం నే నాశిస్తున్నట్టూ ధ్వనించే మాటలున్నాయి. ఇదే చెబుతున్నాను, మీరూ మీ మంత్రివర్యులూ అలాంటి ఉద్దేశంతో గాని ఉన్నట్టయితే మీరు పప్పులో కాలేశారన్నమాటే. మిమ్మల్ని వ్యతిరేకించనని, మీకు హృదయ పూర్వక సహకారాన్ని, అందిస్తానని మీకు హామీయిమ్మని అడుగుతున్నారు. అంటే నేనీ ఉన్నత పదవి నిర్వహించిన ఈ పదేళ్ళపాటు పాటించిన సంప్రదాయాలు మీకేమీ అర్థం కాలేదన్నమాట (నేనేకాదు, ఇక్కడ వైస్‌ఛాన్సెలర్లుగా వుండిన వాళ్ళలో)చాలా మంది మన ఏలికపేరిట న్యాయాన్ని అందజేస్తామని ప్రమాణం చేసి పని చేసిన వాళ్ళే. ప్రభుత్వం వైస్ ఛాన్సలర్ పదవిని ప్రసాది స్తుంది. కనక వైస్ ఛాన్సెలర్లు అందరూ ప్రభుత్వం అభిప్రాయాలకి అను గుణంగా నడుచుకోవలసి ఉంటుందని వాళ్ళెవరితో నైనా అనుంటే వాళ్ళు విభ్రాంతపోయి వుండే వాళ్ళు. నేను పదవిలో ఉన్నంత కాలం నా పదవి నా నుంచి ఆశించిన సత్సంప్రదాయాలను పాటిస్తూనే వచ్చాను. అంతేకాని, ప్రభుత్వ అభిప్రాయాలకు అనుగుణంగా నన్ను నేను మలచుకోవాలని నా

కెన్నడూ అనిపించలేదు." అంచేత మీరూ. మీ సలహాదారులు ఆశించేది కోరేది అయిన నా సమాధానం .... మాన మర్యాదలు గల వ్యక్తి ఎవరైనా ఇచ్చే ఒకే సమాధానం .... ఇస్తున్నాను! .... .... .... మీరు చేసిన అవమాన కరమైన ప్రతిపాదనను త్రోసి పుచ్చుతున్నాను". అని ఆ ఉత్తరాన్ని ముగించాడు అశుతోష్.

కలకత్తా యూనివర్శిటీకి అశుతోష్ ముఖర్జీకి తరువాత వైస్ ఛాన్సెలర్‌గా భూపేంద్రనాథ్ బాసును ప్రభుత్వం నియమించింది. తను అధ్యక్షత వహించిన సెనేటు తొలి సమావేశంతో ప్రసంగిస్తూ కొత్త వైస్ ఛాన్సెలర్ అశుతోష్‌కి జ్యోత్యంజలి ఘటించాడు.

"మా కోసం ఈ దేవాలయాన్ని మీరు నిర్మించారు. నిర్వహణలో పొరపాట్లు ఏమైనా వున్నా, దీని భావన, పన్నుగడ మహత్తరంగా ఉన్నాయి. ఇది యావద్భారత దేశపు భావితరాల గౌరవాన్ని ప్రశంసను శాశ్వతమైన రీతిలో పొందగలదు. దీంతో సమానమైన ఉన్నతికి కొందరే ప్రయత్నించ గలరు; ఎవరూ అధిగమించలేరు. నేను స్వీకరించిన ఈ బాధ్యతా నిర్వహణలో మీ అడుగు జాడలను అనుసరించవలసిందే.

# 7. చివరి రోజులు

ఇప్పుడిక అశుతోష్‌ముఖర్జీ కలకత్తా యూనివర్శిటీకి వైస్ ఛాన్సెలర్ కాదు. అయినా, సెనేటు సభ్యుడుగా, సిండికేటు సభ్యుడుగా, ఆర్ట్స్ సైన్సులలో పట్టభద్రోపరి విద్యామండలుల అధ్యక్షుడుగా, యూనివర్శిటీ వ్యవహారాల్లో అతనికి ఇదివరకుండిన పలుకుబడి కొనసాగుతూనే వుంది. కడచిన కొద్ది మాసాలలో యూనివర్శిటీ పనివల్ల అతనికి కలిగిన దైహిక, మానసిక క్షోభ అతని ఆరోగ్యాన్ని బాగా దెబ్బతీసింది. ముఖ్యంగా ఈ పని అంతా అతను తీవ్రమైన వ్యక్తిగత ఖేదంలో వుండి కూడా నిర్వహించ వలసి వచ్చింది కనుక. 1923 జనవరిలో అతని పెద్ద కూతురు కమల చనిపోయింది. అశుతోష్‌కి ఈ అమ్మాయంటే పంచ ప్రాణాలూనూ. ఈ దురదృష్ట జాతకురాలి మృత్యువు వల్ల అతని ఆరోగ్యం బాగా క్రుంగి పోయింది. అయినా అదీ ఒక మంచికే జరిగింది. "మా ఇంటికే కాదు; తన ప్రభావ పరిధిలో కొచ్చిన అందరికీ జ్యోతి ఆమె" అన్నాడు అశుతోష్. "కమల — లెక్చరర్‌షిప్" అనే పేరిట ఒక ఉపన్యాస వేతనాన్ని వ్యవస్థా పించే నిమిత్తం యూనివర్శిటీకి అశుతోష్ ఆమె స్మృతిచిహ్నంగా నలభైవేల రూపాయల కానుక ఇచ్చాడు. ఈ ఉపన్యాస వేతనం పొందడానికి అర్హత యిది:- భారతీయ జీవితంపైన; లేక భారతీయ చింతన పైన ఏదో ఒక విషయం తీసుకుని దాన్ని గురించి సమగ్రంగా మూడు ఉపన్యాసాలకు మించ కుండా చెప్పాలి. ఈ ఉపన్యాస వేతనాన్ని ప్రథమంగా పొందినది అనీ బిసెంట్. భారతీయుల్లో ఈ గౌరవాన్ని శ్రీనివాసశాస్త్రి, సరోజిని నాయుడు, రవీంద్రనాథ్ టాగూర్, అబుల్ కలామ్ ఆజాద్, సర్వేపల్లి రాధాకృష్ణన్ వంటి ప్రముఖులు క్రమంగా పొందారు.

యూనివర్శిటీని వృద్ధిలోకి తేవడానికి అశుతోష్ ఇక మీదట ఏం చేస్తాడో అన్నదాని మీద అప్పట్లో బోలెడు ఊహాగానాలు. న్యాయమూర్తిగా పదవీ విరమణ చేసి సి. ఆర్. దాసుతో చేతులు కలిపి, వచ్చే ఎన్నికల్లో పోటీ చేసి ప్రభుత్వాన్ని చేజిక్కించుకోవడం స్పష్టంగా కనబడుతున్న ఒక

పద్ధతి. ఈ పుకార్లతో ప్రభుత్వానికి బెదురు పట్టుకుంది. అశుతోష్ మీద ప్రభుత్వోద్యోగుల ప్రవర్తనా నిబంధనావళిని వర్తింపజేయ వచ్చునేమో అని ప్రభుత్వ అధికారులు తమలో తాము గోప్యంగా చర్చించుకోసాగారు. అయితే, వాళ్ళదగ్గిరున్న సాక్ష్యం అంతా, చెవికొరుకుడుగా, తీసి పారెయ్య వచ్చునన్న భయం చేత వాళ్ళు అక్కడితో ఆగారు

ఆ ఏడాది (1923) ఆగస్టు 4న అశుతోష్ బెనారస్ హిందూ యూని వర్శిటీలో న్యాయ శాస్త్ర అధ్యయన శాఖ ప్రారంభోత్సవంలో ప్రసం గించాడు.

ఇంకా ఆర్నెల్లు సర్వీసుండగానే (1924 జనవరి 2వతేదీని) అనారోగ్య కారణంగా అశుతోష్ న్యాయమూర్తిగా పదవీ విరమణ చేశాడు. హైకోర్టు న్యాయమూర్తిగా ఆతను రెండు దశాబ్దాల పాటు పనిచేశాడు. అందులో 1920లో కొంతకాలం ప్రధానన్యాయమూర్తిగా ఉన్నాడు. వీడ్కోలు సభలో అశుతోష్‌కి గొప్ప ప్రశంసలు వచ్చాయి.

ఆ తరువాత ఐదు రోజులకి (1924 జనవరి 7వతేదీని) అశుతోష్ లక్నోయూనివర్శిటీ స్నాతకోత్సవ ఉపన్యాసానికి "మన యూనివర్శిటీ-మన జాతి" అనేది విషయంగా తీసుకుని ప్రసంగించాడు. లక్నో యూనివర్శిటీ అధికారులు, అశుతోష్ అక్కడ వున్నాడన్న అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని, స్నాత కోత్సవం సందర్భంగా కానింగ్ కాలేజి భవనంలోని బెనెట్ హాలులో-"మంత్రులు, (శాసన) మండలులు యూనివర్శిటీ పాలన మీద ఆధిపత్యం వహించడం ఈసభ దృష్టిలో సమంజసమే "అనే విషయం మీద ఒక చర్చ ఏర్పాటు చేసి అందులో పాల్గొన వలసిందిగా అశుతోష్‌ని కోరారు. ఈ సందర్భంగా అతను ఇలా అన్నాడు: "సక్రమ నిర్మాణంతో ఏర్పడిన పరిషత్తుల ద్వారా ప్రభుత్వం తన బహుముఖ విధులను నిర్వర్తించాలి. ఉన్నత విద్యపట్ల ప్రభుత్వానికి ఉండే విధిని; ఈప్రత్యేక ప్రయోజనం కోసం సముచితంగా ఏర్పరచబడ్డ విశ్వవిద్యాలయాల ద్వారా నిర్వర్తించాలి. యూనివర్శిటీకి ఒక రాజ్యాంగం అంటూ ఏర్పరచాక దాన్నలా స్వేచ్ఛగా వదిలేయాలి, ఆ రాజ్యాంగం విఫలమైతే శాసన సభ కల్పగజేస్తుకోవాలి

మారుస్తుంది. అంతేగాని; యూనివర్శిటీ అంటూ ఏర్పరచిన తరువాత, ఉన్నత విద్య అభివృద్ధి దానికి బాధ్యతాయుతమైన విధి అని ప్రభుత్వం దానికి వప్పగించాక; (సాధ్యం) అయిన దానికీ కానిదానికీ దాంట్లో వేలు పెట్టడం అనేది ఒప్పందానికి విరుద్ధం. ఆ స్థితి దుర్భరం। విద్యావిషయకంగాను, రాజకీయదృష్టిలోను; ఇక్కడే కాదు ఎక్కడైనా సరే-అలాంటి ప్రతిపాదన వుంటే దాన్ని తిరస్కరించమనే నే నంటాను రాజకీయ, అధికార రంగాల నుంచి ఆంక్షలు; మత సంస్థల పరంగా వొచ్చే ఆంక్షలు; సమాజం, పౌరులూ విధించగల బంధాలు మొదలైన పరాయి అధికారాలూ పెత్తనాలూ యూనివర్శిటీలను బాధించ కూడదు. అందుచేత, జాతి జీవనం సన్నిహిత సంబంధం కలిగివుండే యూనివర్శిటీలకు స్వపరిపాలనా ప్రతిపత్తి కావాలని పదేపదే కోరమని నేను గట్టిగా చెబుతున్నాను। అలాగయితేనే, గతం సమకూర్చిన అనుభవంతో, భావి సూచించే ఆశలతో సృజనాత్మకమూ స్వతంత్రమూ అయిన చింతనా కేంద్రం కాగల యూనివర్శిటీ ప్రభావంచేత, జాతి, తన నైతిక వివేక బలాలను పరిరక్షించుకో గలుగుతుంది.

అశుతోష్ తిరిగి హైకోర్టు అడ్వకేటుగా ప్రాక్టీసు చేయడం మొదలు పెట్టి, కొద్దిరోజుల్లోనే; "డుమ్రా" రాజుకీ, హరిప్రసాద్‌కీ మధ్య అప్పటి వరకు పాట్నా హైకోర్టులో జరుగుతున్న కేసును చేపట్టాడు. అసలే పని భారంతో క్రుంగిపోయిన మీదట, ఇది మరింత శ్రమగా పరిణమించింది. ఐనా, అశుతోష్ వారాని కోసారి కలకత్తా వస్తూనే ఉన్నాడు. శనివారాలు అర్ధరాత్రి దాటి, ఆదివారాలు పగలంతాను; యూనివర్శిటీ పని చేస్తూనే వున్నాడు. అన్నిటికీ మించి, కలకత్తాలో, ఆ రోజుల్లో తీవ్ర అస్వస్థతలో మంచాన పడున తన కనిష్ఠ పుత్రుడి ఆరోగ్యం గురించి బెంగ.

మృత్యువు అశుతోష్‌కి హఠాత్తుగా వచ్చింది. అది పిడుగుపాటులా వచ్చిపడింది. ఎంతోలేదు, కేవలం మూడురోజుల అస్వస్థత; అంతే, 1924 మే25న అతను చనిపోయినాడు.

అశుతోష్ ఔదార్యం చెప్పనక్కోదగ్గది. ఇంకవారం రోజుల్లో మరణి స్తాడనగా, అంటే 1924 మే 17న అతని కారు డ్రైవరు అతన్ని తన ఇంటికి భోజనానికి పిలిచేడు, కారుడ్రైవరు చిన్నఉద్యోగి. అయినా అశుతోష్‌కి అతని ఆహ్వానాన్ని తిరస్కరించడానికి మనస్కరించలేదు.

అసలు మే 23 ఉదయం అశుతోష్ పూర్తి ఆరోగ్యంతో కులాసాగా ఉన్నాడు. మామూలుగా షికారు వెళ్ళొచ్చాడు. వచ్చాక ఎక్కువగా విరేచనాలయ్యాయి. ఒళ్ళంతా మంటలుగా వుందన్నాడు. జ్వరం తగిలింది. ఉష్ణోగ్రత త్వరత్వరగా హెచ్చింది. ఒళ్ళుమంటలు ఎక్కువయాయి. తీవ్రమైన నెప్పి ప్రారంభమైంది. అక్కణ్ణుంచి రకరకాల చికాకుల్లోకి దింపింది. అశుతోష్ పెద్ద కొడుకు రాంప్రసాద్ ముఖర్జీ పాట్నానుంచి కలకత్తాకి డాక్టర్ల కోసం పిచ్చిగా టెలిగ్రాములిచ్చేడు. డాక్టర్ పి. నంది అని, కలకత్తాలో సుప్రసిద్ధవైద్యుడు, 24 ఉదయానికి పాట్నా చేరుకున్నాడు. అయితేనేం; 25 ఉదయంనుంచీ కూడా అశుతోష్‌కి అపస్మారమే. ఆ మధ్యాహ్నం సరి; అతను పోయినాడు. రెండో కొడుకు శ్యాంప్రసాద్ ముఖర్జీ సిమ్లాలో ఉండి పోయాడు సమయానికి. (అక్కడ సర్ నీలరతన్ సర్కార్ అనే ప్రఖ్యాత వైద్యుడితో, డాక్టర్ సి. వి. రామన్‌తో ఒక కాన్ఫరెన్సు.) వాళ్ళంతా అశుతోష్ పోయిన ఒకగంటకి పాట్నా చేరుకున్నారు. అసలు జబ్బేమిటో తెలిసిందే కాదు. అది అలా చాలా విషాదభరితమైన మృత్యువైంది. ఆ వార్త విని కలకత్తా ప్రజలు దిగ్భ్రాంతి చెందారు. ఆయన భౌతిక కాయాన్ని ప్రత్యేక రైలులో హవురా స్టేషన్‌కి తీసుకొచ్చారు. గొప్పా పేదా అని లేకుండా కలకత్తా పౌరులు తండోపతండాలుగా వచ్చి పడ్డారు. బెంగాల్ దేశపు ఈ ఉత్తమ పుత్రుడికి శ్రద్ధాంజలి ఘటించడానికి ఆదిగంగ వొడ్డున కేయూరతలాశ్మశాన వాటికలో మిక్కిలి విదారకర దృశ్యాలనడుమ అశుతోష్ భౌతిక కాయానికి అగ్ని సంస్కారం జరిగింది.

ఇరవై ఏళ్ళపాటు సర్ అశుతోష్; తానే కలకత్తా యూనివర్శిటీగా, కలకత్తా యూనివర్శిటీయే తానుగా ఉన్నాడు. హఠాత్తుగా ఏర్పడిన ఆ శూన్యం యూనివర్శిటీ అంతటా విషాద మేఘంలా ఆవరించింది. 1924 మే31వ తేదీన సిండికేటు ఒక ప్రత్యేక సమావేశం జరిపి ఇలా తీర్మానం చేసింది:-

"కలకత్తా యూనివర్శిటీ సిండికేటు సభ్యులమైన మేము, మా అత్యంత ప్రియతమ సహచరుడైన సర్ అశుతోష్ ముఖర్జీ దివంగతులైన సందర్భంగా, ఒక ప్రత్యేక సమావేశంలో, ఆయన మరణానికి మా ప్రగాఢ సంతాపాన్ని వ్యక్త పరుస్తున్నాము. వైస్ ఛాన్సెలర్‌గా కానివ్వండి; సిండికేటు సాధారణ సభ్యుడుగా కానివ్వండి; 1889 నుంచి నేటి వరకు కూడా ఆయన

కలకత్తా యూనివర్శిటీ పనిలో ఆత్మీయ సంబంధం కలిగి వున్నాడు. ముప్ఫయ్యయి దేళ్ళపాటు ఆయన తన అమేయ వివేకాన్ని, అజేయమైన శక్తిని, (ఏడాదేడాదికీ మరింత కష్టం శ్రమా అయిపోతున్న కార్యభారాన్ని నిర్వహించ డానికివీలుగా )అతని సహచరులమైన మాకు అందుబాటులో వుంచాడు రెండు దశాబ్దాల పాటు ఈయూనివర్శిటీ సాధించినవి గణనీయమైన అభివృద్ధి విస్తరణలు. సెనేటు ప్రతినిధులుగా మేం అమలు చేయవలసినవి, అవి· అవన్నీ కూడా మాలో ఒక సభ్యుడుగా, ఆయన, నిర్మాణాత్మకమైన ప్రతిభతోనే కాక నిస్వార్థం అకుంఠితం అయిన పట్టుదలతో రూపొం దించినవి అలసట ఎరుగని శక్తితో అసమాన మైన జ్ఞానంతో నేర్పుగా అనతులిచ్చే ఆ మా సహచర శ్రేష్ఠుడు దివం గతుడు కావడంవల్ల, ఆ విలువలింక మాకు లభ్యంకావని. మాసేనులకు తీరని నష్టం వాటిల్లుతుందని ఊహించు కుంటున్న కొద్దీ మావ్యక్తిగత ఆత్మగత విషాదం తీవ్రతర మైపోతున్నది. మా సారధి, మాసచివుడు, మానెయ్యము మాకికలేని ఈ తరుణంలో మేము మా ప్రగాఢ సంతాపాన్ని వ్యక్త పరుస్తూ, మాలో ఒకరుగా విద్యా ప్రయోజనాలకు వారు నెరవేర్చిన సేవలను కృషిని ప్రశంసిస్తూ: ఆమహనీయుని తపస్సిద్ధి మాలో మిగిలిన వారిని అనుయాయులను ఈ మహా మార్గాన చరించేటట్లు ఉత్తేజ పరచాలని; యూనివర్శిటీ సేవ, మాతృదేశ (ప్రజా) విద్యాభివృద్ధి అనే ఆ మహనీయుని మహదాశయాల సిద్ధికోసం తమ సర్వశక్తులను ధారపోసే టట్లు చేయాలని ఆశిస్తున్నాము!"

ఈ విషాదం లార్డ్ లిటన్ గారిని కూడా కదిలించింది. సెనేటు ఏర్పాటు చేసిన ఒక స్మారకసభకు (ఛాన్సెలర్‌గా) అధ్యక్షత వహించడానికి ఆయన డార్జిలింగ్ నుంచి (దిగి) వచ్చాడు. "బరువైన హృదయాలతో, అవనతములైన శిరస్సులతో, ఈ విశ్వవిద్యాయ ఉత్తమ పుత్రుని మృతికి ఖేదించడానికి మనం ఈ సమావేశాన్ని జరుపుతున్నాం. తాను జీవించిన యుగానికంతటికీ బెంగాల్‌కీ ప్రాతినిధ్యం వహించిన అద్భుత వ్యక్తి సర్ అశుతోష్ ముఖర్జీ. అతని మృతి వల్ల ఈ రాష్ట్రపు ప్రజాజీవనంలో, ఎంతో కొంత లోటంటూ ఏర్పడని రంగం ఏదీ వుండదు. అతని వివేకం అతనికి రాష్ట్రం మీదవున్న అభిమానం అంతటి బహుముఖం, అంత గొప్పవీసీ. అయితే, అతని సహచరులూ సహాధ్యాయులూ అయిన మీ

సమక్షంలో నేను అతన్ని గురించి ఏం చెప్పాలి? గొప్ప చతురత గల న్యాయవాది అని చెప్పను. మహామేధావి అయిన న్యాయమూర్తి అనీ చెప్పను. బహుముఖ ప్రజ్ఞావంతుడైన పండితుడని చెప్పను. అసంఖ్యాకాలయిన పండిత పరిషత్తుల పాలకుడూ పోషకుడూ అని చెప్పను. కాని ఒక్కటి మాత్రం చెప్పదల్చుకున్నాను. ఆయన కంటె తక్కువ శక్తి యుక్తులు కల వాళ్ళు తమ సమయాన్ని ఊరికే వినోదం కోసం వృధా చేసేస్తారే; అలాంటి అమూల్యమైన కాలాన్ని అతను ముప్పయ్యయిదేళ్ళపాటు విద్యా ప్రయోజనం కోసం, జ్ఞాన వ్యాప్తే జీవం ధ్యేయం అయిన ఈ యూనివర్శిటీ కోసం—ధారపోశాడు. అదే ఆయన్ని గురించి నేను చెప్పదల్చుకున్నాను! కలకత్తా యూనివర్శిటీ ఇవాళ (ఇంత ఉన్నతస్థాయిలో) ఇలా వుందంటే దానికి కారణం ఆయన ఆ ముప్పయ్యయిదేళ్ళు (పట్టుదలగా, చేసిన శ్రమా వేసిన ముద్రా అని నా అభిప్రాయం. యూనివర్శిటీని ఉన్నత విద్యార్జనకు నిలయంగా, బోధనా సంస్థగా తీర్చిదిద్దిడం ఆయన జీవితంలో సాధించిన ఘన విజయం. ఈ యూనివర్శిటీలో పట్టభద్రోపరి శాఖల వ్యవస్థాపన, సర్ అశుతోష్ ఉద్యోగ రీత్యా సాధించిన మరో ఉత్తమ ఫలం.

తనకూ అశుతోష్‌కీ మధ్య ఏర్పడిన భేదాభిప్రాయాల మాట ప్రస్తావిస్తూ లిటన్ ఇలా అన్నాడు; "పోయిన ఏడాది అతన్నీ నన్నూ పరస్పర విరోధులుగా ఉదాహరించేవారు కాని మా ఇద్దరి మధ్యా ఏదైనా వైరాన్ని సమర్థించగలంతటి మూల సిద్ధాంత విభేదం లేదు. మమ్మల్ని తాత్కాలికంగా విభేద పరచినట్టు కనిపించిన హంశాల్లో ఒకవేళ నేను అంగీకరించ లేనంతటి సత్యం ఏదైనా ఉన్నప్పటికీ అలాంటి వివాదం అంతా మృత్యువు సమక్షంలో సద్దుమణిగిపోయింది. ఇవాళ మనం యోచించేదది కాదు అతనిది అపారమైన జ్ఞాన బలిమి, దాన్నంతటినీ అతను యూనివర్శిటీ సేవకే సమర్పించాడు. తన సమయం అంతటినీ యూనివర్శిటీలోని ఉన్నత శాఖలను తీర్చిదిద్ది పాలన చేసే భారాన్ని మోయడానికి వ్యయం చేశాడు. ఏ ఉపశమనమూ ఎరుగని సుదీర్ఘకాలం అది. అతను ఈ యూనివర్శిటీకి సర్వదా సర్వధా పూర్తి ప్రాతినిధ్యం వహించాడు. తనే యూనివర్శిటీగా, యూనివర్శిటీయే తానుగా దేశ ప్రజల దృష్టిలో, యావత్ప్రపంచ దృష్టిలో నిలిచాడు. ఈ యూనివర్శిటీ స్థావరమైన కలకత్తా నగరానికి భారత దేశంలోను

యూరపులోను ఖ్యాతి సంపాదించి పెట్టారు. ఇలాంటివే, ఇవాళ మనం యోచించగలం".

లిటన్ ఇంకా ఇలా అన్నారు: ''ప్రపంచం దృష్టిలో ఈ యూనివర్శిటీకి గల సదభిప్రాయాన్ని నిలబెట్ట కొనేటందుకు తప్పనిసరిగా రావలసిన మార్పుల కోసం కలిసికట్టుగా పని చేద్దామనే దృఢ నిశ్చయం కొరకు మనం అంతా ఏకం అవుదాం. పరలోక గతుడవుతున్న అతని చేతుల్లోంచి; బోధనా విశ్వవిద్యాలయమైన కలకత్తా యూనివర్శిటీని ఒక పవిత్ర సంస్థగా మనం అందుకోవాలి. ఈ పునర్మైత్రి దేవాలయ శంకుస్థాపన సామాన్య ప్రయోజనంగా స్వీకరించాలి. భావికాలంలో ఈ యూనివర్శిటీ సాధారణ నిర్వహణకి అత్యవసరమనిపించే మార్పులను చేపట్టాలి. ఈ యూనివర్శిటీ స్థిరత్వానికి, అభ్యుదయానికి, భావి అభివృద్ధికి, ఏ ఆటంకమూ రాకండా మనం చూడాలి".

అశుతోష్ మరణం, అతని జీవితం ఒక మలుపు తిరుగుతున్న సమయంలో సంభవించింది. ప్రభుత్వోద్యోగం నుంచి వైదొలగాడు కనుక రాజకీయాల్లో పాల్గొనడానికి స్వేచ్ఛ లభించింది. కొత్త జీవితం ఆవిధంగా రూఢం అయివుంటే కూడా అతడు నిస్సందేహంగా విద్యా ప్రయోజనానికే సేవ చేసేవాడు. ప్రభుత్వం సానుభూతిని కోల్పోయి యూనివర్శిటీని ఎండగట్టేసి అతని ఆశయాలు నెరవేరకుండా అడ్డు పడింది. అందుచేత అతను (శాసన సభకు) ఎన్నికల్లో నిలబడి, విద్యారంగాన్ని చేజిక్కించుకుని, విద్యా ప్రయోజనాల కోసం, రాష్ట్రంలో అన్ని స్థాయిల్లోనూ విద్యావ్యాప్తి అవిరళంగా కొనసాగడం కోసం ఆర్థిక వనరులను సమకూర్చి ఉండేవాడని సరిగ్గా ఊహించవచ్చు పాపం, కాలం అతనికా అవకాశాన్నివ్వలేదు. ఏం జరిగుండేదో వూహించడానికే మనం మిగిలాం.

# 8 సంఘాల్లో, సంస్థల్లో, పరిషత్తుల్లో అశుతోష్

ప్రపంచంలో ఒక ప్రముఖ స్థానానికి భారతదేశాన్ని తోడ్కొని పోవడం అశుతోష్ మహదాశయం. అందుచేత అతను రాష్ట్రంలోని అన్ని పండిత పరిషత్తులతోను సంబంధం పెట్టుకున్నాడు.

ఏషియాటిక్ సొసైటీ ఆఫ్ బెంగాల్, ఇండియన్ అసోషియేషన్ ఫర్ కల్టివేషన్ ఆఫ్ సైన్స్, ఇండియన్ మ్యూజియమ్, వంగీయ సాహిత్య పరిషత్, బెంగాల్ సంస్కృత సంఘం, ఇంపీరియల్ లైబ్రరీ, మహాబోధి సంఘం అనే వాటితో అశుతోష్ సంబంధాలను పొంది వున్నాడు. ఇవన్నీ కూడా పరిశోధనకు అనువైన సంప్రదాయాలతో ఉండేవి; అశుతోష్ అభిరుచి మేరకు పరిశోధన, జనప్రియ విజ్ఞానాల ప్రోత్సాహానికి అనువైన అమూల్యమైన విషయ సముదాయాన్ని పొందిస్నీ ఉండేవి.

అశుతోష్ 1886లో ఏషియాటిక్ సొసైటీ సభ్యుడయ్యాడు. అప్పటికే గణిత శాస్త్రంలో మౌలికమైన విషయాల మీద అతను వ్రాసిన వ్యాసాలు యూరపియన్ పత్రికల్లో ప్రచురణ జరిగి అతని గణితశాస్త్ర ప్రతిభ పశ్చిమ దేశాల్లో గుర్తింపు పొందింది. 1888-90 మధ్య ఏషియాటిక్ సొసైటీ ఆఫ్ బెంగాల్ వారి పత్రికలో అతను, గణితశాస్త్రంలో తన పరిశోధనలపై డజనుకు తక్కువ లేకుండా వ్యాసాలను ప్రచురించాడు. ఆ సంఘానికి 1906 నుంచి 1915 వరకు ఉపాధ్యక్షుడుగా, 1921 నుంచి 1925 వరకు అధ్యక్షుడుగా ఉండి, పరిశోధన చేపట్టిన విద్యార్థులను ప్రోత్సాహించడం, పరిశోధనలో వాళ్ళు అవలంబించవలసిన విధానాలను వివరించడం తన పనిగా పెట్టుకున్నాడు.

ఈ సొసైటీలో అతను చేసిన వార్షిక ప్రసంగాల్లో టిబెటన్ అధ్యయన ప్రాముఖ్యాన్ని గురించి పదేపదే నొక్కిచెప్పాడు. 1906వ సంవత్సరపు (వార్షిక) ప్రసంగంలో ఇలా అన్నాడు:- "భారతీయపౌరాతన్యాలను గురించి పట్టుదలగా అధ్యయనం చేసే ఏ విద్యార్థి కయినా టిబెటన్ అధ్యయనం

చాలా లాభదాయకమైన మార్గం. సుమారు ఎనిమిదేళ్ళ క్రితం మిస్టర్ హాడ్గ్సన్ తాను నేపాల్ వాసిగా వుండి తెచ్చిన నాటినుంచి; క్రిందటేడు టిబెటన్ మిషన్ వాళ్ళు తెచ్చిన వాటివరకు మనకు లభ్యమౌతున్న అన్ని వ్రాతప్రతులను క్షుణ్ణంగా పరిశీలించాలి." అదే ప్రసంగంలో. భారత చరిత్రలో మహమ్మదీయపాలనా కాలం మీద మరింత శ్రద్ధ కనపర్చమని సభ్యులను కోరాడు. "ఇటు సాహిత్యం తీసికున్నా, అటు విజ్ఞానశాస్త్రాన్ని తీసుకున్నా ఇంకా పరిష్కారం కావలసిన ప్రాచ్య పాండిత్య సమస్యలు ఎంత అసంఖ్యాలూ ఆకర్షణీయాలూ అంటే మన సంఘం నిరుత్సాహ పడడానికి తగిన కారణం ఏదీ నాకు కనబడదు." 1903లో చేసిన వార్షిక ప్రసంగంలో భారతీయ వైద్యశాస్త్ర పరిశోధనపై దృష్టిని నిలపమని ఆ సంఘంలో కొత్తగా ఏర్పడిన వైద్య విజ్ఞానశాఖను ప్రోత్సహించాడు.

1910 వార్షిక ఉపన్యాసంలో అశుతోష్. రాజపుత్ర స్థానపు పద రూప చరిత్ర ప్రాముఖ్యాన్ని. (రాజపుత్ర) రాజ్యాలచరిత్ర రూపొందించడం కోసం ఆ పదసాహిత్య సేకరణకు సంతృప్తికరమైన ఏర్పాట్లు చేసే అవస రాన్ని వివరించాడు. "చరిత్ర ఎప్పటికప్పుడు పదాల రూపంలో వ్రాయబడు తూనే ఉంది. రాజపుత్ర రాజ్యాలలోని చాలామంది పారంపర్య కవుల జ్ఞాప కాల రూపంలో మాత్రం ఇలాంటి పదాలూ పాటలూ ఇంకా చాలా ఉంటాయి. అందుచేత, కేవలం వ్రాతలో దొరికినవి మాత్రం సేకరిస్తే చాలదు. తరం నుంచి తరానికి మౌఖికంగా సంక్రమిస్తున్న పాటలనన్నిటిని విని వ్రాసు కోవడం ద్వారా ఈ సేకరణ ఒక పద్ధతిగా జరగాలి. ఈ కార్యక్రమం జయ ప్రదంగా జరగాలంటే రాజపుత్ర ప్రముఖుల సహకారంతోనే జరగాలి".

1913 వార్షిక ఉపన్యాసంలో, "టిబెటన్ అధ్యయనం — మన ప్రముఖ సభ్యుడు కోస్మా - డి - కొరోస్ అనంతరం ఏమంత ప్రోత్సాహ కరంగా గణనీయంగా జరగలే"దని అశుతోష్ తన విచారాన్ని వ్యక్తపరచాడు. రాజపుత్ర స్థానపు పదరూప చరిత్రలో పరిశోధన ఆవశ్యకతను గూర్చి పునః ప్రస్తావించాడు. 1915 వార్షిక ఉపన్యాసంలో కూడా టిబెటన్ అధ్యయ నంలో వెనకబడి పోవద్దని హెచ్చరించి రాజపుత్ర స్థానపు పదరూప చరిత్రల ప్రాముఖ్యాన్ని నొక్కిచెప్పాడు. ఈ సంఘంలో సభ్యులుగాని ఇతరులు గాని ఇంతవరకు మహమ్మదీయ ధర్మశాస్త్ర సూత్రాల్లో సలిపిన పరిశోధన

అతి స్వల్పంగా వుందని ఎత్తిచూపుతూ ఆ విషయ ప్రాముఖ్యాన్ని వివరించాడు.

1922 ఉపన్యాసంలో, విశాల భారతావని చరిత్ర పరిశోధనకు లభ్యమైవున్న అమూల్య సంపదను అశుతోష్ వివరించాడు. అసలు భారత దేశానిది ఒక సమగ్రమైన చరిత్ర తయారుకావడం ముఖ్యం అన్నాడతను. ఇది రాజకీయ సంఘటనల కాలక్రమ పట్టిక మాత్రంగా కాకుండా దేశపు సాంఘిక ఆర్థిక మత విషయ పరిణామాల్లో ముఖ్యమైన వాటిని చేర్చుకోవాలి. భారత దేశ చరిత్ర ఎవరో పరిశోధక పండితులు వ్రాస్తారనే నాఆశ. అంత సమగ్రం కాకపోయినా నూతన శాస్త్రీయ అర్థంలో చరిత్ర కాగలదని నానమ్మకం. "ఒక భారతీయ విశ్వవిద్యాలయంలోని అధ్యాపకుడెవరైనా (కలకత్తా యూనివర్శిటీ నుంచే కానీయండి) మన ఈ స్వప్నాలను ఫలవంతం చెయ్యగలడని ఆశిస్తున్నాను",

అశుతోష్ సంస్కృతంలో కూడా పండితుడే. "ఏషియాటిక్ సొసైటీ స్మృతుల"లో, "జీమూతవాహన వ్యవహార మాతృక"ను పరిష్కరించాడు.

1905 మేలో ఏషియాటిక్ సొసైటీ నియామకం పైన, ఇండియన్ మ్యూజియం బోర్డులో ట్రస్టీగా చేరి, 1909 ఆగస్టులో దానికి అధ్యక్షుడై, ఆమరణాంతం అలా కొనసాగాడు. మ్యూజియం అభివృద్ధికి అశుతోష్ గణనీయమైన సేవ చేశాడు. 1910లో చట్టంగా రూపొందిన ఇండియన్ మ్యూజియం బిల్లుకి అశుతోష్ తన సహాయ సహకారాలను అందించాడు. ఇండియన్ మ్యూజియం ఈ బిల్లు ననుసరించి తన కార్యకలాపాల పరిధికి విస్తరణను, ప్రదర్శితాలయ్యే వస్తువులను ఎరువు తెచ్చుకునే విషయంలోనూ, శాస్త్ర పరిశోధనలోనూ తగినంత స్వయం పరిపాలనా ప్రతిపత్తిని పొందింది. అంతేకాక ఈ చట్టం ప్రకారం ప్రజా విద్యలో కొంత కృషి చెయ్యడానికి, మ్యూజియంకి అవకాశం కల్పించబడింది.

అశుతోష్ సారధ్యం క్రింద, పశ్చిమ బెంగాల్ ప్రభుత్వ ఆర్ట్‌గ్యాలరీ 'ఇండియన్ మ్యూజియం' లోని "ఆర్ట్ వేర్ కోర్ట్" లో కలిసిపోయి, సరాసరి ట్రస్టీల బోర్డు ఆధిపత్యంలో కొనసాగే ఇండియన్ మ్యూజియం ఆర్ట్

శెక్షన్‌గా రూపొందింది. శిల్పం, చిత్ర లేఖనం, చరిత్రాత్పూర్వ పురాతత్త్వ కళ-ఈ మూడు శాఖల ప్రదర్శనశాలలకు వసతి కల్పిస్తూ చౌరంఘీ రోడ్డు వెంబడే ఇండియన్ మ్యూజియం భవన విస్తరణ జరిగింది.

1913 నవంబరు 28తో ఇండియన్ మ్యూజియం ఏర్పడి నూరేళ్ళయింది. శతాబ్ది మహోత్సవ ప్రారంభ సభకు అశుతోష్ అధ్యక్షత వహించి జాతీయ వస్తు ప్రదర్శన శాల అనేది ఎలా వుండాలో సూచిస్తూ ఉత్తేజకరంగా ప్రసంగించాడు. ''వస్తు ప్రదర్శన శాలల పరమార్థానికి ఇప్పటికి గుర్తింపు వచ్చింది. ప్రకృతి విచిత్రాలనూ మానవ కృషినీ ఉదాహరించే వస్తు పంచయాన్ని భద్రపరచే ఈ సంస్థ ప్రజల సంస్కృతీ విజ్ఞానాలను పెంపొందించడానికి కూడా ఉపయోగపడుతుంది. అందుచేత, జాతీయ స్థాయిలో ఏర్పరచిన వస్తు ప్రదర్శన శాల ముఖ్యంగా మూడు విధుల నిర్వహణకు సిద్ధం కావాలి. మొదటిది, కళల్లో, శాస్త్రంలో జ్ఞానానికి ఆధారభూతాలైన నమూనాల సేకరణ, భద్రత; రెండోది అలా చేర్చిన ఆ నమూనాల ఆధారంగా పరిశోధన, అందువల్ల కలిగే జ్ఞాన విస్తరణ; మూడోది - వీటి మీద ప్రజలకి అభిరుచిని పేరేపించడానికి తగిన ఏర్పాటూ ప్రచారం.

అశుతోష్ సూచన కారణంగా అతని మార్గదర్శకత్వంలో, 1914లో ఇండియన్ మ్యూజియం సమగ్ర చరిత్ర వ్రాయడం, ప్రచురించడం జరిగింది.

వస్తు ప్రదర్శనశాల లోని నర వర్ణనాశాస్త్ర సంబంధి వస్తు పరిచయం మొదట్లో ''జువాలజికల్ సర్వే ఆఫ్ ఇండియా''లో భాగంగా చేరి వుండేది. అయితే అశుతోష్ దీన్ని ట్రస్టీలబోర్డు సరాసరి ఆధిపత్యం క్రిందికి తీసుకు వచ్చాడు. ఆ విధంగా మానవ పరిణామ ప్రదర్శనశాల ఏర్పడి ప్రస్తుతం వస్తు ప్రదర్శన శాలలోని నరవర్ణనా శాస్త్ర శాఖగా రూపొందింది.

సామాన్య చరిత్ర శాఖను; కళలు - పురావస్తు శాఖల భాగాలను క్రమ పద్ధతిలో పునర్వ్యవస్థీకరించి. జాతికి, తన అనంతరం, "సంచయ సంపద రీత్యా, శాస్త్రీయ నిర్వహణ దృష్ట్యా" జాతీయ విద్యా సాంస్కృతిక సంస్థ స్థాయికి చేరుకొని, భారత దేశంలో ఈ తరహాది మరొకటి లేనంతటిదైన వస్తు పదర్శన శాలను మిగిల్చాడు అశుతోష్.

(శాస్త్ర విజ్ఞాన వ్యాప్తికై ఏర్పడిన) ఇండియన్ అసోసియేషన్‌తో అనుబంధం అశుతోష్‌కి తన ఇరవై మూడవ యేటనే ప్రారంభమైంది. డాక్టర్ మహేంద్రలాల్ సర్కార్ ఆహ్వానంపై ఈ సంఘంలో (గౌరవ స్థాయిలో) గణిత శాస్త్ర విషయాలలో ఉపన్యాసాలివ్వడం మొదలెట్టి, (న్యాయ వాదిగా తన వృత్తి వల్ల ఇది కష్టతరం అనిపించే వరకు ) 1891 వరకు ఆ ఉపన్యాసాలను కొనసాగించాడు. 1910లో రెండు వేల రూపాయల చందాకట్టి ఈ సంఘానికి జీవిత సభ్యుడైనాడు. ఆ మరుసటి సంవత్సరం కార్యవర్గ సభ్యుడుగా ఎన్నికయ్యాడు. "ప్రయోగ శాస్త్రాలతో గణిత శాస్త్రానికి గల సంబంధాలు" అనే విషయం మీద ముచ్చటైన ఉపన్యాసంతో ఈ సంఘపు 1903-04 సంవత్సర సదస్సును ప్రారంభించాడు. 1908లో జె. ఎం. టాగూర్ మహారాజా మరణించడం వల్ల ఏర్పడిన ఖాళీలో ఉపాధ్యక్షుడుగా ఎన్నికై ఈ సంస్థ ఆధ్వర్యాన కలకత్తాలో జరిగిన నాలుగు శాస్త్ర విజ్ఞాన సదస్సులకు అధ్యక్షత వహించాడు. 1922లో రాజా ప్యారీమోహన్ ముఖర్జీ చనిపోయినప్పుడు అతని స్థానే అశుతోష్ ఈసంఘ అధ్యక్షుడై ఆమరణాంతం కొనసాగాడు.

అశుతోష్, 1914లో జరిగిన తొలి భారత శాస్త్ర విజ్ఞాన సదస్సుకు అధ్యక్షత వహించాడు.

కాలేజీ రోజుల్లోనే అశుతోష్: భారత దేశంలోనూ విదేశాల్లోనూ వెలువడుతూ వుండిన పత్రికల్లో గణితశాస్త్ర సంబంధమైన కొన్ని ముఖ్య విషయాలపై వ్యాసాలు వ్రాసి ప్రచురించడానీ; అవన్నీ కూడా గణితశాస్త్రజ్ఞుల ప్రశంసలను అందుకున్నాయనీ మనం లోగడ తెలుసుకున్నాం. అలా తన అభిమాన విషయమైన గణితశాస్త్రం కోసమే పూర్తి శ్రద్ధతీసుకొనుంటే అతను ప్రపంచ విఖ్యాత గణితశాస్త్రజ్ఞుడు అయి వుండేవాడే. అతను 1908లో "కలకత్తా మేథమేటికల్ సొసైటీని" తన అధ్యక్షత్వం క్రిందనే వ్యవస్థాపించి, ఆ సంఘ వ్యవహారాలకి ఆమరణాంతం మార్గదర్శకుడుగా నిలిచాడు. ఈ సంఘం అశుతోష్ జీవితకాలంలో ఎనభై మూడు సమావేశాలను జరపగా, అన్నిటికీ అతను అధ్యక్షత వహించాడు. విదేశాల్లోని గణితశాస్త్రజ్ఞులనేకులను దీంట్లో గౌరవ సభ్యులుగా చేర్చారు. 1909లో ప్రొఫెసర్ గణేశ్ ప్రసాద్, 1913లో ప్రొఫెసర్ ఫోర్‌సిత్, 1915లో ప్రొఫెసర్ యడ్జ్ తమతమ

పరిశోధన (విషయా)లను గూర్చి ఈ సంఘ సమావేశాలలో ప్రసంగించారు. అలాగే, ప్రొఫెసర్ కల్లిస్, ఎన్. ఎన్. బోస్, ఎన్. ఆర్. సేన్, బి. ఎం. సేన్, బి. బి. దత్తా, తదితరుల వంటి ప్రముఖ గణితశాస్త్రజ్ఞుల ఉపన్యాసాలూనూ. అశుతోష్ ప్రోత్సాహ ప్రేరణలవల్ల తెలివిగల యువకు లనేకులు గణితశాస్త్ర పరిశోధనను చేపట్టి ఈ సంఘం వెలువరించిన పత్రిక లలో వ్యాసాలు వ్రాశారు.*

(మనం) ప్రస్తుతం "నేషనల్‌లైబ్రరీ" అంటున్న ఇంపీరియల్ లైబ్రరీ వ్యవహారాలకు అశుతోష్ చాలాకాలం సారధ్యం వహించాడు. ఇంపీరియల్ లైబ్రరీ (పలహా) మండలి సభ్యుడతను. అంతేకాదు; 1910 నుంచి తాను మరణించిన వరకు ఆ మండలి అధ్యక్షుడు కూడానూ.

బెంగాలీ భాష-వాఙ్మయాల అధ్యయనాన్నే కాక పరిశోధననూ ప్రోత్సహించడం అశుతోష్‌కి మహా ఇష్టంగా ఉండేది. అతని ప్రయత్నం వల్లనే కదా, కలకత్తా యూనివర్శిటీతో అత్యున్నత పరీక్షకు విషయంగా ఇతర భారతీయ దేశభాషలతో బాటు బెంగాలీని చేర్చడం జరిగింది; చాలా ఏళ్ళు అశుతోష్ వంగీయ సాహిత్య పరిషత్తుతో సంబంధాలు కలిగి వుండి 1904 నుంచి 1908 వరకు ఆ పరిషత్తుకు ఉపాధ్యక్షుడుగా వున్నాడు. 1915లో అతను ఉత్తర బెంగాల్ సాహితీసదస్సులో అధ్యక్షుడుగా ప్రసంగించాడు. 1916లో "బెంగాల్ సాహితీ సభ" బంకీపూర్ సదస్సుకు అధ్యక్షత వహించాడు. ఈ సభలన్నిటిలో కూడా, అశుతోష్, వంగ సాహిత్య అధ్యయన ప్రాముఖ్యం గురించి ఉదాహరించి బెంగాలీ భాషకు గల ఉజ్జ్వల భవిష్యత్తును గూర్చి అనర్గళమైన ప్రసంగాలు చేశాడు.

అశుతోష్ సంస్కృతంలోనూ దిట్టమైన వాడే. దేశంలో సంస్కృత భాష అధ్యయనాన్ని ప్రోత్సహిద్దామనీ సంస్కృత పాండిత్యానికి ఒకప్పుడుదే కేంద్రంగా వుండిన నవద్వీప్ శోభను పునరుద్ధరిద్దామనీ తపన పడుతూ వుం డాడు. అతను నవద్వీప పండితుల సంఘానికి అధ్యక్షుడు. వారు అతనికి 'సరస్వతి' బిరుదు ప్రదానం చేశారు. డక్కా పండితులతనికి 'శాస్త్రవాచస్పతి' బిరుదు నిచ్చారు. 1908 నుండి 1923 దాకా అతను బెంగాల్ సంస్కృత సంఘానికి అధ్యక్షుడు. ఆ విధంగా అతనికి ఆ పండితుల

---

* అశుతోష్ ముఖర్జీ జీవితచరిత్ర-ఎన్. కె. సిన్హా-177-179 పుటలు

మధ్య బెంగాల్, బీహార్, ఒరిస్సా, అస్సాంలో సంస్కృత బోధన మీద పలుకుబడి వుండేది. అతను కలకత్తా సంస్కృత కళాశాల యాజమాన్య మండలి అధ్యక్షుడు కూడాను.

కలకత్తా యూనివర్శిటీ బౌద్ధవాఙ్మయం, బౌద్ధ తత్త్వశాస్త్రం అధ్యయనం చెయ్యడం ప్రాముఖ్యాన్ని గుర్తించాడు. అందుచేత 1907లో యూనివర్శిటీలో పాళీభాషలో తరగతులను ప్రారంభించాడు. అలా కలకత్తా యూనివర్శిటీ, పాళీ భాషలో బోధనను చేపట్టిన తొలి భారతీయ యూనివర్శిటీ అయింది. పాళీ భాషకు బౌద్ధ వాఙ్మయ అధ్యయనానికి అతను చేసిన సేవలకు గుర్తింపుగా, సింహళ దేశపు (బౌద్ధ) సన్యాసులు అతనికి 1914లో ''సంబుద్ధాగమ చక్రవర్తి'' అని బిరుదిచ్చారు. మహా బోధి సంఘానికి అధ్యక్షత వహించడానికి 1916లో అంగీకరించి ఆ మరణాంతం ఆ పీఠాన్ని నిలుపుకొన్నాడు. 1920 మహాబోధి సంఘ అధ్యక్షుడుగా బుద్ధభగవానుని అవశేషాలుగల ఒక పేటికను లార్డ్ రోనాల్డ్‌షే నుంచి స్వీకరించాడు. ఈ ఉత్సవం కలకత్తా గవర్నమెంట్ హౌస్‌లో జరిగింది. అశుతోష్ ఆ పేటికను స్వీకరించినపుడు ఒక ధోవతి మాత్రం కట్టుకొని వట్టికాళ్ళతో ఉన్నాడు.

అశుతోష్, బెంగాల్‌లోని యావత్ సాంస్కృతిక రంగంమీద ఒక మహా విగ్రహంవలె నిలిచాడంటే అది అతిశయోక్తి కాదు.

# 9. వ్యక్తిగా అశుతోష్

ఉన్నతమైన వ్యక్తిత్వంతో, కఠోర పరిశ్రమకి కావలసినంత ఓపికతో, అపారమైన శక్తితో, శ్రేష్ఠమైన వివేకంతో, అపూర్వమైన ధారణతో, విస్తారమైన జ్ఞానంతో అశుతోష్ ఒక మహాకాయుడనుకోవచ్చు. కాని అతని భౌతిక విగ్రహం అలాంటిదేం కాదు. పొట్టి కాదుకాని పొడుగు కాదతను. లావుగా వుండేవాడు. నలుపు. అయితే వెయ్యిమందిలో అతన్ని ఠక్కున ఆనవాలు పట్టగలగడానికి వీలుగా కొన్ని స్పష్టమైన లక్షణాలతని కుండేవి. దట్టమైన ఆ కనుబొమల కింద మెరిసే కళ్ళు. వాటిచూపు చురుకు; ఓసారి మనవేపు చూసాడంటే మన సంగతంతా పట్టేశాడురా అనిపించేస్తాయి. ఆగ్రహంలో నిప్పులు కక్కడం తెలుసు; అనుగ్రహంలో దయ కురిపించడమూ తెలుసు వాటికి. మొహం గుండ్రం, ముక్కు మధ్యస్థ పరిమాణం. మీసాలు కిందికి జారుతూ ఒత్తుగా పెదవుల్ని మూసేసేవి. అలా ఓసారి చూడగానే మాంచి జబర్‌దస్తీ అయిన మనిషిరా అనిపించేస్తాడు. కాని-జబ్బుకి లొంగనివాడు కాదు. చదువుకుంటున్నప్పుడైతే ఎప్పుడూ ఏదో ఒక ఖాయిలానే. చాలాసార్లు మంచం పట్టాడు. అయితే పనిముందు అదేదీ లక్ష్యపెట్ట లేదతను; ఎన్నడూ కూడాను.

అతనెప్పుడూ యూరపియన్ వేషధారణ చెయ్యలేదు. ఎక్కడైనా సరే పంచె, నిండు గుండీల కోటు, చెప్పులు-అదే వేషం. హైకోర్టులో న్యాయపీఠం మీద వున్నంతసేపూ పంట్లాం వేసేవాడు. కాని ఛేంబర్స్‌లోకి దిగడంతోనే విప్పేసేవాడు. ఏరోజైనా సరే పని పూర్తయ్యాక హైకోర్టులో ప్రత్యేకం జడ్జీలు మాత్రం వాడే మెట్లుదిగి వస్తున్నపుడు అతన్ని చూస్తే పంచె కట్టులోనే కనబడేవాడు. అతను చదువుకుంటూ వుండే రోజుల్లో, "భద్రలోక్" (కులీనులైన) వాళ్ళు ఒక వోణీ కప్పుకుని బైటికి రాడం ఆచారం. ఇతనికి చాలా చిన్న వయస్సప్పుడే ఓసారి, బగ్గీ దిగుతూవుండగా ఆ వోణీ బగ్గీలో చిక్కుపడిపోయి. ఇతను కిందపడ్డాడు. ఆ వేళనుంచి తోటి కుర్రాళ్ళు

వేళాకోళం చేసినా సరే, ఫోణీ తీసిపారేశాడు. పెద్దయ్యాక ఫోణీ నలుగుర్లాగా చుట్టబెట్టకుండా మడత పెట్టి బుజమ్మీద వేసుకున్నాడు.

మంచి నిష్ఠగల బ్రాహ్మణుడు. నిరాడంబరమైన అలవాట్లు; మెత్తని పరుపు అక్కర్లేదు. ముతగ్గానే ఉండాలి. ఓ సారి ఓ గొప్పాయ నింట్లో ఆతని అతిథిగా అక్కడ నిద్రపోవలసొచ్చింది. ఆ "హంసతూలికా" తల్పం మీద నిద్రిపట్టలేదు. అటూ ఇటూ చూసి కిందని ఓ ప్రక్క వేసుకుని పడుకున్నాడంతే. అతనెప్పుడూ పొగతాగలేదు. కిళ్ళీ వెయ్యలేదు. సరికదా, 'టీ' పుచ్చుగోలేదు। శాకాహారి, ఓమారు బాగా జబ్బుపడి లేచేక డాక్టరు సలహా మీద చేప తినవలసి వచ్చింది. కాని అది అతనికి నచ్చలేదు. "సందేష్" (ఆనేస్వీటు) అంటే మాత్రం మహా ఇష్టం. రోజూ మస్తుగా తినేవాడు ఇది. కలకత్తా "బౌబజార్"లో భీమ్‌నాగ్ స్వీట్ల దుకాణంలో తయారైన సందేష్‌కి ఆ రోజుల్లో సర్ అశుతోష్ పేరుతో చిన్న మెలిక వుండేది.

అశుతోష్ క్రమబద్ధమైన జీవితం గడిపాడు. తెల్లారు జామున నాలుగంటలకి లేవ వలసిందే. నాలుగున్నర కల్లా ఏ పనివుంటే దానిమీద కూచోవలసిందే. అలా కొంతసేపు పని చేసేక లేచి షికారు. అది కలకత్తా "మైదానం"లోనే. వాళ్ళ నాన్నగారినుంచి వచ్చిన అలవాటూ, పాఠమూ, కూడానూ అది. ఉదయపు వేళ గాలి వొంటికి మంచిది-అని ఆయన ఇతన్ని (ఉదయం పూట) షికారు తిప్పుతూ చెప్పేవాడు. చదువుకుంటున్న రోజుల్లో తండ్రీ కొడుకు తిరిగే ఆ షికారు అలవాటు చివరి రోజులవరకూ అలాగే ఉండి పోయింది. చౌరంఘీ రోడ్డుకి సమానాంతరంగా వుండే "మైదానం" దారి గుండాను ఈ షికారు (అంటే ఇపుడు "క్వీన్స్‌వే" చివరి నుంచి పార్క్ స్ట్రీట్ వరకు అన్నమాట.) ఈ దారి ఇపుడు చరిత్రాత్మకమైన స్థలం. ఎందు కంటే ఆనాడు ఈ దారి మీదనే ముఖ్యమైన వాళ్ళు ముఖ్య విషయాలు మాటాడ డానికీ, అంత ముఖ్యులు కానివాళ్ళు వాళ్ళ బాధలు చెప్పుకుందికీ అతన్ని కలిసేవాళ్ళు.

షికారై పోయి ఇంటికొచ్చేక, తనని చూడ్డానికొచ్చి ఎదురు చూస్తున్న వాళ్ళతో కొంతసేపు. మళ్ళీపని. సాధారణంగా ముగ్గురు స్టెనోగ్రాఫర్లు అతని

దగ్గిర పనికి ఉండేవాళ్ళు. తీర్పులు, నివేదికలు, నోట్సు, అసంఖ్యాకంగా వొచ్చే ఉత్తరాలకి సమాధానాలు - అలా చెప్పుకుంటూ పోవడమే. అదంతా అయిపోయాక మళ్ళా "సిటింగ్‌రూమ్‌లో" కొచ్చేసే వాడు. ఎక్కడెక్కణ్ణించో ఏమిటేమిటో చెప్పుకుందికి వొచ్చేవాళ్ళు అక్కడుండేవారు. ఎవరు రావడానికీ ఏ అడ్డూ లేదు. వాళ్ళకి ఓచెవి ఇచ్చేవాడు. అప్పుడు స్నానం. నౌకర్లు అక్కడికే వచ్చేవాళ్ళు. ఒంటికీ జుట్టుకీ నూనె రాయించుకుని మర్దనా చేయించుకుంటూనే ఆగంతకులతో మాట్లాడేసేవాడు. వాళ్ళు యూరపియన్లయినా సరే, ఆ స్థితిలో చూడ్డానికి సంకోచం లేదు.

హైకోర్టులో పని అయిపోగానే సాయంకాలం తిన్నగా యూనివర్శిటీకి వెళ్ళిపోయే వాడు. అక్కడ యూనివర్శిటీ అధ్యాపకులు "టీచర్స్ కామన్ రూంలో" తన కోసం ఎదురుచూస్తూండే వాళ్ళు. తరుచు అక్కడికెళ్ళేటప్పుడు "భీమ్‌నాగ్ మిఠాయి దుకాణం" నుంచి స్వీట్లు పట్టుకెళ్ళేవాడు. యూనివర్శిటీలో మీటింగులూ అవీ అయ్యాక, రాత్రిచేరేవాడింటికి-అప్పుడు భోజనం. మళ్ళీ రాత్రి పదిగంటలైై పక్కమీది కెళ్ళేవరకూ పని. (అయితే ఈసమయాన్ని సాధారణంగా తనకి వ్యక్తిగతంగా అవసరమయ్యే చదువు కోసం ఉపయోగించేవాడు.) అలా, తెల్లారు జామున నాలుగ్గంటల నుంచి రాత్రి పదిగంటల వరకు (జీవితంలో ప్రతిరోజు) ప్రతిక్షణం పనితోనే సరిపోయేదతనికి.

అశుతోష్‌కి సంప్రదాయం అంటే పరిపూర్ణమైన గౌరవం. పాశ్చాత్య రీతుల్ని నిర్దాక్షిణ్యంగా వదిలెయ్య వలసిందే. అయితేపాశ్చాత్య సంస్కృతిలో గొప్ప దేదున్నా దాన్ని స్వీకరించడానికి ఆ మనస్సెప్పుడూ తెరిచే వుండేది. మాతృదేశపు సంప్రదాయాలు విడిచి పెట్టేది లేదు. కాని మతం పేరిట హిందూ సంఘంలోకి చొరబడిపోయిన దురలవాట్లను భరించిందీ లేదు. హిందూ సమాజంలోని సదాచార శాఖకు అసంతృప్తి కలిగించవలసి వస్తే, అందు కతనెన్నడూ జంకలేదు. అతని పెద్దకూతురు విషయంలో చాలాబాధ ననుభవించేడు. ఆ అమ్మాయి బాల విధవ. ఈ సదాచార బ్రాహ్మణులు గట్టిగా వ్యతిరేకించినా సరే, ఎదురుతిరిగి ఆ అమ్మాయికి రెండో పెళ్ళి చేసేడు. హిందూ విధవల్లో సంతానవతులు కానివాళ్ళు మళ్ళీ పెళ్ళి

చేసుకోడం అనేది ప్రాచీన ఇతిహాసాల ప్రకారం ఆమోదమేనని ఈశ్వర చంద్ర విద్యాసాగర్ రుజువులు చూపించేడు. హిందూ విధవల పునర్వివాహం చట్టబద్ధమే నన్నాడు. కాని సంఘంలో చాదస్తులైనవాళ్ళు దీని కొప్పుకోలేదు. విద్యాసాగర్ తన కొడుక్కి ఒక విధవ నిచ్చి పెళ్ళిచేసి మార్గ దర్శకు డయ్యాడు. అశుతోష్‌కి అతనంటే ప్రశంసాభావం. (తనకి తటస్థ పడిన) కఠినమైన వ్యతిరేకతని నిర్భయంగా ఎదిరించి అతను చూపిన మార్గాన్ని అనుసరించాడు అశుతోష్.

అశుతోష్, పాశ్చాత్య విధానాలను వేషధారణను పాటించడానికి నిరాకరించేడు. అది అతని జాతీయాభిమాన వ్యక్తీకరణే. తెల్లవాళ్ళతో మనమూ సమానమే అని సామాన్య జనం అనుకొనేటట్టు చెయ్యాలనీ; వాళ్ళలో స్వాతంత్ర్యోత్సాహం పాదుకొనేటట్లు చేయాలనీ, తనని మార్గ దర్శకుడుగా వాళ్ళు భావించడానికి వీలుగా తానుండాలనీ అశుతోష్ తలచాడు. ఏ రాజకీయ నాయకుడికీ తీసిపోనంత దేశభక్తుడే, అతనూనూ. 1907లో యూనివర్శిటీ స్నాతకోత్సవంలో ప్రసంగిస్తూ దేశంలోని యువతరాన్ని ఉద్దేశించి ఇలా అన్నాడు. "పాశ్చాత్య ఆచారాల్లో మునిగితేల్తే తేలారుగానీ భారతీయ సంప్రదాయ సూత్రాల ఉత్కృష్టతను మాత్రం విడనాడకండి. పశ్చిమ (దేశాల సంస్కృతి) కాంతి తళ తళలో పడి అమూల్యమైన మన సంప్రదాయ నిధులను నిర్లక్ష్యం చెయ్యకండి. పాశ్చాత్య సంస్కృతిలో ఉత్తమమైన వాటి పట్ల మీ సముచిత ప్రశంసలో మిమ్మల్ని మీరు జాతీయతా విహీనులను చేసుకోవద్దు. (ఎట్టి పరిస్థితుల్లో కూడా) మీ పరిపూర్ణ భారతీయతను అంగీకరించడానికి ఎన్నడూ వెనకాడకూడదు. మీ దేశభాషల ద్వారానే ప్రజలకి దగ్గరై వారికి యూరపియన్ విజ్ఞానరంగం నుంచి మీరు సేకరించిన వివేకాన్ని పంచిపెట్టగలరు. అందుచేత మీ దేశ భాషలను శ్రద్ధగా అధ్యయనం చెయ్యండి".

ఒకసారి లార్డ్ కర్జన్, అశుతోష్‌ని, ఏడవ ఎడ్వర్డు పట్టాభిషేకం చూడ్డానికి కలకత్తా ప్రతినిధిగా (లండన్) రమ్మని ఆహ్వానించాడు. విస్సందేహంగా, ఎగిరి గంతేసే గొప్ప గౌరవం యిది. కాని అశుతోష్, "దీనికి మా అమ్మగారు అంగీకరించరు. కనుక నేను రాలే"నని చెప్పాడు. "ఏలిన

వారి భారత దేశ ప్రతినిధి ఆజ్ఞ అని మీ అమ్మగారికి చెప్పవయ్యా" అన్నాడట లార్డ్ కర్జన్. అలా అంటే "నీ కలాంటి ఆజ్ఞ యివ్వడానికి నీ తల్లికి తప్ప ఇంకెవ్వరికీ అధికారం లేదంటారు మా అమ్మగారు" అని అశుతోష్ చెప్పాడట. దీన్ని బట్టి అశుతోష్ స్వాతంత్ర్యేచ్ఛ ఎలాంటిదో తెలుస్తుంది.

ఆ రోజుల్లో చాలామంది యూరపియన్లు భారతీయుల పట్ల పొగరుబోతు తనంతో వ్యవహరించే వారు. రైల్లో ప్రయాణం చేసేటప్పుడు యూరపియన్లకీ భారతీయులకీ మధ్య ఘర్షణలు రావడం, యూరపియన్లదే పై చెయ్యి కావడం తరుచు జరుగుతూ వుండేది. (అలాంటి ఆ కాలంలో) ఒక బ్రిటిష్ ఆఫీసర్‌కి చక్కని గుణపాఠం నేర్పే అవకాశం అశుతోష్‌కి ఒక రైలు ప్రయాణంలో తగిలింది ... .... అశుతోష్ అప్పట్లో శాడ్లర్ కమిషన్ సభ్యుడు; ఆ పని మీదనే ఆలీఘర్ వెళ్ళాడు. తిరుగు ప్రయాణంలో తానున్న కంపార్టుమెంటులో అతనితో బాటు ఒక బ్రిటిష్ మిలిటరీ ఆఫీసరు ఉన్నాడు. అశుతోష్ నిద్రలో ఉన్నప్పుడా మిలిటరీ ఆఫీసర్, ఇతను కొత్తగా కొనుక్కున్న "నగరీ" చెప్పులను కిటికీలోంచి విసిరేశాడు. అశుతోష్ లేచి చూసుకునే సరికి చెప్పుల్లేవు. ఇది వీడి పనే అయ్యుంటుందని సరిగ్గా వూహించి, ఆ మిలిటరీ ఆఫీసర్ కోటు తీసి కిటికీలోంచి పారేశాడు. (అప్పటికి అతనూ నిద్ర పోతున్నాడు). అతగాడు లేచి, కోటుకోసం చూసి, కనబడక పోయే సరికల్లా తగవులాటకి దిగాడు. మీ కోటు నా చెప్పుల్ని వెతుకుకొనిరావడానికి వెళ్ళిందని చల్లగా చెప్పేడు అశుతోష్.

అశుతోష్‌ది సున్నితమైన మనసు. కష్టంలో ఉన్నవాళ్ళు అతనికి (తమ బాధలను) విన్నవించుకోడానికి వీలుండేది. ఆశ్రిత జన సులభుడు. పరిచయం లేకపోయినా సరే, రోజూ గొప్పా పేదా అని లేకుండా రకరకాల జీవన విధానాల వాళ్ళ కష్టసుఖాలు విని తనకి సాధ్యమైన ఉపకారం ఏదో చేసేవాడు.

ప్రతిభ అనేది యెక్కడున్నా సరే అశుతోష్ త్వరగా పట్టేసి, ప్రతిభావంతుల్ని సదా ప్రోత్సహిస్తూ ఉండేవాడు. తెలివిగల విద్యార్థులు ఎవరెవరెక్కడున్నారో ఎలా వున్నారో వాళ్ళకి తెలియకుండా వోకంట కనిపెడుతూ వుండేవాడతను. అలాంటి వాళ్ళలో చాలా మంది ఏదో పని మీద అతన్ని

మొదటిసారి కలవడం; తాము తమ గురించి చెప్పక ముందే అతనికి తమ జాతకాలు పూర్తిగా తెలిసి పోయిఉండడం చూసి నిర్ఘాంత పోవడం జరిగేది. యూనివర్శిటీలో పట్టభద్రోపరి శాఖల్లో ఉద్యోగులుగా, నియమించడానికి అశుతోష్ అలాంటి యువకుల్ని ఏరేవాడు. అ శు తో ష్ నుంచి ఎడతెగని ప్రోత్సాహం లభించడం మార్గం కాగా, వాళ్ళు అంతర్జాతీయ ఖ్యాతి తెచ్చుకునే పండితులుగా వికసించే వాళ్ళు. యూనివర్శిటీ లోని అధ్యాపక, అధ్యాపకేతర ఉద్యోగులపై అతని వ్యక్తిగత ప్ర భా వా ని కి కారణం; వాళ్ళు అతన్నుంచి అపేక్షా పూర్వకమైన ఆదరణను పొందడమే.

అశుతోష్ కార్యవాది. అలాగే అ త ను స్వాప్నికుడు కూడాను. అప్పుడప్పుడు నిశ్శబ్దంలోకి జారుకుని దృష్టిని సుదూర లోకాల్లోకి ప్రసరిస్తూ కనబడే వాడు. తన ప్రియతమ విశ్వవిద్యాలయం ప్రపంచంలోని యూనివర్శిటీలకు రాజ్ఞీత్వం పొందాలని, ఇదిఒక నవీన నలందా కావాలని, ప్రపంచంలోని మేధావులంతా మానవ పరికల్పితాలైన జ్ఞాన పరిధులని అతిక్రమించడమనే సామాన్య అన్వేషణలో ఇక్కడ సంగమించాలని — కలలు కంటున్నాడన్నది స్పష్టం. 1914లో యూనివర్శిటీ స్నాతకోత్సవంలో ప్రసంగిస్తూ అతనిలా అన్నాడు:.... "ఎంత పని ఒత్తిడిలో వున్న వ్యక్తి అయినా సరే, ఒక్కొక్కప్పుడు స్వప్నాల్లోకి జారుకోడం కద్దు. ఈ యూనివర్శిటీ సామర్థ్యాన్ని ఇంకా ఉన్నతికి తీసుకుపోడానికి పథకాలూ, ప్రణాళికలూ .... ఇవే నా కలలు. పగలూ అవే కలలు; రాత్రి నా విశ్రాంతి సమయంలోనూ అవే కలలు." .... .... ఐ. జె ఎస్. తారాపూర్‌వాలా అశుతోష్ గురించి ఇలా వ్రాశాడు: "అంత గొప్ప కార్యసాధక సామర్థ్యంతో బాటు అతని భావుకత కూడా విలక్షణమైనదే. తాను ప్రేమించిన భారత దేశంగురించి పూర్వం ఎలా వుండేది, భవిష్యత్తులో ఎలా వుంటుంది – అని. అ త ను మాట్లాడితే ఆ మాటల్లో ఒక కవి, ప్రవక్త, వాడే మాటల అగ్ని అంతా ఉంటుంది. అద్యతన భావిలోనే భారత దేశం గొప్ప ఘనతను సాధిస్తుందన డానికి అతనొక్క క్షణం కూడా సందేహించలేదు. భారతదేశపు ఘనతను గురించి అతి కొద్ది మంది కనగల కలలనే అతడు కన్నాడు. పరిపూర్ణ స్పృహలో ఉండి కన్న కలలవి. ఆ కలలు అతని శరీరంలో కణకణాన్నీ ప్రేరేపించాయి. ఆ కలలను మన దైనందిన జీవితాల్లోకీ, ఈ భౌతిక

ప్రపంచంలోకి తెచ్చి రుజువు పరచేందుకు అతను తన ప్రతి చర్యను ఆచి తూచి చేశాడు.

మానవుడు తానుగా చేసేది ఏమీ వుండదనీ, ప్రపంచ వ్యవహారాలన్నీ భగవల్లీలలేననీ అశుతోష్ నమ్మాడు. ఓ సారి-ఒక స్నేహితుడికి బాగా జబ్బుచేసి చావు బ్రతుకుల మధ్య అల్లాడుతూ వుండగా, "అంత్యకాలం సమీపించిం" దని డాక్టర్లు చెప్పేస్తే, "ఏం తెలుసు ఈ డాక్టర్లకి? అసలు డాక్టర్లేం చెయ్యగలరని? అంతా భగవంతుడి చేతుల్లో కదా ఉన్నది।" అన్నాడు అశుతోష్. (అంతెందుకు?) కలకత్తా యూనివర్సిటీని అత్యున్నతాదర్శవంతమైన విశ్వవిద్యాలయంగా తీర్చిదిద్దడానికి తాను అనుభవించిన మహా ప్రయాసకు అతన్ని సిద్ధంచేసింది "ఈశ్వరేచ్ఛ ఎలా వుంటే అలా జరుగుతుం" దన్న ఈ విశ్వాసమే. యూనివర్శిటీ ఒకానొక క్లిష్ట పరిస్థితిని ఎదుర్కొన్నప్పుడు, 1922 డిశంబర్ 8వ తేదీని సెనేటు నుద్దేశించి చేసిన ప్రసంగంలో అతనిలా అన్నాడు; "మిత్రులారా। ఈశ్వరేచ్ఛ ఏమీ లేదని ఒక్క క్షణం కూడా అనుకోకండి. శాస్త్రవిజ్ఞానం తత్త్వ శాస్త్రం మీ కలా ఏమైనా బోధించివుంటే ఆ పొరపాటు భావాన్ని వదిలేయండి. బెంగాల్‌లో ఉన్నత విద్య ఉండకూడదని భగవదిచ్ఛ అయితే అలాగే జరుగుతుంది. నాకు మాత్రం ఈశ్వరలీల పట్ల అచంచలమైన విశ్వాసం వుంది. నా ప్రయత్నాల్లో, విపత్తులలో, నాకు (ఆధారభూతంగా) ఉంటూవచ్చిన ఏకైక ప్రేరణ అదే."

యూనివర్శిటీ కార్యకలాపాల నిర్వహణలో అశుతోష్ చాలా వ్యతిరేకతకు గురైనాడు. గిట్టనివాళ్ళు అతన్ని అహంభావి అన్నారు, నిరంకుశుడని అన్నారు. ఇదంతా పొరబాటు. ఇతరుల స్వతంత్ర భావాలను ప్రోత్సహిస్తూ, అతనెప్పుడూ సరైన వాదాన్ని వినడానికి సిద్ధంగానే ఉండేవాడు. కాని, పిడివాదం చేసేవాళ్ళపట్ల అతని కెప్పుడూ ఓర్పుండేది గాదు. వాళ్ళని నాలుగు దులిపేసి వదలగొట్టుకునే వాడు. వైస్‌ఛాన్సెలర్‌గా పునర్నియామ కానికి లిటన్ చేసిన అవమానకర ప్రతిపాదనను అతను తిరస్కరించగా, అతని తరువాత (1923లో) కలకత్తా యూనివర్శిటీకి వైస్ ఛాన్సెలర్‌గా వచ్చిన భూపేంద్రనాధ్ బసు; అశుతోష్ "శత్రువైతే-ఉదారుడైన శత్రువనీ, "మిత్రుడైతే ప్రాణమిత్రు" డనీ పేర్కొన్నాడు. "పదవీ స్వీకారం చేసే

టప్పుడు నాకు నిజంగా కాళ్ళు వణికాయనుకోండి! అయితే నాకు వేగమే తెలిసిపోయింది; అశుతోష్‌ని ఒప్పించడం సుళువేనని. మనం అనుకున్నది అతని దృక్పథం ప్రకారం లేకపోయినా అది ఇతరులు అనుకూలంగా భావించేదేనని అతనికి తోస్తే దానికి ఖచ్చితంగా అతని ఆమోదం వుంటుంది." ........ లార్డ్ కార్మిషేల్ కూడా ఇలాంటి అభిప్రాయమే వ్యక్తపరచాడు: "అశుతోష్‌ని ఒప్పించడం కష్టం, కాని అతనిలో నమ్మకం కలిగించే ప్రయత్నాని కతను సుముఖుడే."

పత్రికలు కొన్నిట్లో అశుతోష్ పద్ధతుల మీద విమర్శలు రేగాయి. కాని అవన్నీ కూడా యూనివర్శిటీ అంటే ఏమిటో, దానికి అశుతోష్ చేస్తున్న దేమిటో తెలియని అజ్ఞానపు దినాల్లో ఉద్భవించాయి. అశుతోష్ అలాంటి విమర్శలను సాధారణంగా మౌన ద్వేషంతో చూసేవాడు. తన మట్టుకు తనకి తన ధ్యేయం స్పష్టమే. తాను భారతదేశాన్ని ఇంకా మేలైన దేశంగా, ఇంకా ఘనమైనదిగా రూపొందిస్తున్నానని అతనికి తెలుసు. అందుచేత (అలాంటి) వ్యతిరేకత రావడమూ సహజమే, వాళ్ళకున్న దానికంటె మేలైన తన జ్ఞానం సహాయంతో, శక్తిమంతమైన వాదంతో ఆ వ్యతిరేకతను త్రోసి రాజనడమూ సహజమే.

సర్ అశుతోష్ మరణించాక అతన్ని గురించి సర్ మైకేల్ శాడ్లర్ వ్రాసిన మాటలు ఒక యోగ్యతా పత్రంగా పరిగణించవచ్చు. "సర్ అశుతోష్‌ముఖర్జీ (అస్తమయం) తో భారతదేశం తన అత్యుత్తమ పుత్రుల్లో ఒకణ్ణి; ప్రపంచం ఒక వ్యక్తిని పోగొట్టుకున్నాయి. అతను అజేయుడు. ఒక సామ్రాజ్యాన్ని ఏలదగినవాడు. కాని తన శక్తినంతా విద్యారంగానికి ధారపోశాడు. ఎందుకంటే; సరిగ్గా చెప్పవలసొస్తే మానవ సంక్షేమం విద్యలో ఉంది; ఏ రాజ్యానికైనా సరే నైతికబలం విద్యలోనే ఉంది. అతను స్వేచ్ఛాకామి. కాని అతనికి అరాజకంఅంటే భయమూ అసహ్యమూనూ...."

"అతను గోఖలేకి ఆధ్యాత్మిక వారసుడు. యువతరానికి మరో సారథి. విద్యా సేవకుడు. అయితే, అమెరికన్ దేశభక్తుడు బుకర్ వాషింగ్టన్‌తో అతనికి - భౌతిక శక్తిలో, నైతిక పరాక్రమంలో - నిజమైన సారూప్యతలు మరిన్ని ఉన్నాయి.

"సర్ అశుతోష్ని "బెంగాల్ పులి" అన్నారు. ఇది తప్పు. అంత కంటె ఔదార్యంగల జంతువుతో అతన్ని సరిపోల్చవలసి వుంది....మాట వరసకి బ్రిటిష్ బుల్‌డాగ్‌కున్న సున్నితమైన మనసు, సంకల్ప దారుఢ్యం అతని కున్నాయి....

"అతనికి మంచి హాస్యప్రియత్వం ఉంది. స్మరణీయమైన హావం అతనిది. ఒక వాదం బయలుదేరితే తనకున్న గ్రాహ్యశక్తి చేత ప్రతి హాంశాన్ని అర్థం చేసుకుని అందుకుంటాడు. మనసు స్వతంత్రమైనది; భయం ఎరగనిదీనూ. అతనెన్నడూ యెవరికీ లొంగిపోలేదు!....

"సర్ అశుతోష్‌లో హిందూ సంప్రదాయం పాశ్చాత్య పంస్కృతి మిశితమైనాయి. అతని శీల ప్రవర్తనల కాధారం మత సంబంధేగాని రాజకీయంకాదు. అతని సున్నితమైన మనసు, మాతృస్మృతులమీద అతని పూజ్యభావం, కుటుంబంపట్ల అపేక్ష ఇవన్నీ అతనికి స్వాభావికంగానూ; అంతశ్శుద్ధి చేతనూ ఏర్పడ్డాయి. తాను శ్రద్ధాళువైన హిందువు. అయినా ఇతర మతాల్లోని స్త్రీ పురుషుల నమ్మకాలను, పూజా ధర్మాలను అతడు గౌరవించాడు. అందరికీ అందుబాటులో ఉంటూ, అతను, ఎవరితోనైనా విభేదించగల వ్యక్తి....*"

*కలకత్తా రెవ్యూ, జూలై 1924........

# 10. సరస్వతీ ఉపాసకుడు

అశుతోష్ ముఖర్జీ గురించి ఎంతచెప్పినా అతని గొప్ప పుస్తక సంచయం గురించి చెప్పకపోతే అది పరిపూర్ణం కాదు. దాదాపు డెబ్బయి రెండువేల పుస్తకాలుగల అతని అఖండ గ్రంథ సంచయాన్ని అతని కుమారులు కలకత్తా నేషనల్ లైబ్రరీకి బహూకరించారు. అవిప్పుడు జాతీయ సంపద. అతని తండ్రిగారైన డాక్టర్ గంగాప్రసాద్ ముఖర్జీ బహుముఖ అభిరుచులుగల వ్యక్తి. అతని దగ్గిర చాలా పుస్తకాలుండేవి. అశుతోష్ పసితనం నుంచీ పుస్తకాల మధ్యనే పెరిగాడు. పాఠశాల రోజులనుంచీ అశుతోష్ కుండిన జ్ఞానతృష్ణ అతనికి పుస్తకాలమీద శ్రద్ధాసక్తులను పెంచింది. వాళ్ళ నాన్నగారు అతని మెదడుకి మేతపెట్టడానికి ఎన్నడూ వెనకాడకుండా అతన్ని ప్రోత్సహించారు. అశుతోష్ మొట్టమొదటి అభిరుచి గణితశాస్త్రంమీద. అంచేత డాక్టర్ గంగాప్రసాద్ ముఖర్జీ అతనికోసం గణితశాస్త్రానికి సంబంధించిన పత్రికలతోసహా ముచ్చటైన పుస్తక సంచయాన్ని సమకూర్చి పెట్టాడు. విద్యార్థి దశనుంచీ కూడా, తండ్రిగారేర్పరచిన ఈ కేంద్రానికి తన స్వంత డబ్బుతో మరింత పుష్టిని చేకూర్చాడు. స్కాలర్ షిప్ రూపంలో వచ్చిన ప్రతి రూపాయి పుస్తకాలు కొనడానికే ఖర్చయింది. విద్యార్థిదశ అంతటా అతనికి స్కాలర్‌షిప్పులు వస్తూనే ఉండేవి కనక, అలావచ్చిన మొత్తం డబ్బు తక్కువేం కాదు. ఆ తరువాత జీవితంలో స్థిరపడ్డాక కూడా తన సంపాదనలో అ ధి క భా గా న్ని పుస్తకాలమీదనే ఖర్చుపెట్టాడు.

అతని గ్రంథ సంచయంలోని పుస్తకాల్లో చాలావరకు అపురూపమైనవీ, అచ్చులో లేనివీనీ. కలకత్తాలో పాత పుస్తకాల షాపుల్లోంచి కొన్నాడు. ఎవరైనా వ్యక్తులు తమ స్వంత గ్రంథ సంచయాన్ని అమ్మేసుకుంటున్నా రంటే అవి కొన్నాడు. యూరప్‌లోను అమెరికాలోను ఉన్న ప్రచురణ కర్తలకి ఉత్తరాలురాసి నిలకడగా వాడుకగా (తమ ప్రచురణల) పుస్తకాలను పంపుతూ వుండవలసిందిగా ఇచ్చిన ఆర్డర్ల ద్వారా కొన్నాడు.

ఏవైనా పుస్తకాలు పరిమిత సంకలనాలుగావస్తే వాటిని కొనుక్కోడం అశుతోష్‌కి ప్రత్యేకంగా ఇష్టం. ఇలాంటివి చాలావరకు యూరోపియన్ సాహిత్యానికి సంబంధించిన గ్రంథాలు. పంథొమ్మిదో శతాబ్దంలోను, ఈ శతాబ్దపు మొదటిభాగంలోనూ ప్రచురణకర్తల కొక (తమాషా అయిన) అలవాటుండేది. పుస్తకాలు పరిమిత సంఖ్యలో చందాదారులకోసం మాత్రం అచ్చు వెయ్యడం; అచ్చుపని పూర్తయిన వెంటనే పైపులు కలిపెయ్యడం. సాధారణంగా ఇలాంటి పుస్తకాలు ఎక్కువ ఖరీదులో ఉండేవి. ఇవి చేతిపని కాగితంమీద. ఒక్కొక్కప్పుడు పలుచనితోలు (షీట్ల) మీద అచ్చువేసేవారు. వాట్లో కూడా, చాలమట్టుకు చేత్తోగీసిన బొమ్మలు, చేత్తో చేసిన అలంకారాలు వుండేవి. అశుతోష్ పోగుచేసిన వాట్లో అలాంటివి కొన్ని ఉదాహరించు కోవచ్చు; 1905లో ప్రచురించిన రాబర్ట్ బ్రౌనింగ్‌గారి 'ది ఫ్లయిట్ అఫ్ ది డచెస్' (ఈ పుస్తకం మొత్తమంతా తోలు షీట్లమీదనే అచ్చేశారు; అదీ 125 కాపీలు మాత్రమే; అందులో అశుతోష్ కాపీ నెంబరు 15.) గాటీ రచించిన "కింగ్ కేన్డొల్స్" (1898); ఫ్లాబర్ట్ "సింపుల్‌హార్ట్" (1898); లోంగస్ ప్రఖ్యాత కథ "డాఫ్ని అండ్ క్లో" (1898); ఈ మూడూ, ఆ ప్రత్యేక సంకలనాలలో పదమూడో నెంబరువి; వాటిమీద "గౌరవనీయులైన డాక్టర్ అశుతోష్ ముఖోపాధ్యాయ గారికోసం అచ్చువేయడమైనది" అని గమనికతో సహా - అలాంటివే మరోకొన్ని: "ది ఇంగ్లీష్ బైబిల్" - డోవర్ ప్రెస్సువారు వేసినది - "అచ్చు పుస్తకాల్లో అతి దర్జా అయినవాట్లో ఒకటి"గా పేర్కొన్నది; చేతిపని కాగితం మీద అచ్చేసి, ఓక్ కవర్లతో, తోలుపట్టీ నడుంతో బైండు చేసినది; రెండువైపులా కవర్లను పట్టి నిలిపేందుకు క్లిప్పులు అమర్చినది — "ది బుక్ అఫ్ కామన్ ప్రేయర్." అలాగే జర్మన్ భాషలో అద్భుతమైన బైండింగు - అలంకరణలతో పవిత్ర సంకలనం - గెథే రచించిన ఫాస్ట్; (1874). 1248 దారు చిత్రాలతో ఎని మిది సంపుటాల సెట్టు - "ది వర్క్స్ అఫ్ విలియమ్ షేక్స్‌పియర్" (1893); ప్రఖ్యాత ఆంగ్లేయ చిత్రకారుల దారు చిత్రలూ బొమ్మలూ సంక లించి బొయిడెల్ రూపొందించిన "ఇలస్ట్రేషన్స్ అఫ్ ది వర్క్స్ అఫ్ షేక్స్‌పియర్" (1852) అనే రెండు బృహత్సంపుటాల అమెరిన్ సంక లనం. ప్రత్యేకంగా రచించిన చిత్రాలతో, చక్కని బైండ్లతో, పరిమిత సంకలనాలుగా విడిగా అచ్చువేసిన షేక్స్‌పియర్ నాటకాలు కూడా ఈ సంచ

యంలో ఉన్నాయి. 1902లో, సిడ్నీలీ 'పరిచయం' తో, షేక్స్పియర్ నాటకాల తొలి బృహద్గ్రంథపు ఫాసిమిలీ ప్రచురణ జరిగింది. ఇది పరిమిత సంకలనం. అశుతోష్ కాపీ నెంబరు 421. మిల్టన్ పారడైజ్ లాస్ట్ తొలి సంకలనం (1688); 1794-97 మధ్య ప్రచురించిన మిల్టన్ కవితా సర్వస్వం (మూడు సంపుటాలు); జా న్ ర స్కి న్ రచనలు (ముప్ఫయి తొమ్మిది సంపుటాలు: మేలు ప్రతులు); ఆక్స్ఫర్డు వారు సంకలనం చేసిన శామ్యూల్ జాన్సన్ రచనలు (పదకొండు సంపుటాలు) ఈ సంచయంలో ఉన్నాయి.

అశుతోష్ గ్రంథ సంచయంలో ప్రచురణకాలం దృష్ట్యా అపురూప మైన పుస్తకాలు కొన్ని ఉన్నాయి. అందులో కొన్ని- బొమ్మలూ సందర్భవ్యాఖ్యలూ చేర్చిన "ఈసప్స్ ఫేబుల్స్" తొలి సంకలనం (1668). యూక్లిడ్స్ ఎలిమెంట్స్ ఆఫ్ జామెట్రీ - తొలిసారిగా ఆంగ్లంలోకి హెచ్. బిల్లింగ్స్ లీ అనువదించిందీ, 1570లో జాన్‌దే (లండన్) ప్రచురించిందీ. డెమాస్తనీసు ఉపన్యాసాలు, గ్రీకు లాటిన్ భాషల్లో కుడి ఎడమ పుటల్లో అచ్చువేసినది (1599). ఫోర్టెస్క్యూ "లాజ్ ఆఫ్ ఇంగ్లాండ్" - లాటిన్ ఇంగ్లీషు భాషలు ఎదురెదురు కోలములలో అ చ్చు వే సి న ది (1573). శామ్యూల్ జాన్‌సన్ చేసిన "డిక్షనరీ ఆఫ్ ఇంగ్లీష్ లాంగ్వేజ్" మొదటి సంకలనం (1755). జాన్ మిన్షీ (ప్రొఫెసర్ ఆఫ్ లాంగ్వేజెస్, లండన్ వ్రాసిన ఫ్రెంచి డిక్షనరీ (1599). థామస్ కొరియేట్ రాసిన మొగలాయీ దర్బారుపై వివేదిక (1616లో అచ్చయింది).

సర్ వాల్టర్ స్కాట్, డేనియల్ డిఫో, చార్లెస్ డికెన్స్, జార్జి ఇలియట్, రడ్‌యార్డ్ కిప్లింగ్, రాబర్ట్ లూయీ స్టీవెన్సన్, విలియమ్ మేకపీస్, థేకరే, చార్లెస్ అండ్ మేరీ లాంబ్ లవి; కొందరు ఇతరులవి రచనలు; పెద్ద పెద్ద సెట్‌లు; ఆ గ్రంథ సంచయాన్ని అలంకరించాయి. అమెరికన్ సాహిత్యంలో హెచ్. డబ్ల్యు. లాంగ్‌ఫెలో, ఎడ్గార్ అ లె న్ పో, వాల్ట్‌విట్‌మన్, నెథేనియల్ హథార్న్, హెన్రీజేమ్స్, వాషింగ్టన్ ఇర్వింగ్‌ల రచనలున్నాయి.

ఇంగ్లీషు కాక ఇతర యూరపియన్ భాషలలో మహద్గ్రంథాలు కూడా ఈ సంచయంలో ఉన్నాయి. ఫాస్ట్ కాక, గెథె ఇతర రచనలన్నీ పద్యాలుగు

సంపుటాల్లో ఉన్నాయి. మొలియర్, బాల్జాక్, గాటియెర్, ఫ్లాబర్ట్, వాల్టేర్‌ల రచనలున్నాయి. అశుతోష్‌కి డాం క్విక్సెట్ సాహస గాథలంటే ప్రత్యేకమైన ఇష్టం వున్నట్టు కనపడుతుంది. ఎందుకంటే, 1605లో అచ్చువేసిన ఈ స్పేనిష్ ఉద్గ్రంథం తొలి సంకలనపు ఫాసిమిలీ పునర్ముద్రణ (1905) నొకదానిని అతను సంపాదించాడు. అంతేకాదు; డాం క్విక్సెట్ సాహస గాథకు ఇరవై కి పైగా ఇంగ్లీషు ఫ్రెంచి అనువాదాలు ఈ సంచయంలో ఉన్నాయి. గ్రీకు, లాటిన్ భాషలలో ప్రఖ్యాత రచయితల రచనలున్నాయి. ఓవిడ్, వర్జిల్, సిసిరో, లీ వీ, టాసిటస్‌ల రచనలు, ఏష్కిలస్, సోఫోక్లిజ్, యురిపిడిస్‌ల విషాదాంత నాటకాలు; అరిస్టాఫేన్స్ సుఖాంత నాటకాలు; హోమర్, థుసిడిడ్స్‌ల కావ్యాలు వివిధ సంకలనాలు; ప్లేటో "డయలాగ్స్"; అరిస్టోటిల్ "పొయటిక్స్"; ప్లూటార్క్ 'లైవ్స్' ఉన్నాయి.

అశుతోష్ గ్రంథ సంచయంలో ప్రాచ్య వాఙ్మయంలోని ఉద్గ్రంథాలు చెప్పుకోదగ్గ సంఖ్యలో ఉన్నాయి: మాక్స్ ముల్లర్ సంకలనం చేసిన "సేక్రెడ్ బుక్స్ ఆఫ్ ది ఈస్ట్" .... రామాయణం వివిధ సంకలనాలున్నాయిందులో, సార్డీనియా రాజు చార్లెస్ ఆల్బర్ట్ ఖర్చుతో వేసిన ( గొరేసియో ) పది సంపుటాల రామాయణం దివ్యంగా వుంది. విలియమ్ కేరే, జోషువా మార్ష్‌మన్ కలిసి సంస్కృత రామాయణం అసలు పాఠాన్ని సంపాదించి సంస్కరించి ఆంగ్లములో వచన అనువాదం వివరణా యివ్వదలచుకుని ఒక పథకాన్ని చేపట్టారు కదా; ఆ ప్రణాళికలో రెండే సంపుటాలు వెలువడ్డాయి; అశుతోష్ ఆ రెండింటినీ సంపాదించాడు. వేదాలు, పురాణాలు, ఉపనిషత్తులు మొదలైన ప్రామాణిక సంస్కృత గ్రంథాలు వ్యాఖ్యానాలతో సహా అశుతోష్ గ్రంథ సంచయంలో ఉన్నాయి. బోట్లింక్ ఏడు సంపుటాలుగా చేసిన సంస్కృత నిఘంటు, రాధాకాంత్‌దేవ్ శబ్ద కల్పద్రుమం కూడా అశుతోష్ కొనుక్కున్నాడు. మరో అపురూప గ్రంథం కల్హణుడి "రాజ తరంగిణి" (1840); ఇందులో సంస్కృత మూలం, ఫ్రెంచి అనువాదం ఉన్నాయి.

ఉమర్ ఖయ్యాం రుబాయీలు వేర్వేరు సంకలనాలు ముప్ఫయికి పైగా అశుతోష్ పోగుచేశాడు. వీటిలో చాలా వరకు పరిమిత సంకలనాలు; బొమ్మ

లతో, ఆర్టిస్టుల సంతకాలతో ఉన్నాయి. ఇందులో ఒకటి, అవనీంద్రినాథ్ టాగోర్ రచించిన చిత్రాలతో ఉంది. అరేబియన్ నైట్స్ కూడా చాలా సంకలనాలున్నాయి. అందులో ముఖ్యంగా చెప్పుకోతగ్గది! "కలకత్తా ఎడిషన్" దీని ప్రత్యేకత ఏమిటంటే మేజర్ టర్నర్ మెకాన్, భారతదేశానికి తెచ్చిన ఈజిప్షియన్ వ్రాతప్రతి ఆధారంగా, డబ్ల్యు. హెచ్. మాక్నాటెన్ సంపాద కత్వంలో తయారైందిది; 1839-42 సంవత్సరాల్లో నాలుగు సంపుటాలుగా డబ్ల్యు. థేకర్ కంపెనీ వారు ప్రచురించారు.

విద్య, రాజ్య పరిపాలనా శాస్త్రం, చరిత్ర, మానవ వర్ణనాశాస్త్రం.... ఈ విషయాలపై ఉన్న పుస్తకాలు అసంఖ్యాకాలు. వీటిని, ( తన ) న్యాయ శాస్త్రం గ్రంథాల్లాగే అశుతోష్ నిత్యం వాడుతూ వుండేవాడు. కన్ఫ్యూషియస్, కాంట్, హాబ్స్, వోల్టేర్, ఎమర్సన్‌ల రచనలు అతని గ్రంథ సంచయంలో ఉన్నాయి. వేదాలు, హిందూ ధర్మ శాస్త్రాలు, బైబిలు, కొరానులు, బౌద్ధమతంపై రచనలు, అనేక సంకలనాలున్నాయి.

ఈ సంచయంలో యాత్రా చరిత్రలు పుష్కలంగా ఉన్నాయి. హాక్లుయిట్ సొసైటీ ప్రచురణలు 180 సంపుటాలుతో ఉన్నాయి. పూర్చాస్ వ్రాసిన "పిల్‌గ్రిమ్స్" సెట్టు (పరిమిత సంకలనం, 100 సెట్లు మాత్రం) ఉంది. హుయాన్‌త్సాంగ్, ఫాహియాన్ యాత్రల చరిత్రలను అశుతోష్ తన గ్రంథ సంచయం కోసం కొనుక్కున్నాడు. బుకనాన్ వ్రాసిన "ఎ జర్నీఫ్రమ్ మద్రాస్" మొదలైనవి, రెనెల్ వ్రాసిన "మెమొఇర్స్ ఆఫ్ ఎ మ్యాప్ ఆఫ్ హిందూస్తాన్ (1792); మెమొఇర్స్ ఆఫ్ ది పెనిన్సులా ఆఫ్ ఇండియా" (1793) - దీంట్లో చేరాయి.

గణిత శాస్త్రానికి సంబంధించిన పుస్తకాల్లో "కలెక్టెడ్ మేథ మేటికల్ పేపర్స్' (ఆర్థర్ కే లీ వి) పదమూడు సంపుటాలు; కలెక్టెడ్ మేథమేటికల్ పేపర్స్ (జె. జె. సిల్వెస్టరివి); "సైంటిఫిక్ పేపర్ ఆఫ్ జె. సి. ఆడమ్స్"; లా ప్లేస్ వ్రాసిన "మెకానిక్ సెలిస్టి" (అందమైన మొరాకో బైండింగులో నాలుగు సంపుటాలు) ఉన్నాయి. (యూక్లిడ్ వ్రాసిన రేఖా గణిత శాస్త్రానికి 1570లో ప్రచురితమైన తొలి ఆంగ్ల అనువాదం ఉన్నట్టు లోగడ తెలుసుకున్నాం.)

వాస్తుశాస్త్రం, శిల్పశాస్త్రం, కళ, సంగీతం మొదలైన విషయాల మీద పుస్తకాలు వెయ్యి ఉంటాయి. రాజగిరి, బాదామి, కోణార్క ఫొటోల ఆల్బములను గురించి ప్రత్యేకంగా ఉదాహరించాలి. అలాగే, అజంతా గుహల్లో బౌద్ధ చిత్రాలు (జాన్ గ్రిఫిత్స్ ప్రచురణ-1896-97); "ఇండియన్ జువెలరీ", "ఇండియన్;సిల్క్" సంపుటాలు; పరిమిత సంకలనంగా వచ్చిన సి. ఆర్. డే. గారి ''దిమ్యూజిక్ అండ్ మ్యూజికల్ ఇన్‌స్ట్రుమెంట్స్ అఫ్ సౌత్ ఇండియా అండ్ డెకన్" (1891) అనే పుస్తకమున్నూ.

పద్దెనిమిది పంథొమ్మిదో శతాబ్దాల్లో (కొందరు) యూరపియన్ కళాకారులు భారత దేశానికి వచ్చారు. ఆ సందర్భంగా వారు చేసిన రచనలు ఈ సంచయంలో ఉండడం చెప్పుకోదగ్గ విశేషమే. చేతితో రంగులు వేసిన విలియమ్ హోడ్జెస్ "వ్యూస్ ఇన్ ఇండియా", తోమస్ డేనియల్ "ఓరియెంటల్ సీనరీ" అనే పెద్దపెద్ద సంపుటాలు; హిందువుల దుస్తులు వృత్తులు పండగలు ఆధారంగా సోల్విన్స్ చేసిన "లె హిందూ" అనేచిత్తరువుల పుస్తకం; శ్రీమతి బెల్నాస్‌ది-"సంధ్య ఆర్ ది డెయిలీ ప్రేయర్స్ అఫ్ ది బ్రామిన్స్" ఈ సంచయానికి ఘనతను తెచ్చాయి. అశుతోష్ కళాభిమాని అవడం చేత ఇంచుమించు అన్ని యూరపియన్ సిద్ధాంతాలకు చెందిన ప్రఖ్యాత చిత్రకారుల చిత్రాల ఆల్బములను కొన్నాడు.

అనుకున్న విధంగానే; ఈ పుస్తక సంచయంలో న్యాయశాస్త్ర విభాగానికి ప్రత్యేకమైన గొప్పతనం ఉంది. క్రమప్రచురణ జరిగిన ఇంచుమించు అన్ని ప్రఖ్యాత భారతీయ న్యాయశాస్త్ర గ్రంథాలు అక్కడున్నాయి. క్రమప్రచురణ జరిగిన ఆంగ్లేయ న్యాయశాస్త్ర గ్రంథాల్లో ఎడ్మిరాల్టీ, ఛాన్సరీ, ఎక్స్‌చెకర్, కింగ్స్‌బెంచ్, క్వీన్స్‌బెంచ్ మొదలైన న్యాయ స్థానాలకు సంబంధించినవి; పద్దెనిమిది పంథొమ్మిదవ శతాబ్దాల న్యాయశాస్త్ర నివేదికలున్నాయి. దివాలాకు దేశాచారానికి సంబంధించిన నివేదికలు ప్రత్యేకంగా చెప్పదగినవి. అశుతోష్ గ్రంథ సంచయంలో అమెరికా సంయుక్త రాష్ట్రాల, కెనడా ,సింహళాల న్యాయశాస్త్ర నివేదికలున్నాయి.

తాను పోగు చేసుకుంటున్న పుస్తకాల సంఖ్య హెచ్చుతున్న కొలది, వాటిని భద్రపరచడానికి అశుతోష్‌కి తన ఇంటో గది తరువాత గది

చొప్పున కట్టించుకుంటూ రావలసొచ్చింది. అప్పటికి అంత పెద్ద ఇల్లున్నా సరే, ప్రతి గదిలో నేలనుంచి కప్పు వరకు; వరండాల్లోను ఆఖరికి మెట్లకింద కూడాను, ఎక్కడ పడితే అక్కడ పడుందేవి పుస్తకాలు. చాలా పుస్తకాలను సంతాల్ పరగణాల్లో మధుపూర్‌లో ఉన్న ఇంట్లో జాగ్రత్త చేసేరు. పుస్తకాల మీద పడేదుమ్ము దులపడానికి ప్రత్యేకం నౌకర్లు. అతను చెప్పినట్టు పుస్తకాలు బైండింగు చేస్తూ ఉండడానికి ఓ చిన్న బైండింగు విభాగం ఉండేది.

అశుతోష్, పుస్తకాలకి జాబితాలు వ్రాయించేపని పెట్టుకోలేదు. ఎందుకంటే ఈ పుస్తకాలన్నీ తన కోసం. వాట్లో ఏదెక్కడుందో ఎలాగా అతనికి ఖచ్చితంగా తెలుసును. తను చూద్దామనుకున్న పుస్తకం సులువుగానే కనుక్కునే వాడతను.

అతని పుస్తకాల్లో చాలా వాటి మీద అతని సంతకం, పుస్తకం కొన్న తేదీ, ఎంతక్కొన్నాడో ఆ వెల ఉండేవి. చాలా పుస్తకాల మార్జిన్లలో అతను రాసిన నోట్సున్నాయి. అపూర్వమైన పుస్తకాల మీద "అరుదు" అనీ, "చాలా అరుదు" అనీ, "పోతే మరిదొరకదు సుమా" అనీ గుర్తుగా వ్రాసుకునేవాడు.

అశుతోష్ ఈ పుస్తకాలన్నీ ఊరికే పోగుచేసి కూర్చోలేదు. అతను బుద్ధి కుశలత గల చదువరి. పుస్తకాలతనికి నిరంతరం సహచరులు. జ్ఞానాన్ని ఇంత, అంత, మరింత-పెంచుకుందామనే అతని తృష్ణ తీరడానికి అవి అవసరం. ఇంచుమించు అన్ని విషయాల మీదా ఉద్గ్రంథాలు సేకరించడం వల్ల అతని అభిరుచి బహుముఖం అని రుజువైంది.

అతను సరస్వతీ ఉపాసకుడు.

కనుకనే, ఆ పూజా సామాగ్రి.